
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **మోహన్ పబ్లికేషన్స్** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన అర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **మోహన్ పబ్లికేషన్స్** వారి వెబ్ సైట్: http://www.mohanpublications.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) అర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com.

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **మోహన్ పబ్లికేషన్స్** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

మోహన్ పబ్లికేషన్స్ వారి వెబ్ సైట్:

http://www.mohanpublications.com/



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఓజసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీ మద్భగవద్గీత - అంతరార్థ విశేషణాయత్నం

## ముందు మాట

ప్రపంచంలో ఏ గ్రంథంలోనైనా మానవుని భగవంతునికి దగ్గర చేయాలనే తలంపు, ధర్మమార్గంలో నడిపించాలనే ఆశ తప్పక కనబడతుంది. ఎందుకంటే సృష్టిలో మానవుడు ఒక్కడికే భగవంతుడు జ్ఞానం ఇచ్చాడు. అలాంటి మానవుడు ధర్మంగా ప్రవర్తిస్తే సృష్టి అంతా ధర్మంగా నడుస్తుంది. కానీ మానవుడు ధర్మం తప్పి స్వార్థం, హింస పెంచుకుని దుఃఖం అశాంతిని కొని తెచ్చుకున్నాడు.

ఈ విధంగా మనిషి పతనం వైపు ప్రయాణం చేయటం మొదలుపెట్టడం చూసి, వారిని తిరిగి సన్మార్గంలో పెట్టాలని కొంతమంది పుణ్యాత్ములు - మహర్షులు - ప్రవక్తలు ధర్మ పథాన్ని బోధిస్తూ అనేక ధార్మిక గ్రంథాల్ని వ్రాసారు. అలాంటి ముఖ్య గ్రంథాలలోనే కిరీటం వంటిది భగవద్గీత. ఎందుకంటే ఏ గ్రంథంలోనైనా ముఖ్యంగా నరహింస "చేయకూడదు" అని చెప్పబడింది. కానీ ఒక్క భగవద్గీత మాత్రమే "జీవహింస చేయకూడదు" అని చెపుతుంది. అలాంటి అహింసా మార్గాన్ని ప్రబోధించే భగవద్గీతను మన పూర్వీకులు సంస్కృతంలో వ్రాసారు. కొందరు దానిని తెలుగులోకి అనువదించారు. వారిలో చాలా మంది గీతలో శ్లోకాలకు స్థూల అర్థాన్ని మాత్రమే ఎక్కువగా ఇచ్చారు. గీత చదువు వచ్చిన వారికే పరిమితం కాదు. సర్వ మానవలోకానికి ఆచరణీయమైన ఉత్తమోత్తమ గ్రంథం - అది మానవజీవితాలకి సుగంధం. అలాంటి గీతలోని అంతరార్థాన్ని సామాన్య భాషలో సాటి మానవులకు అందించాలని మా ప్రయత్నం. ఎందుకంటే భావం అర్థం చేసుకోవడానికి భాష కావాలి. భాష అర్థం కాకపోతే భావం తెలియదు. భావం తెలియకపోతే మనస్సుకు స్పందన రాదు. మనస్సుకి స్పందన వస్తేనే మనిషి ఆ మార్గంలో ముందుకు వెళ్లగలడు. ఆ కారణంగా భగవంతుని స్మృతిలో మొత్తం గీతా శ్లోకాలను కాకుండా కొన్ని శ్లోకాలను మాత్రమే తీసుకొని క్లుప్తంగా అంతరార్థ వివరణ గ్రామీణ భాషలో, ఉదాహరణలతో, నీతి కథలతో కలిపి అందరి మనస్సులకి హత్తుకునేలా తెలియచేయాలని మా తపన. దీనిలో ఏమైనా తప్పులుగా మీకు అనిపిస్తే మమ్మల్ని క్షమించండి. ఎందుకంటే మేము భాషా







పాండిత్యం ఉన్న పండితులం కాదు. అందరి పట్ల సమదృష్టి కలిగి ఉండాలని భగవంతుడు చెప్పిన మహావాక్యాలను మనస్ఫూర్తిగా నమ్మిన సామాన్యులం. మీరు చదువుతున్న ఈ పుస్తకంలో మా భాష కంటే మా భావాన్ని మీరు గ్రహించగలరని మనసారా కోరుకుంటున్నాము. ఈ చిన్ని ప్రయత్నం చేసే ముందు మేము గీతా మకరందం అన్న గ్రంథాన్ని చదివి దానిని ఆధారంగా చేసుకుని ముందుకు సాగుతున్నాము. ఎందుకంటే గీతా మకరందంలో రచయిత చాలా వరకు చక్కని అంతరార్థాన్ని తెలియచెప్పారు. అది ఎంతో ఆనందకరమైన విషయం. ఇంకా అంతరార్థాన్ని అందరికీ అర్థం అయ్యే విధంగా సామాన్య భాషలో చెప్పాలని మా ఈ ప్రయత్నం.

**శ్రీ మద్భగవద్గీత :-** అంటే స్వయంగా భగవంతుడు చూపించిన శ్రేష్ఠమైన దారి లేదా మార్గం అని అర్థం. మనిషి సక్రమమైన మార్గంలో నడిచి శాంతి - సుఖం పొందడానికి భగవంతుడు ఇచ్చిన సలహాలనే గీతాసారం అంటారు. అంతే కాకుండా "గీ" అంటే త్యాగాన్ని, "త" అంటే తత్వజ్ఞానం అంటే ఆత్మ జ్ఞానాన్ని తెలియచెప్పేది అని అంటే మనలో ఉండే చెడుని త్యాగం చేసి ఆత్మజ్ఞానాన్ని తెలుసుకునే మార్గం చూపించేదే గీత. అలాంటి గీతని మహా భారత యుద్ధ ప్రారంభానికి ముందు దుఃఖంతో నేను యుద్ధం చేయలేను అని ఏడుస్తున్న అర్జునునికి శ్రీ కృష్ణుడు బోధించాడని, దానిని వ్యాసుడు అనే మహర్షి ఛందోబద్ధంగా వ్రాశాడని చెప్తారు.

నిజానికి ఈ మహాభారత యుద్ధం జరిగిందా? లేదా? ఒకవేళ జరిగితే ఎక్కడ, ఎప్పుడు, ఎలా జరిగింది ఇవన్నీ మనకి ప్రస్తుతం అనవసరం. ఎందుకంటే నిజానికి మహాభారత యుద్ధం అనేది రోజూ మనలోనే - మన మధ్యనే జరుగుతోంది. ఇది మంచి, చెడులకు మధ్య జరిగే యుద్ధమే. ప్రతి మనిషిలోను మంచి తక్కువగాను, చెడు ఎక్కువగాను ఉంది. దానికి గుర్తుగానే పాండవులు 5గురు. కౌరవులు 100 మంది అని స్థూలంగా వ్రాసారు. పాండువులు భగవంతుని తోడు పెట్టుకుని కౌరవులను ఓడించి విజయం పొందారని వ్రాసారు. నిజానికి ఆ పాండవులు ఎవరు? కౌరవులు ఎవరు? అసలు భగవంతుడు ఎవరు? ఇవన్నీ స్థూలమైన పేర్లతో మనకి చెప్పారు. అంతరార్థం నిజంగా మనం తెలుసుకోగలిగితే ఆ యుద్ధ రహస్యం. విజయం పొందడం వెనుక భగవంతుని పాత్ర మనకు అర్థం అవుతాయి. భారత యుద్ధంలో పేర్లు పరిశీలిస్తేనే చాలా విచిత్రంగా ఉంటాయి.

**1. ధృతరాష్ట్రుడు** – రాష్ట్రాన్ని ధరించిన వాడు అంటే శరీరాన్ని ధరించినవాడు అని అర్థం. శరీరం అనేది గాలి, నీరు, అగ్ని, ఆకాశం, నేల అని పిలువబడే పంచతత్వాల కలయిక. నిజానికి శరీరం అశాశ్వతం, దానిని నడిపే ఆత్మ శాశ్వతం, ఎవరైతే తనని తాను ఆత్మనని మరచి శరీరమును తానుగా భావిస్తూ మమకారం, బంధు ప్రీతి అనే అజ్ఞానంలో ఉంటారో వాళ్లందరూ ధృతరాష్ట్రులే. ఈ రోజు ప్రపంచంలో చాలా మంది ధృతరాష్ట్రులే. ఎందుకంటే కళ్లుండి న్యాయాన్ని, ధర్మాన్ని చూడలేక పాపాలు చేస్తూ జీవిస్తున్నారు. అలాగే తమ భర్తలు ఎంత సంపాదించి తెస్తున్నారు అనే లెక్కే గాని "ఏ మార్గంలో తెస్తున్నారు. దాని వలన ఎంత పాపం వస్తుంది" అనేది ఆలోచించక భోగభాగ్యాలకి ప్రాకులాడే వాళ్లందరూ – గాంధారీ మాతలే.

**2. ధుర్యోధనుడు** – ధుర్ అంటే చెడు. ధన అంటే ధనంగా కలిగిన యోధుడు అని చెప్పుకోవచ్చును. ఎవరైతే చెడును ధనంగా కలిగి తప్పుడు మార్గంలో వెళ్తూ ఉంటారో వారే ధుర్యోధనులు.



**3. దుశ్శాసనుడు** – చెడును శాసనంగా అమలు చేసినవాడు అని అర్థం తీసుకోవచ్చును. (అందుకే భారతగాథలో స్త్రీ అని కూడా చూడకుండా ద్రౌపదిని జుట్టు పట్టి ఈడ్చుకువచ్చాడని, బట్టలు ఊడదీసి అవమానించాలని ప్రయత్నించాడని దాని కారణంగానే చివరికి యుద్ధంలో హీనంగా చనిపోయాడని వ్రాసారు.) నిజానికి అప్పుడైనా, ఇప్పుడైనా, ఎక్కడైనా ఆడదాన్ని అవమానించిన వారి బ్రతుకు చివరికి అంతే అని చెప్పడానికి అలా కథ రూపంలో వ్రాసారు.

**4. కర్ణుడు** – అంటే చెడు మాటలు విని చెడినవాడు. కర్ణం అంటే చెవి. ఎంత దాన, ధర్మాలు చేసినవాడైనా చెడు వ్యక్తుల స్నేహం చేస్తే కొన్నాళ్లకి ఆ చెడు వ్యక్తుల మాటలు వినీ వినీ తానూ చెడిపోతారని గుర్తుగా అలా వ్రాసారు.

**"పరమలోభిని – భిక్షం అడగటం, తన డబ్బుని – ఇతరుల ఇంట దాచడం, గుణం లేని వారిని – సేవించడం, పరుల పంచన – జీవించడం, లక్ష్య పెట్టని చుట్టాలతో – కలవటం, రాబడి లేకుండా అప్పు చేయటం, వ్యభిచారులతో – కలిసి తిరిగటం, దొంగలతో స్నేహం చేయటం. ఇవన్నీ ప్రపంచంలోకెల్లా హీనమైన విషయాలు. (నరసింహ శతకం నుండి గ్రహీతం)**

**5. భీష్ముడు** – అంటే భీష్మించుకుని కూర్చున్నవాడు అంటే మొండితనానికి గుర్తు. అందుకే భారతకథలో భీష్ముడు స్వచ్ఛందంగా తనకు తాను చావాలని కోరుకుంటేనే చావు వస్తుందని వ్రాసారు. అలాగే మనిషి తనలో ఉండే చెడుని తనకి తానుగా చంపుకోవాలి అనుకుంటేనే ఆ చెడు చస్తుంది. తప్ప దానంతట అదేద చావదు. అలా ఎవరైతే మొండిగా ఉన్నా చివరికి భగవంతుని స్మృతిలో మార్పు తెచ్చుకుని స్వచ్ఛందంగా మరణిస్తారో వారందరు భీష్ములే.

**6. శకుని** – అంటే శకునం అని అనుకోవచ్చును. మంచి శకునం అయితే శుభం జరుగుతుందని, చెడు శకునం అయితే కష్టాలు వస్తాయని మన పూర్వీకుల నుండి విశ్వాసం. శకుని అనేవాడికి చెడు శకునం అనే అర్థం బాగా నప్పుతుంది. ఈ రోజు కూడా ఎంతోమంది తమ అవసరాలు తీర్చుకోవడానికి డబ్బు, హోదా ఉన్నవారి వెనుక చేరి కుతంత్ర సలహాలు ఇచ్చి (సినిమాలలో అల్లురామలింగయ్య, సాక్షి రంగారావు పాత్రల్లాగా) వాళ్ళ పబ్బం గడుపుకుంటూ ఉంటారు. ఎందుకంటే వారికి కావలసిన సౌకర్యాలు మంచిగా బ్రతకాలనుకునే వాళ్ళు సమకూర్చలేరు. ఇలా చెడు గుణాలు కలిగిన వారిని కౌరవులు అని పిలిచారు. అంటే మనలో ఉండే కామ, క్రోధ, లోభ, మోహ, అహంకారాలకు గుర్తుగా అలా స్థూలంగా పేర్లు పెట్టి కథ వ్రాసారు.

ఇక **పాండవులు** అనే పేరుకి అర్థం – పండాలు అంటే దారి చూపించేవారు, భగవంతునికి దగ్గర అవ్వడానికి ఎవరైతే మార్గం చూపుతారో వాళ్ళందరూ పాండవులే.

**ధర్మరాజు** – అంటే ధర్మానికి ప్రతీక.

**భీముడు** – అంటే శారీరక బలం, శక్తికి ప్రతీక, తాను తన శక్తితో ఏదైనా చేయగలననే అహం కూడా కొద్దిగా ఉన్నవాడు.

**అర్జునుడు** – అంటే ఆర్జన చేసేవాడు అంటే తెలుసుకోవాలనే కోరిక కలిగిన వాడు.

**నకులుడు** – విషయ వికారాల విషం లేనివాడు, మంచి సాంప్రదాయాన్ని పాటించినవాడు.

**సహదేవుడు** – మంచి పనులు చేసే వారికి సాయం చేసేవాడు.

**ద్రౌపది** – అంటే అనేక పతులు అంటే భర్తలు కలిగినది అని అర్థం. గాలి, నీరు, నేల, అగ్ని, ఆకాశం అని పిలువబడే పంచభూతాలకు ప్రతిరూపమే ద్రౌపది. నిజానికి ద్రౌపది జడమైన శరీరం (బొమ్మ) లాంటిది అనుకుంటే ఐదుగురు భర్తలుగా ఆత్మ యొక్క ధర్మం, శక్తి, జిజ్ఞాస, సత్ప్రవర్తన, సహయోగం అని భావించవచ్చు. అందుకే అంతకుముందు ఎంతో మంది భార్యలు ఉన్న మగవారిని గురించి వ్రాసారు కాని ఒక స్త్రీకి 5 గురు భర్తలు అని ప్రత్యేకంగా వ్రాయడం వెనుక అంతరార్థం ఇదే అయి ఉండవచ్చు.

**వేదవ్యాసుడు** – అంటే వేదాలని వ్యాసాలుగా విభజించి అందరికీ అర్థమయ్యేలా వ్రాసాడని, ఆ వ్యక్తిని వేద వ్యాసుడు అన్నారు. నిజానికి ఏదైనా విషయాన్ని అందరికీ అర్థం అయ్యేలా చెప్పగలిగిన ప్రతి వ్యక్తి వ్యాసుడే. భారతగాథలో వ్యాసుడు గాంధారికి గర్భస్రావం (అబార్షన్) అయితే ఆ పిండాన్ని 100 మగవాళ్లగా+ + ఒక ఆడపిల్లగా కణ విభజన చేసి కుండల్లో పెట్టి కౌరవులకి జన్మ నిచ్చాడని వ్రాసారు. నిజానికి ఈనాటి టెస్ట్‌ట్యూబ్ బేబీలకు, కౌరవుల జన్మకి ఏ మాత్రం తేడా లేదు. కాకపోతే ఇప్పటికంటే వ్యాసుడే గొప్ప డాక్టర్ లేదా సైంటిస్ట్‌గా మనం భావించవచ్చును. ఎందుకంటే ఇప్పుడు డాక్టర్లు వారి ప్రయత్నంలో ఏ కొన్నో సక్సెస్ (విజయం) అవుతున్నాయి. ఆ కథ ప్రకారం 100 మంది మగపిల్లలు + ఒక ఆడపిల్ల ఇలా కవల పిల్లలకు జన్మనివ్వడం చాలా అద్భుతమైన విజయం.

**చిత్రాంగధుడు** – చిత్రమైన అంగం (ఆడా – మగా కాని) కలిగిన వాడు, నపుంసకుడు.

**విచిత్రవీర్యుడు** – వీర్యంలో జీవ కణాలు లేనివాడు (సంతాన శక్తి లేనివాడు) అందుకే వీరి భార్యలకు వ్యాసుడు సంతానాన్ని ప్రసాదించాడని వ్రాసారు. ఇంకా భారతగాథలో ఎన్నో పాత్రల అంతరార్థం మనం తెలుసుకో గలిగితే అది మన హృదయాంతరాళాలలో నిత్యం జరుగుతున్న సంఘర్షణే అని అర్థం అవుతుంది. ఇలా చెప్పుకుంటూ పోతూ ఉంటే ఇంక క్లుప్తంగా కాక చాలా చాలా వివరంగా, విస్తారంగా కొల్లేటి చాంతాడులాగ అయిపోయి నిజం మరుగున పడిపోతుంది.

మరి కౌరవులు, పాండవులు, వ్యాసుడు ఇలా అందరి గురించి మనం చెప్పుకుని అసలు కర్త, కర్మ, క్రియ అయిన **"శ్రీకృష్ణుని"** గురించి ఇంకా చెప్పుకోలేదు. శ్రీ కృష్ణ శబ్దానికి అర్థం తెలుసుకుందాము. కారణం ఏమిటంటే పై పాత్రధారు లందరు కేవలం నిమిత్తమాత్రులు. సూత్రధారి పాత్ర భగవంతునిదే. మనం ఏదైనా సినిమా చూసినప్పుడు పేర్లు వేసేటప్పుడు ఫలానా రైల్వే శాఖ వారికి, పోలీస్ వారికి, ఫలానా ఊరిలో జమీందార్ గారికి – ఇలా సినిమా షూటింగ్‌లో సహయోగం ఇచ్చినవారందరికీ కృతజ్ఞతలు అని వేస్తారు. అలాగే పైన పాత్రధారులందరూ అలాంటివారే. అంటే మనందరం అన్నమాట. మరి ఈ జగన్నాటక రంగానికి సూత్రధారి శ్రీ కృష్ణుడు అని, ఆయనకి 8 మంది భార్యలు అని ఇలా ఎన్నో రకాలుగా వ్రాసారు.

కృష్ణుడికి 8 మంది భార్యలు అంటే ప్రకృతి సంబంధమైన 8 దిక్కులు అనీ, 'పతి' ఆజ్ఞ ప్రకారం నడిచే ప్రకృతి అని అర్థం. ఈ సృష్టిలో మానవుడు యంత్రాలను తయారుచేసి నడపగలుగుతున్నాడు. తన అదుపు, ఆజ్ఞలలో ఉంచుకోగలుగు తున్నాడు. కానీ ప్రకృతి తన 'పతి' అయిన "పరమాత్మ" ఆజ్ఞానుసారమే నడుస్తుంది. దానిని మానవుడు శాసించలేడు. 8 దిక్కుల నిలయమైన జగత్తునే 8 మంది భార్యలుగా వ్రాసారు ఇలా ప్రతి వర్ణన వెనుక ఒక అంతరార్థం తప్పక ఉండి తీరుతుంది.

నిజానికి కృష్ణ శబ్దం చీకటికి గుర్తు. అదే విధంగా కృష్ణ అంటే ఆనందం అని కూడా అర్థం ఉంది. చీకటిలో వచ్చి ఆనందం అంటే వెలుగును ఇచ్చువాడు శ్రీ కృష్ణుడు, అర్జునుడు అజ్ఞానమనే చీకటిలో పడిపోయి నావారు, నేను అనే దుఃఖంలో యుద్ధం చేయలేనని భయపడుతుంటే అతనికి జ్ఞానబోధ చేసి వెలుగులోనికి తీసుకువచ్చి యుద్ధం చేయించి విజయం చేకూర్చిపెట్టిన భగవంతుడే శ్రీకృష్ణుడు.

శ్రీకృష్ణుడు గోవులను కాశాడని అంటే మేపేవాడని రాశారు. నిజానికి గోవు అన్న పదం సాధుత్వం అంటే మంచితనానికి గుర్తు. అలాగే కాయడం అంటే రక్షించడం అని అర్థం. ఎవరైతే సాధుజనులు (సత్ప్రవర్తన కలిగినవారు) ఉంటారో వారిని భగవంతుడు రక్షిస్తాడనే అర్థంతో అలా వ్రాసారు. అందుకే గోవులు అని మాత్రమే రాశారు. వాటి జాతికే చెందిన ఆంబోతులు – గిత్తలు అని రాయక పోవడానికి కారణం వాటిలో క్రోధం, అపకారం చేసే గుణాలు ఉండటమే.

శ్రీకృష్ణుడు నిజానికి దేహధారి అని ఎవరైనా భావిస్తే అది అమాయత్వమే. నిజానికి జ్యోతిబిందు స్వరూపుడైన పరమాత్మ **"శివుడే"** కృష్ణ పాత్రధారి, అది ఏ విధంగా మనం తెలుసుకోవాలో చూద్దాం.

భారతయుద్ధాన్ని సంజయుడు అనే వాడు ధృతరాష్ట్రుడికి యోగదృష్టితో చూసి తెలియచెప్పాడని వ్రాసారు. సంజయుడు అంటే ఇంద్రియాలను నిగ్రహించినవాడు అని అర్థం. ఎవరైతే ఇంద్రియ నిగ్రహం అంటే మనస్సు, బుద్ధిని అదుపులో ఉంచి భగవంతుని తెలుసుకుంటారో వారే సంజయులు. అలాంటివారే మిగతా వారికి, భగవంతుని తెలుసుకోలేని గ్రుడ్డివారికి తెలియ చెప్పగలరని కథలో ఆవిధంగా వ్రాసారు. ముఖ్యంగా ఏ భావంతో అయితే వ్యాసుడు లాంటి మహర్షులు ఇలాంటి ఇతిహాసాలను, గ్రంథాలను వ్రాసారో ఆ గ్రంథాలు కాలక్రమేణా రూపాన్ని మార్చు కున్నాయి. తరువాత కవులు "కాళిదాసు గారి కవిత్వం కొంత – నా సొంత పైత్యం కొంత" అన్న చందాన ఎవరికి తోచిన విధంగా వారు సొంతంగా క్రొత్త, క్రొత్త శ్లోకాలు, పద్యాలు కల్పించి విస్తారం చేశారు. దీనికి సాక్ష్యంగా మనం భారతాన్నే తీసుకోవచ్చు, మొదట వ్యాసుడు వ్రాసిన ఇతిహాసం పేరు 'జయ' 8,000 శ్లోకాలు మాత్రమే ఉండేవి. తరువాత 28,000 శ్లోకాలకి విస్తరించి భారతం అయ్యింది. ఇప్పుడు 1,08,000 శ్లోకాలతో మహాభారతం అయ్యిందని చరిత్రకారులు చెప్తున్నారు. అంటే లక్ష శ్లోకాలు కల్పితం అయి వుంటాయని అర్థం అవుతోంది. ఇంత విస్తారంలో మూలం ఎక్కడుందో ఎలా కనుక్కోగలము? మంచి ముత్యాన్ని ఓ పెద్ద చెరువులో పడేస్తే దానిలో ముత్యం లేదని అనలేము కానీ ఆ ముత్యాన్ని వెలికి తీయాలంటే ఆ చెరువునంతా గాలించాలి. ఎంతో శ్రమతో కూడుకున్న పని. మనకు ఆ శ్రమ లేకుండా చేయడానికే భగవంతుడు అర్జునుడు అనే పాత్రధారిని సృష్టించి మానవలోకానికి ముత్యంలాంటి సారాన్ని గీత రూపంలో అందించాడు. కానీ ఆ యదార్థ రహస్యాన్ని ఎంతమంది తెలుసుకోగలరు? కారణం భాష రాకపోవడం. అదీ మనకి ఎవరో తెలిసిన వాళ్లు చెపితే మనం వినడం వరకే పరిమితం అయిపోయాము. వ్రాసేవాళ్లు, చెప్పేవాళ్లు వాళ్ళు గ్రహించిన విషయాన్ని వారి మనస్సుకి, బుద్ధికి తోచిన విధంగా మనకు చెబుతూ వచ్చారు. అది యథార్థమో కాదో కూడా మనకు తెలియదు కానీ మనమే స్వయంగా ఆ గీతారహస్యాన్ని తెలుకున్ననాడు వేరే ఎవరో మనకు తెలియచేయ వలసిన అవసరం లేదు ఆ భావనతోనే ఈ సామాన్య భాషలో గీత అంతరార్థాన్ని వ్రాయడానికి సాహసం చేస్తున్నాము. మీరు కూడా మేము చెప్పిన దేనినీ నమ్మనవసరం లేదు. మీ మనస్సు, బుద్ధి ద్వారా ఆలోచించి నిర్ణయం తీసుకోండి. మేము ముందే చెప్పాము మాకు పాండిత్యం లేదు. తప్పులుంటే మన్నించమని, తిరిగి మరొక్కసారి మీకు అదే మనవి చేస్తున్నాము. ఇక మనం నేరుగా గీతా శ్లోకాల అంతరార్థాన్ని గ్రహించే ప్రయత్నం చేద్దాము.



**గీత** బోధించిన సమయం, సందర్భంలోనే ముఖ్యమైన అంతరార్థం ఉంది. యుద్ధానికి ముందు ధర్మరాజు రెండు సేనలలో గల సైన్యం మధ్యకి వెళ్లి శత్రు పక్షంలో ఉన్న ఎవరైనా మా పక్షానికి వస్తే వారికి నేను శరణు ఇస్తాను అని అన్నట్లు వ్రాసారు. అంటే ఇప్పుడు చెడుకి, మంచికి మనలో సంఘర్షణ జరగబోతుంది. కనుక చెడులో ఉన్న మీరు ఎవరైనా మంచి వారిగా మారదలుచు కుంటే ఇదే మా ఆహ్వానం అని చెపుతాడు. ఒక విధంగా క్షమాభిక్షలాంటిది అన్నమాట. ఆ మాట విని యుయుత్సువుడు పాండవ పక్షానికి వచ్చి చేరాడని వ్రాసారు. యుయుత్సువుడు అంటే యుద్ధం చేయాలనే కోరిక కలవాడు అని అర్థం చెడును విడిచి చెడు మీద యుద్ధం చేసి మంచిగా మారాలని అనుకున్నవాడు ధర్మరాజు వర్గానికి అంటే ధర్మమార్గానికి దగ్గరయ్యాడని చెప్పారు. అక్కడి నుండే మనలో యుద్ధం మొదలు అయ్యింది. మొదటి విజయం చెడు నుండి ఒక గుణం మంచిగా మారడానికి రావడం అన్నమాట.



ఆ సమయంలో అర్జునుడు తన తాతలను, తండ్రులను, సోదరులను ఇంకా బంధు జనాన్ని చూసి వాళ్లని చంపడం వలన వచ్చే రాజ్యం, రాజ్య సుఖం వద్దు, దీనికంటే అడుక్కుతినడం మేలు అని ఏడుస్తూ కూలబడిపోయాడని చెపుతారు. అప్పుడు శ్రీ కృష్ణుడు, అర్జునునికి జ్ఞానాన్ని తెలియచెప్పి అతనితో యుద్ధం చేయించి కౌరవులను చంపించాడని వ్రాసారు. నిజంగా భగవంతుడు హింస చేయిస్తాడా? భారతంలో స్వయంగా "ఆయుధం ధరించను, యుద్ధం చేయను, సలహా మాత్రం ఇస్తాను" అని దుర్యోధనునికి, అర్జునునికి సహాయం చేసే ముందు చెపుతాడు. మరి నిజంగా అర్జునునితో అంతమందిని చంపిస్తే తాను స్వయంగా చంపకపోయినా భాగస్తుడే అవుతాడు. హత్య చేసిన వాడు ఎంత శిక్షార్హుడో హత్య చేయించినవాడు కూడా అంతే శిక్షార్హుడని న్యాయ స్థానాలు చెబుతున్నాయి. అలాంటి పరిస్థితులలో భగవంతుడు అర్జునునితో చేయించినది స్థూలమైన యుద్ధం కాదని, అది అంతరార్థంతో కూడుకున్న మనలో జరిగే చెడుకి – మంచికి సంఘర్షణ అని పూర్తి అర్థం అవుతుంది.

మరి భారతగాథలో అంతమంది పాత్రధారులు ఉండగా ఒక్క అర్జునునికే ఎందుకు గీతోపదేశం చేసినట్లు వ్రాసారు? దానికి గొప్ప కారణం ఉంది. స్థూలంగా చూసుకున్నా అర్జునుడి పాత్రలో త్యాగం, ధర్మం, ఏకాగ్రత చాలా ఎక్కువ. ఎందుకంటే ఎంతో ఉత్తముడైన ధర్మరాజు పాత్రలో కూడా ధర్మం

దారి తప్పిన లక్షణాలు కనబడతాయి. జూద వ్యసనంలో బుద్ధిని కోల్పోయి, తన తమ్ముళ్లని, చివరికి తనకి కొంతే భాగానికి హక్కు ఉన్న ద్రౌపదిని కూడా ఫణంగా పెట్టి ఆడాడని వ్రాసారు. కడివెడు పాలలో ఒక్క ఉప్పు కణం చాలు విరిగిపోవడానికి అలాగే ధర్మరాజు గీత వినడానికి అర్హత కోల్పోయాడు.

ఇక అర్జునుని పాత్రలో స్థూలంగా మనం కొంచెం తెలుసుకున్నా - దానిలో చిన్ననాడే పక్షి కంటిని మాత్రమే చూసి విల్లు నుండి బాణాన్ని విడిచి గురిగా లక్ష్యాన్ని ఛేధించాడని వ్రాసారు. అది ఏకాగ్రతకు గుర్తు. అలాగే విరాటరాజు కొలువులో ఉత్తరకి నాట్యం నేర్పాక అజ్ఞాతవాసం ముగిసాక విరటుడు తన కుమార్తె ఉత్తరను అర్జునునికి ఇచ్చి పెళ్ళి చేస్తానంటారు. అందుకు అర్జునుడు నా శిష్యురాలు నా కుమార్తెతో సమానము కనుక పెళ్లీడుకొచ్చిన తన కొడుకు అభిమన్యుడికిచ్చి వివాహం చేయమని అన్నాడని వ్రాసారు. ఇంక అన్నింటికన్నా ముఖ్యమైనది - త్యాగం. దాని వలన అర్జునుడే గీతలో ముఖ్యమైన పాత్రధారిగా మారాడు అంటే శిష్యుడిగా అయ్యాడు. స్థూలంగా చూసినా అంగబలం, అర్థబలం, స్వయం శక్తి అన్నీ ఉండి కూడా తోటి బంధువులని, స్నేహితులని చంపి పొందే సుఖం కంటే వాళ్ళ చేతిలో చావే నయం అని బాధ పడినట్లు చెప్పారు. తన కోసం కాక తన వారి సుఖం కోసం తన జీవితాన్ని కూడా త్యాగం చేయడానికి సిద్ధపడ్డాడు. కనుకనే దుఃఖంలో ఉన్నా అతని దుఃఖం అతని కోసం కాక అందరి కోసం కనుక శ్రీ కృష్ణుడు ఎంతో ప్రేమతో అర్జునునికి గీతాబోధ చేశాడని వ్రాసారు.

ఇక ఈ స్థూల అర్థం వెనుక ఉన్న అంతరార్థాన్ని తెలుసుకునే ప్రయత్నం మనం చేద్దాం. ముందే చెప్పుకున్నాము కదా- భారత యుద్ధం అన్నది మనలో ప్రతి క్షణం జరిగే మంచి - చెడుల పోరాటం అని. అర్జునుడు, కృష్ణుడు అనేకసార్లు కలిసి తిరిగారు. అప్పటికే అర్జునుడు చాలా కష్టాలు పడి ఉన్నాడు. ఆ సమయాల్లో కూడా ఎప్పుడూ తనకి మార్గం చూపించమని అర్జునుడు అడగలేదు. కృష్ణుడు చూపించలేదు. చివరికి నిజమైన వైరాగ్యం వచ్చి అర్జునుడు అడిగినప్పుడే కృష్ణుడు దారి చూపించాడు. అలాగే మనం అందరం అర్జునులమే. భగవంతుడే శ్రీకృష్ణుడు మనకి ఎన్నోసార్లు కష్టాలు వచ్చినప్పుడు, బాధలు కలిగినప్పుడు తాత్కాలికంగా మన అందరికీ విరక్తి భావం కలుగుతుంది. కానీ ఆ కష్టం తీరిపోగానే మరలా మామూలు జీవితంలోకి వచ్చి గతాన్ని మర్చి పోతుంటాము. దీనినే శ్మశాన వైరాగ్యం, ప్రసూతి వైరాగ్యం అని కూడా





పెద్దలు అంటారు. మగవాళ్ళు శవంతో కలిసి స్మశానానికి వెళ్ళినప్పుడు అక్కడ శవం కాలుతుంటే ఛీ, ఛీ ఈ బ్రతుకు ఎంత బ్రతికినా చివరికి వచ్చే సరికి కట్టెల్లో పెట్టడమే కదా. ఇంత దాని కోసం ఇన్ని పాపాలు చేస్తూ బ్రతకాలా! ఇక జీవితంలో ఏ పాపం చేయకూడదు అనుకుంటారు. తిరిగి ఇంటికి రాగానే అన్నీ మర్చిపోయి మరలా పాత జీవితంలోకి వెళ్ళిపోతారు. అలాగే ఆడవాళ్లు పురిటి నొప్పుల బాధకి తట్టుకోలేక ఇక జీవితంలో సంసారం చేయకూడదని అనుకుంటారు. కొన్నాళ్లు గడిచాక మరలా మామూలే. వీటినే తాత్కాలిక వైరాగ్యం అంటారు.

**మత్తులో ఉన్నవాడికి -అజాగ్రత్తలో ఉన్నవాడికి - పిచ్చివాడికి - కామాంధునికి - అలసిపోయినవాడికి - ఆకలితో ఉన్నవాడికి - లోభికి - తొందరలో ఉన్నవాడికి - కోపిష్టి వాడికి - పిరికి వాడికి - స్పృహ లేని వాడికి - కష్టంలో ఉన్నవాడికి ఇలా ఏ ఒక్క లక్షణం అయినా మనలో ఉంటే ఆ క్షణంలో జ్ఞానం చెప్పినా తలకెక్కదు, ధర్మం చెప్పినా వంటబట్టదు. అలాగే తాత్కాలిక వైరాగ్యం వచ్చిన వారికి కూడా జ్ఞానం తలకెక్కదు.**



ఎవరికైతే నిజమైన వైరాగ్యం వస్తుందో వాళ్ళకే భగవంతుని జ్ఞానం దొరుకుతుంది. ఈ రోజు ప్రపంచంలో ఎక్కడ చూసినా కపటత్వం, నటనే కనబడుతోంది. ఆప్యాయత, దయ, ప్రేమ అన్నది కనబడటం లేదు. స్థూలంగా ఎన్ని సౌకర్యాలు పెరిగాయో అంతకుమించి మనస్సుకి అశాంతి పెరిగి పోతోంది. క్షణ క్షణం బ్రతుకు గండంగా గడుస్తోంది. మనిషి తను ఎందుకు పుట్టాడో, ఎందుకు బ్రతుకుతున్నాడో, ఎందుకు చనిపోతున్నాడో కూడా తెలుసుకునే ప్రయత్నం చేయటం లేదు. ఇలాంటి పరిస్థితులలో ఎవరికైతే ఈ ప్రాపంచిక విషయాల మీద ఆసక్తి పోయి, యధార్థం తెలుసుకోవాలని అనుకుంటారో వారికి భగవంతుడు జీవితం యొక్క, సృష్టి యొక్క అంతరార్థాన్ని చెపుతాడు. ఆ విషయాలనే "అర్జునుడు - కృష్ణుడు" పేర్లతో గీతలో మానవులకి అందించారు. మనం అధ్యాయాల క్రమంలో కొన్ని, కొన్ని శ్లోకాలకి అంతరార్థాన్ని తెలుసుకునే ప్రయత్నం చేద్దాం.

## 1వ అధ్యాయం - విషాదయోగం

విషాదం అంటే ఏడుపు, ఏడ్చేవాళ్ళని చూసి ఎవరూ ఇష్టపడరు. కాకపోతే జాలి పడతారు. కానీ కృష్ణుడు అర్జునుడు ఏడుపుని కూడా యోగంగా

పేర్కొన్నాడు. అంటే ఎవరైతే స్వార్థం లేకుండా తన స్వంతం కోసం కాకుండా ఇతరుల కోసం ఏడుస్తాడో వాడు ఉత్తముడే అని.

### 1వ శ్లోకం

**ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః**
**మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సంజయ.**

లో ధృతరాష్ట్రుడు నా వాళ్ళు - నా తమ్ముడి పిల్లలు అని భేదంతో మాట్లాడి నట్లు ఉంది. అంటే అది అజ్ఞానానికి గుర్తు. మరి జ్ఞాని అయిన అర్జునుడు కూడా.

### 32వ శ్లోకం

**న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ**
**కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగైర్జీవితేన వా.**

లో నా వాళ్ళు అని పలికాడు. ఇక్కడ అర్జునుడికి తన, పర అన్న భేదం లేదు. అయితే అజ్ఞాని అయిన ధృతరాష్ట్రుడు - జ్ఞానం ఉండీ దానిని మర్చిపోయిన అర్జునుడు ఇంచుమించు ఒకలాగే "నా..... నా...." అన్నారు. స్వార్థం నిండిపోయిన ధృతరాష్ట్రునిలాంటి వాళ్లకి కాక, త్యాగం నిండిన వైరాగ్యం కలిగిన అర్జునునికే గీతాబోధన దొరికింది. మనిషి తన పుట్టుక, బాల్యం యవ్వనం, వృద్ధాప్యం అనే దశలతో ఎన్నో అనుభవాల్ని చవి చూస్తాడు. అవి నరనరాల్లో పాతుకుపోయి, పాత వాసనలు వదలకుండా అంటిపెట్టుకుని ఉంటాయి.



నిజ జీవితంలో కూడా తలపండిపోయిన ముసలివాడిని తాతా పెళ్ళి చేసుకుంటావా అంటే - నాకెవరు పిల్లనిస్తారురా అని అంటాడు గాని, నాకు ఈ వయస్సులో పెళ్ళి ఎందుకురా అని అనడని మన పెద్దలు సరదాగా అంటుంటారు. అలాగ - ఈ విషయ వాంఛలను వదలడానికి మనస్సు అసలు ఇష్టపడదు. అలాగే ఎవరైనా ఆత్మజ్ఞానం తెలుసుకోవాలని, ఎంతో కోరికతో ముందుకు వచ్చినా ఈ పాత వాసనలు తిరిగి మనిషిని పాతాళానికి లాగేయడానికి ప్రయత్నం చేస్తాయి.అర్జునుడు నిజంగా యుద్ధానికి సిద్ధపడి వచ్చాడు. వెనువెంటనే సైన్యాన్ని చూసి చతికిలబడిపోయాడు. వాస్తవానికి ఈ యుద్ధం అనేది కామ, క్రోధ, లోభ, మోహ, అహంకారాలనే పంచవికారాల





మీద ఆత్మ తనకు తాను చేసే యుద్ధమే. మనం అందరం మంచిగా అందరిపట్ల ప్రేమతో, సుఖంగా బ్రతకాలనే అనుకుంటాము. చెడుగా బ్రతకాలని ఎవరూ అనుకోరు అయినా మనుష్యులలో మంచి-చెడు ప్రవర్తనల తారతమ్యం చాలా పెరిగిపోయింది. ఈ సమయంలో ఎవరైతే భగవంతుని జ్ఞానం ఆధారంగా తనని తాను ఉద్ధరించుకుంటారో వాళ్ళందరూ అర్జునులే. ఇంత కష్టపడి మాయ అని పిలవబడే వికారాలతో యుద్ధం చేయడం ఎందుకు? ఈ జీవితం మంచిగానే ఉంది కదా! ఇక ప్రత్యేకంగా జ్ఞానం ఎందుకు అని అంటుంటారు. నిజానికి మనం గడిపే బ్రతుకు అనిశ్చితం అంటే ఏ క్షణంలో ముగిసిపోతుందో తెలియదు. ఇలాంటి జీవితంలో దీపం ఉండగానే ఇల్లు చక్కదిద్దుకోవాలి అంటే ఆత్మ అనే దీపం, శరీరం అనే ఇంటిలోఉండగానే పుణ్యం సంపాదించుకుని జీవితాన్ని సఫలం చేసుకోవాలని చెబుతారు. నావాళ్ళు - నాది అన్నవి దేహ సంబంధమైన వినాశీ పదార్థాలు. కానీ నేను అంటే స్వ-ఆత్మ. నాధర్మం - శాంతి, దయ, ప్రేమ, అహింస, పవిత్రత, ఆనందం ఈ లక్షణాలను గుర్తు తెచ్చుకుని తిరిగి మన లక్షణాలను పొందాలి. ఆత్మలైన మనమందరం ఈ విషయం మర్చిపోయాం. అనేక జన్మల నుంచి శరీరాలు మారుస్తూ మారుస్తూ శరీరమే నేను అనే భ్రాంతిలో పడిపోయాము. ఈగ ఇల్లు అలుకుతూ, అలుకుతూ తన పేరు మర్చిపోయింది అని అప్పుడు గుఱ్ఱం కడుపులో ఉన్న పిల్ల నీ పేరు ఈగ అని చెప్పిందని మన పెద్దలు చమత్కారంగా చెప్తారు. అలాగే మనం ఎవరమో, మన నిజ ధర్మం ఏమిటో మర్చిపోతే భగవంతుడు తిరిగి ఈ విషయాన్ని అర్జునులమైన మనకి తెలియజెప్తున్నాడు.

## 2వ అధ్యాయం - సాంఖ్యయోగం

ఈ ప్రపంచంలో రెండు తెగలు మాత్రమే ఉన్నాయని గీతా సారం.

1. మంచివారు 2. చెడ్డవారు.

**మంచివారు :-** సన్మార్గంలో, ధైర్యంతో, ఉత్సాహంతో, పవిత్రతతో వెలుగు కొరకు అనగా భగవంతుని కొరకు వెతుకులాడువారు. వారు ఆర్యులు అంటే గౌరవింపదగినవారు.

**చెడ్డవారు :-** దుర్మార్గం, కల్మషం అధైర్యం, నిరుత్సాహం, చీకటి పనులు చేసేవారు - వీళ్లు అనార్యులు అంటే గౌరవింపదగనివారు. వీళ్లు భగవంతుడు అన్నా, జ్ఞానం అన్నా దూరంగా వెళ్ళిపోతారు.

ఉప్పు నీటిలో - పప్పు వుడకదు
తప్పుచేసిన వాడి - గొప్ప చెల్లదు
తుప్పు పట్టిన - ఇనుము మన్నదు
కష్టపడని సొమ్ము - ఆగదు
ఇష్టపడని చూపు - దాగదు
చిల్లుపబడిన డప్పు - మ్రోగదు

అదే విధంగా - మకిలి పట్టిన మనస్సులో భగవంతుని నామం నిలువదు. అందువలన మనందరం ఎవరికి వాళ్ళం ఎలా ఉన్నామో స్వయంగా తెలుసుకోవాలి. మంచివారిగా ఉంటే మరింత మంచివారిగా అయ్యే ప్రయత్నం చేయాలి. చెడ్డవారిగా ఉంటే ఇక నుండి అయినా ఆ చెడుని విడిచిపెట్టి మంచి మార్గంలోనికి వచ్చి, జీవితాన్ని సఫలం చేసుకోవాలి. ఇది మనిషికి చాలా అవసరం.

**3వ శ్లోకం**

**క్లైబ్యం మాస్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే**
**క్షుద్రం హృదయదౌర్భల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప.**

లో పిరికిగా మాట్లాడకు, అధైర్యం విడిచిపెట్టు, మనోదౌర్భల్యం నీకు తగదు, ధైర్యంగా యుద్ధం చేయి అని చెబుతాడు. మనం ఈ కామ క్రోధ, లోభ, మోహాలని జయించగలమో లేదో అనే సంశయంలో ఉన్నప్పుడు భగవంతుడు మనకి ఇలా ధైర్యం చెప్పి మనల్ని మన అంతర్గత శత్రువుల మీద యుద్ధం చేయడానికి జ్ఞానంతో తయారుచేస్తున్నాడు.

**8వ శ్లోకం**

**న హి ప్రపశ్యామి మమాపమద్యా**
**ద్య చ్ఛో కముచ్ఛోషణమిన్ద్రియాణామ్**
**అవాప్య భూమావసపత్నమృద్ధం**
**రాజ్యం సురాణామపి చాధిపత్యమ్.**

లో మనిషికి భౌతిక సంపదలు, అధికారం ఉన్నా కానీ అవి ఏవీ మరణానంతరం వెంటరావు. మనస్సుకి నిజమైన శాంతిని ఇవ్వలేవు. మనస్సుకి శాంతినిచ్చేది ఆత్మ జ్ఞానమొక్కటే. అలాంటి ఆత్మ జ్ఞానాన్ని పరమాత్మ ఒక్కడే ఇవ్వగలడు. మన దుఃఖాన్ని జ్ఞానమొకటే పోగొట్టగలదు. అందువలన అందరూ యథార్థమైన జ్ఞానాన్ని తెలుసుకుని శాంతిని పొందాలి. అజ్ఞానికి సుఖంలో కూడా దుఃఖం కలుగుతుంది. జ్ఞానికి కష్టంలో కూడా ఆనందం కలుగుతుంది. ఈ తేడాకి కారణం - సాక్షిగా ఉండటమే. జ్ఞానం తెలిసినవారు కర్మ ఫలాన్ని ఆశించక సాక్షిగా ఉంటారు. ఫలితం వచ్చినా రాకపోయినా ఒకేలా అనుభూతి చెందుతారు. జ్ఞానం తెలియనివారు ఫలితం అనుకూలం అయితే ఆనందం, ప్రతికూలం అయితే దుఃఖం అనుభూతి చేసుకుంటారు. అర్జునుడు నిజానికి జ్ఞానియే, కానీ ఆ సమయంలో అతనిలో పాత సంస్కారాల స్మృతి కళ్ళకి పొర కమ్మి స్పష్టంగా చూడలేక ఏది నిజమో, ఏది ఊహో తెలియక అయోమయంలో పడి ఉన్నాడు. మనందరం కూడా అదే విధంగా మంచి చెడుల మధ్య అర్థం కాక నలిగిపోతున్నాము. ఈ సమయంలో మన స్థితి, అర్జునుని స్థితి ఒక్కటే, అందుకే భగవంతుడు మనల్ని చూసి జాలితో జ్ఞాన మార్గాన్ని చూపుతున్నాడు.

**11వ శ్లోకం**

**అశోచ్యానన్వ శోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాష సే**
**గతాసూనగతాసూంశ్చ, నానుశోచన్తి పణ్డితాః**

లో వేటికోసం అయితే నువ్వు ఏడవకూడదో వాటి కోసం ఏడుస్తున్నావు. పైగా పెద్ద పెద్ద మాటలు మాట్లాడుతున్నావు. నువ్వు వేటి కోసం ఏడుస్తున్నావో అవి కాలం గడిచే కొద్దీ నిన్ను ఏడిపించేవే గాని - సుఖాన్ని ఇచ్చేవి కాదు. అలాంటి వాటి గురించి దుఃఖించడం అజ్ఞానం అని చెబుతున్నాడు. మనిషిలో ఉండే కోర్కెలు అనంతాలు. అవి మనల్ని సుఖాల వైపు లాగుతాయి. ఎంత భోగిగా మనిషి బ్రతుకుతాడో చివరికి అంత రోగిగా తయారువుతాడు. అనంతమైన దుఃఖం అనుభవిస్తాడు కాబట్టి మనలో ఉండే చెడుని తొలగించుకోవడానికి ఎప్పుడూ వెనుకాడకూడదు. పేనుకు పెత్తనం ఇస్తే తలంతా గొరిగిందని అంటారు. మనలో ఉండే బలహీనతలకు తలొగ్గితే అవి మనల్ని బలి తీసుకుంటాయి. అందుకే వాటిని తొలగించాలని భగవంతుడు చెపుతున్నాడు.

**13వ శ్లోకం**

**దేహినో స్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా**
**తథా దేహాన్తర ప్రాప్తిర్ధీరస్తత్ర న ముహ్యతి.**

లో శరీరానికి పుట్టుక బాల్యం, యవ్వనం, వృద్ధాప్యం ఎలా తప్పవో అలాగే మరణం కూడా తప్పదు. మరణం అన్నది శరీరానికే గాని మనకి (ఆత్మకి) లేదు. కానీ తెలుసుకోని కారణంగా నేను చచ్చిపోతున్నాను అని ఏడుస్తారు. నిద్రలో ఉన్నవాడికి కల అయినా, నిజమైనా ఒక్కటే అలాగే జ్ఞానం తెలిసినవాడికి చావైనా, పుట్టుక అయినా ఒక్కటే. కాబట్టి మీరు జ్ఞానం తెలుసుకోండి అని భగవంతుడు చెపుతున్నారు.

**15వ శ్లోకం**

**యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ**
**సమదుఃఖసుఖం ధీరం సో మృతత్వాయ కల్పతే.**

లో ఎవరు ఈ ప్రకృతి సంబంధమైన విషయాలకు లొంగరో, ఎవరు సుఖ-దుఃఖాల యందు సమదృష్టి కలిగి ఉంటారో వారు మోక్షానికి అర్హులు అని చెప్పారు. ఎన్ని భోగ భాగ్యాలలో ఉన్నా కష్ట నష్టాలలో ఉన్నా ఎవరైతే సదా భగవంతుని స్మరిస్తూంటారో వారే మోక్షానికి అర్హులు అని. మోక్షం అంటే ముక్తి. దీనినే కొందరు జన్మరాహిత్యం అంటారు. నిజానికి జన్మరాహిత్యం అన్నది సాధ్యం కాదు. ఎవరైతే కర్మ చేస్తూ కర్మ ఫలానికి అంటరో వారు సదా ముక్తులే అని గీతలోనే తదుపరి అధ్యాయాలలో ఉంది అంటే ఎవరైతే కుటుంబంలో ఉంటూనే కుటుంబ బంధనకి వశం కాక మనస్సులో భగవంతునికి దగ్గరగా ఉంటారో వారంతా ముక్తులే అని అర్థం.

**22వ శ్లోకం**

**వాసాంసి జీర్ణాని యథా విహాయ**
**నవాని గృహ్ణాతి నరో పరాణి**
**తథా శరీరాణి విహాయ జీర్ణా**
**న్యన్యాని సంయాతి నవాని దేహీ.**

లో మానవుడు చినిగిపోయిన పాత బట్టను విడిచి కొత్త బట్ట ధరించిన విధంగా ఆత్మ శిథిలమైన దేహాలని విడిచి కొత్త శరీరాలను ధరిస్తుంది అని. నిజంగా ధర్మం నాలుగు పాదాలతో నడిచినప్పుడు మనిషి చిరాయువుగా బ్రతికి శరీరం విడిచేవాడు. కానీ ఈనాడు వయస్సుతో సంబంధం లేకుండా నీటి బుడగలాగ ఏ క్షణంలోనైనా శరీరం విడవ వలసివస్తుంది. దీనికి కారణం "ఋణం". అది తీరిపోగానే ఆ శరీర సంబంధాలు తెగిపోయి కొత్త శరీరంతో



సంబంధాలు ఏర్పడుతున్నాయి. గత జన్మలలో మానవుడు చేసిన పాప, పుణ్యాల వలన ఈ జన్మలో రకరకాల స్థితి గతులలో పుడుతున్నారు. ఉన్నవారు - లేని వారు, ధనం ఉండి ఆరోగ్యం లేనివారు, గ్రుడ్డివారు, కుష్టువారు, ముష్టివారు, మూగవారు ఇలా అనేకానేక రకాలుగా పుట్టి ఎవరి కాలం తీరగానే వారు చెప్పా పెట్టకుండా వేరే జన్మకి వెళ్ళిపోతున్నారు. అందుకే రేపు అన్నది మన జీవితంలో నమ్మకం లేదు. కనుక ఇప్పుడే భగవంతుని తెలుసుకుని ఆ భగవంతుని తోడులో జీవితాన్ని గడపాలి మనుష్యుల తోడు తాడి చెట్టు నీడలాంటిది. అది ఎంతసేపు మనకి ఎండ నుంచి రక్షణ ఇస్తుందో తెలియదు కానీ భగవంతుడు మహావృక్షం లాంటి వాడు. ఎండ ఎటు తిరిగినా మనకి నీడనిస్తాడు.

**27వ శ్లోకం**

**జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్యచ**
**తస్మాద పరిహార్యే ర్థే న త్వం శోచితుమర్హసి.**

లో పుట్టిన వాడు - గిట్టకమానడు (చనిపోక తప్పదు), గిట్టిన పిమ్మట - పుట్టక పోడు, ఇది అనివార్యం. ఇవి రాత్రి, పగలు లాంటివి, నిరంతరం జరుగుతూనే ఉంటాయి. నిజానికి చావు, పుట్టుకలు శరీరానికే గాని ఆత్మకి లేవని గీత సదా చెబుతూనే ఉంది. పై శ్లోకం అర్థం ప్రకారం చూసినా మనిషికి జన్మరాహిత్యం (అంటే తిరిగి జన్మించడం ఉండదని) అన్నది లేనేలేదని స్పష్టంగా అర్థం అవుతుంది.

**28వ శ్లోకం**

**అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత**
**అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా**

లో పుట్టుకకు ముందు ఈ శరీరం లేదు. పుట్టిన తరువాత కంటికి కనబడుతుంది. చనిపోయిన తర్వాత మట్టిలో కలిసిపోయి మనకి కనబడటం లేదు. అటువంటి వచ్చిపోయే చుట్టాన్ని శాశ్వతంగా భావించి నిజమైన, శాశ్వతమైన ఆత్మవైన నీవు నిన్ను తెలుసుకోలేక దుఃఖంలో ఉంటున్నావు. నీకు ఎందుకు ఈ దుఃఖం అని భగవంతుడు చెబుతున్నాడు.

### 37వ శ్లోకం

**హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్**
**తస్మా దుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః**

లో నీవు యుద్ధంలో చనిపోయావా – స్వర్గానికి పోతావు, నీవు యుద్ధంలో జయించావా – రాజ్యాన్ని భోగిస్తావు అని చెప్పారు. మరి ఏ యుద్ధం? నిజంగా ఇద్దరు వ్యక్తులు కొట్లాడుకుంటుంటే ఒకరు వేరొకరి చేతిలో చనిపోతే, చనిపోయిన వారు స్వర్గానికి, చంపినవారు రాజ్యానికి వెళ్ళడం అటుంచి చనిపోయినవారు పోస్ట్‌మార్టమ్‌కి చంపినవారు జైలుకి వెళ్తారు. మరి అలాంటి యుద్ధం చేయమని భగవంతుడు చెప్పాడా? కాదు, ఈ శ్లోకం అంతరార్థం ఎంతో ముఖ్యమైనది. ఓ మానవుడా! నా సలహాననుసరించి నువ్వు నీలో జీర్ణించుకుపోయిన చెడు మీద యుద్ధం చేయి. దీనిని జయించావా ఇప్పుడే ఈ దేహము అనే రాజ్యం మీద, మనస్సు మీద అధికారివి అవుతావు అప్పుడు నీ కళ్ళు, నీ నోరు, నీ చెవులు, నీ మనస్సు, బుద్ధి అన్నీ నువ్వు చెప్పినట్లు నడుచుకుంటాయి. ఒకవేళ యుద్ధం చేస్తూ, చేస్తూ శరీరం విడిచిపెట్టేశావా మరేమీ పర్వాలేదు. ఇప్పుడు నువ్వు చేస్తున్న ప్రయత్నానికి పుణ్యఫలంగా మరలా ఉత్తమమైన ఇంటిలో జన్మ తీసుకుని తిరిగి నా మార్గంలోనే నడుస్తావని భగవంతుడు చెపుతున్నాడు. మనం నిజంగా మనలో చెడుని తొలగించుకుంటే తిరిగి దైవీగుణాలు నిండి దేవతలుగా అవుతాము. అసలు మనిషి పట్టుదలతో పర్వతం ఎక్కడం ప్రారంభించాలే కానీ ఎప్పటికో అప్పటికి శిఖరాన్ని చేరుకుంటాడు. అసలు ప్రయత్నమే చేయనివాడు ఎప్పటికీ క్రిందనే ఉండిపోతాడు. కనుక ధైర్యంతో భగవంతుని వైపు ప్రయాణం చేయడమే మన తక్షణ కర్తవ్యం.

### 40వ శ్లోకం

**నేహాభిక్రమ నాశో స్తి ప్రత్యవాయో న విద్యతే**
**స్వల్పవప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్**

లో మన ప్రయత్నం ఎన్నటికీ వ్యర్థం కాదు. నిజంగా ఫలితం పొందకుండానే శరీరం విడిచినా భయంలేదు. భగవంతునితో ఉన్నవారికి బ్రతికి ఉండగా కూడా ఎప్పుడో వచ్చేచావు గురించి భయం ఉండదు అని చెబుతారు. సాధారణంగా రైతు విత్తనాలు జల్లితే నేల స్వభావం బట్టి కొన్ని వెంటనే మొలకెత్తుతాయి. కొన్ని కొంత సమయానికి వర్షాలు పడినప్పుడో లేక వాతావరణం అనుకూలించినప్పుడో మొలకెత్తుతాయి. మరి కొన్ని పొల్లుగానే ఉండిపోతాయి. కానీ భగవంతుడు చెప్పిన ఈ జ్ఞానమనే విత్తనాలు మొలకెత్తకపోవటం అంటూ ఉండదు. వీటిలో మామూలు విత్తనాల లాగ పొల్లు అన్న సమస్యే రాదు. అందువలన అందరం భగవంతుని ఉపదేశాను సారంగా జ్ఞానమార్గంలో మనలో ఉండే మాయ మీద యుద్ధం చేయటం మొదలుపెట్టాలి.

### 47వ శ్లోకం

**కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కధాచన**
**మా కర్మఫల హేతుర్భూర్మాతే సఙ్గో స్త్వ కర్మణి.**

కర్మ – అంటే మానవ ప్రయత్నం చేయుటయందే నీకు అధికారం ఉంది కానీ దాని ఫలితం పైన లేదు. అలాగని మనం కర్మలు చేయడం మానకూడదు. కర్మ ఫలానికి కారణం మనం కాకూడదు. కొంతమంది ఏ పని చేసినా నాకేంటి – నాకేం లాభం అంటూ ప్రతి క్షణం లాభం కోసం ప్రాకులాడుతారు. కానీ భగవంతుడు అసలు ఫలం ఆశించి కర్మ చేయకు అది రావలసినప్పుడు తప్పక వస్తుంది. రాకూడదని ఫలమైతే రానేరాదు. కానీ నువ్వు నిమిత్తంగా అయ్యి నీ కర్మ చేయమని చెపుతున్నాడు. నిజంగా మనం చేసిన కర్మ మంచిదైతే దానికి ఫలితం తప్పక నిర్ణయించబడే ఉంటుంది కానీ మనం కోరికతో కర్మ చేస్తే ఆ ఫలం కూడా తక్కువగానే ఉంటుంది. అందుకే నిష్కామ కర్మ (కోరికలు లేకుండా కర్మ చేయడం) అనేది యోగి లక్షణం అంటారు. నిజానికి మనం ఇంటిలో పదిమందికి అన్నం పెడితే మనకి అన్నం లేకుండా ఉంటుందా? వాళ్లతో పాటే మనం కూడా తింటాము కదా! అదేవిధంగా కోరిక లేకుండా లోకం మంచి కోసం కర్మ చేస్తే అందరితో పాటు మనం కూడా మంచిని పంచుకుంటాము. అందుకే ఏ కర్మ చేసినా ఈశ్వరార్పణం చేసి చేయమని మన పెద్దలు చెబుతారు.

### 53వ శ్లోకం

**శ్రుతి విప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా**
**సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి.**

లో ఎంతోమంది ఎన్నోరకాలుగా నీ చెవిని వేసిన విషయాల వలన ఏది యథార్థమో తెలియక కలత చెందిన నీ బుద్ధి ఎప్పుడైతే చలించకుండా, స్థిరంగా పరమాత్ముని జ్ఞానమందు నిలిచి ఉండునో అప్పుడు నీవు ఆత్మ సాక్షాత్కారం పొందుతావని చెప్పారు. దీనిని బట్టి మనిషి స్థిరమైన మనస్సుతో, బుద్ధిని ఏకాగ్రం చేసి పరంజ్యోతి స్వరూపుడైన పరమాత్ముని ధ్యానిస్తేనే ఆత్మ సాక్షాత్కారం అవుతుంది. కానీ వేరే ఎన్ని విధాలుగా ప్రయత్నాలు చేసినా ఆత్మ సాక్షాత్కారం కాదని స్పష్టంగా చెపుతున్నారు. మరి భక్తికి ఫలితం ఉండదా? అంటే తప్పక ఉంటుంది. ఏ భక్తికి? ఏకీరస భక్తికి మాత్రమే ఫలితం ఉంటుంది. పరిభ్రమించే భక్తికి ఫలితం ఉండదు, ఎలాగంటే - ఇద్దరు చిన్న పిల్లలు గోళీకాయలు ఆడుకుంటున్నారు. వారిలో ఒకరు లౌకిక పండితుని మనవడు. వేరొకడు పామరుని మనవడు. ఈ పామరుని మనవడికి దాహం వేసి తన స్నేహితుడ్ని మంచినీరు అడిగాడు, అప్పుడు ఆ పండితుడి మనవడు "తాతగారూ నా స్నేహితునికి మంచినీరు కావాలట ఇవ్వండి" అని అడిగాడు. ఆయన, ఉండరా ఇప్పుడే అమ్మవారికి పూజ మొదలుపెట్టాను 5 నిమిషాలు ఆగాక ఇస్తానన్నాడు. పోనీ పిల్లవాడు వెళ్ళి తెచ్చుకుందామంటే ఆచారమని లోనికి రానివ్వడు సరే 5 నిమిషాల తర్వాత మరలా ఈ పిల్లవాడు దాహంగా ఉందని అడిగాడు. పండితుడి మనవడు మరలా తాతగారు మంచినీళ్ళు అని అడగడం, ఆయన లోపలి నుండి రకరకాల పేర్లు చెప్పి ఆ దేవతలకు పూజ చేస్తున్నాను అనటం జరిగింది. ఓ గంట గడిచాక ఆ పండితుడు నీళ్ళ చెంబుతో బయటకి వచ్చాడు. అక్కడి పామరుడి మనవడు చిన్న చిన్న గుంటలు 10 తవ్వుతున్నాడు. ఓరేయ్ అబ్బాయ్ ఏం చేస్తున్నావురా? అని పండితుడు అడిగాడు, నీటి కోసం గుంటలు తవ్వుతున్నాను తాతగారూ! అని ఆ పిల్లవాడు సమాధానం చెప్పాడు. ఓరి తెలివి తక్కువ సన్నాసీ చిన్న, చిన్న గుంటలు 10 తవ్వే బదులు ఒకే గుంట లోతుగా తవ్వి ఉంటే నీళ్ళు పడేవి కదరా అన్నాడట. దానికి ఆ పిల్లవాడు మరి మీరు కూడా 10 మంది వేరు వేరు రూపాలకి కొంచెం, కొంచెం సేపు పూజ చేయకుండా ఒకే రూపానికి ఇంతసేపు పూజ చేసి ఉంటే మీకు ఫలితం దక్కేది కదా అని అన్నాడు. నిజంగా ఇది అందరం ఆలోచించవలసిన విషయం. ఒకే రూపాన్ని ఏకాగ్రంగా కొలుస్తూ చేసే భక్తికీ, జ్ఞానానికి తేడా లేదు. రెండు సమానమే. పరిభ్రమించే భక్తి వలన ఫలితం కూడా ఉండదని భగవంతుడు చెబుతున్నాడు. అందుకే భక్తులు అందరిలో అగ్రగణ్యునిగా హనుమంతుని కొలుస్తారు. ఎందుకంటే యుగాలు మారినా, జగాలు మారినా నాకు శ్రీరాముని



రూపం తప్ప వేరే రూపంతో పనిలేదని నిశ్చలంగా రామనామ జపం చేశాడని చెప్పారు. అటువంటి భక్తి ఎవరైతే చేస్తారో వారికి ఫలితంగా భగవంతుని జ్ఞానం సులభంగా లభిస్తుంది. కొందరికి గత జన్మలోనే భక్తి పూర్తయిపోయి ఈ జన్మలో దాని ఫలంగా జ్ఞానం లభిస్తుంది. కొందరికి ఇంకా భక్తి ఉన్నప్పటికి ఆ పుణ్యఫలంగా త్వరలోనే జ్ఞానం లభిస్తుంది. కనుక నిజమైన భక్తికి, జ్ఞానానికి తేడాయే లేదు. హెచ్చు తగ్గుల సమస్యే రాదు. రెండూ గొప్పవే.

### 56వ శ్లోకం

**దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః**
**వీతరాగభయక్రోధః స్థిత ధీర్మునిరుచ్యతే**

లో బాధలు వచ్చినా దుఃఖింపనివాడు, సుఖాల పట్ల ఆసక్తి లేనివాడు, అనురాగము, భయము, కోపము విడిచినవాడు స్థితప్రజ్ఞుడు, అంటే స్థిరచిత్తం కలిగినవాడు అని చెపుతున్నారు. మన చుట్టుప్రక్కల ఎంతోమందికి ఎన్నో కష్టాలు వస్తున్నాయి. వారు బాధపడినంతగా మనం అయితే బాధపడటం లేదు. కారణం అది పరాయి వాళ్ళకి వచ్చిన కష్టంగా భావిస్తున్నాము. అదే మన ఇంటిలో ఏదైనా ఆపద వస్తే మనం ఎంతో బాధని అనుభవిస్తాము. ఎందుకంటే ఇది నాది అని భావిస్తున్నాము. ఈ నాది - పరాయిది అన్నది ఆదిలో లేదు. నిజానికి జ్ఞానం తెలుసుకున్న వారికి కష్టమైనా, సుఖమైనా వచ్చిపోయేవే అనే నిశ్చయం కారణంగా వాటి పట్ల ద్వేషం గాని, అనురాగం గాని ఉండవని భగవంతుడు చెబుతున్నాడు. నిజానికి పరీక్షలు లేకపోతే విద్యార్థి తెలివితేటలు బయటపడవు. అలాగే కష్టాలు రాకపోతే మనిషి శక్తి సామర్థ్యాలు తెలియవు. ఎన్నో ఉలిదెబ్బలు తింటేనే గాని బండరాయి శిల్పంగా మారదు. భగవంతుని స్మృతిలో ఉన్నవారు ఎన్ని కష్టాలు పడినా చివరికి శిల్పంలా మారి తీరితారు. దేవుని తెలుసుకున్నంత మాత్రాన కష్టాలు రావనుకోవటం భ్రమ. ఇంకా చెప్పాలంటే ఎక్కువగా వస్తాయి. చలింపచేయడానికి ప్రయత్నం చేస్తాయి కానీ ఎవరైతే స్థిర చిత్తంతో స్థితప్రజ్ఞునిగా ఉంటారో వారే భగవంతుని పొందుతారు.

### 58వ శ్లోకం

**యదా సంహరతే చాయం కూర్మో జ్ఞానీవ సర్వశః**
**ఇన్ద్రియాణీ న్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.**

లో తాబేలు తన అవయవములను లోపలికి ముడుచుకుని రాతి చిప్పలా కనబడుతుంది. అదేవిధంగా మనిషి తన జీవితయాత్రకై శరీరం ద్వారా కర్మ చేస్తున్నా మనస్సు బుద్ధిని మాత్రం భగవంతుని దగ్గర ఉంచాలి. అప్పుడు అతని జ్ఞానం స్థిరంగా ఉంటుంది. చాలా మంది మాకు భగవంతుని కొలవడానికి సమయమే దొరకటం లేదని అంటున్నారు. తీరా ఎవరికైనా కావలసిన వారికి ఏదైనా పని తగిలితే లేదా కష్టం వస్తే రోజుల తరబడి సాయం చేస్తారు. మంచిదే, ఇతరులకి సాయం చేయవద్దని భగవంతుడు చెప్పటం లేదు. చేయండి కానీ శరీరం ద్వారా వారికి సాయం చేసేటప్పుడు మనస్సు, బుద్ధిని భగవంతుని దగ్గర పెట్టండి, అప్పుడు సాటివారికి ఉపకారం చేసిన ఫలం, స్వయానికి భగవంతుని పొందిన ఫలం రెండు లభిస్తాయి. భోజనానికి ఒక సమయం కావాలి. నిద్రకి ఒక సమయం కావాలి కానీ భగవంతుని స్మృతి చేయటానికి సమయం ఇది అని ఎక్కడా లేదు. ప్రతి క్షణం మనం భగవంతుని స్మృతి చేయవచ్చు. మీకు ఎప్పుడు వీలైతే అప్పుడు, ఎంత ఎక్కువ అవకాశం ఉంటే అంత ఎక్కువ భగవంతుని స్మృతి చేయండి, చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ అంటారు. ఎవరు ఎంత చేసుకుంటే అంత పొందుతారు.

### 62, 63వ శ్లోకాలు

**ధ్యాయతో విషయాన్ పుంసః సజ్గస్తేషూపజాయతే**
**సజ్గాత్సంజాయతే కామః కామాత్క్రోధో భిజాయతేః**
**క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతి విభ్రమః**
**స్మృతి భ్రంశాద్బుద్ధినాశో బుద్దినాశాత్ప్రణశ్యతి.**

ఎవరికైతే ప్రకృతి సంబంధమైన విషయాల (వస్తువులు, వైభవాలు మొదలైనవి) మీద ఆసక్తి కలుగుతుందో అది నెమ్మదిగా కోరికగా మారుతుంది. ఆ కోరిక తీరకపోతే అది కోపంగా మారుతుంది. కోపం ఉన్నవారు ఏం చేస్తారు? వివేకం అంటే తెలివిని కోల్పోతారు. తన కోపమే తన శత్రువు అని, ఆ కోపం వలన తనని తాను, భగవంతుని కూడా మర్చిపోతాడు. దానివలన బుద్ధి సక్రమంగా పనిచేయక తప్పులు చేస్తూ పతనం అయిపోతాడు.

ఎవరైనా కోరికలు పెంచుకుంటే దుఃఖం తప్ప సుఖం ఉండదని భగవంతుడు చెబుతున్నాడు. మనిషికి తిండి, బట్ట, ఉండటానికి గూడు ఇవి





అవసరాలు. కోరికలు అనేవి వీటన్నికంటే వేరైనవి. ఇవి అనంతాలు, ఎంత తీర్చినా వీటికి తృప్తి ఉండదు. మరలా, మరలా పుట్టుకొస్తూ ఉంటాయి. అందుకే బుద్ధిని అదుపులో పెట్టి కోరికలను నిగ్రహించుకున్నవారే సుఖపడతారు గానీ కోరికలతో పరుగుపెట్టినవారు ఏనాటికి సుఖపడలేరు. నిలబడి నీళ్ళు త్రాగితేనే సుఖం గాని పరుగుపెట్టి పాలు త్రాగడంతో సుఖం కన్నా శ్రమ ఎక్కువగా ఉంటుంది. మనిషి వినాశీ ధనం వైపు పరుగుపెడుతూ ఆయాసంతో, ఆవేదనతో శరీరాన్ని విడుస్తున్నాడే గాని నిలకడగా భగవంతుడిని కొలుస్తూ శాంతిగా బ్రతకలేకపోతున్నాడు. ప్రతి మనిషి "నేను ఎవరికోసం, ఎవరి కోరికలు తీర్చడానికి పాపాలు చేస్తూ అక్రమ సంపాదన చేస్తున్నాను దాని ఫలితం ఏమిటి" అని తనని తాను ప్రశ్నించుకోవాలి. ఎందుకంటే మన సంపాదన అనుభవించిన వారు మన పాపంలో భాగం పంచుకోరు అందుకు ఉదాహరణగా ఈ క్రింది కథ విందాం.

ఒక వ్యాపారస్తుడు తన దుకాణం తెరవగానే ఒక సాధువు వచ్చి అయ్యా ధర్మం చేయండి బాబూ! అని అడిగాడు. దానికి వ్యాపారస్తుడు ధర్మం లేదు గిర్మం లేదు ఫో.... ఫో.... అన్నాడు. అప్పుడు సమయం 9 గంటలు అయింది మరలా 10 గంటలకి ఆ సాధువు అయ్యా! ధర్మం చేయండి అని అడిగాడు దానికి వ్యాపారస్తుడు ఇందాకా చెబితే వినపడలేదా ఫో.... ఫో... అన్నాడు. ఇలా సాధువు గంట గంటకి భిక్షం అడగడం వ్యాపారి ఛీ ఫో అనటం జరుగుతోంది. రాత్రి 9 గంటలు అయింది. ఆ వ్యాపారి దుకాణం మూసివేసేముందు ఈ సాధువు అయ్యా అని కేకేశాడు. ఆ వ్యాపారి ఓరి మూర్ఖుడా! ఉదయం నుండి ఇక్కడే ఉన్నావా, అంత పట్టుదలేంటి? ఈ పాటికి పది చోట్లకి వెళ్ళి అడుక్కుని ఉంటే ఫలితం దక్కేది కదరా అన్నాడట దానికి సాధువు అయ్యా! మీరు నాకు ధర్మం చేయొద్దు కానీ నాకు ఒక సందేహం వచ్చింది తీరుస్తారా? అని అడిగాడట. ఆ వ్యాపారి డబ్బు ఖర్చు లేకపోతే చెప్పు ఏదైనా సరే చేస్తానన్నాడట. సాధువు అడిగాడు – మీరు ఉదయం కొట్టు తెరిచిన దగ్గర నుండీ ఒక కప్పు టీ కూడా తాగకుండా వ్యాపారం చేశారు. ఎంతో మంది మీ దగ్గర సరుకుకొన్నారు. ఈ వ్యాపారంలో మీరు మోసం చేయకుండానే లాభం సంపాదించారా అని ఆ వ్యాపారి ఓరి పిచ్చోడా మోసాలు చెయ్యకుండా ఇంత డబ్బు ఎలా సంపాదించగలంరా! ఎన్నో అబద్ధాలు చెబుతాము. ఎదుటివారిని బోల్తా కొట్టిస్తాము అప్పుడే ఇంత డబ్బు సంపాదించగలము అన్నాడట. సాధువు మరి ఈ డబ్బంతా ఏం చేస్తారని

అడిగాడు. ఏం చేయడం ఏమిటి, నీకైతే పిల్లా, జెల్లా లేరు నేను పట్టుకెళ్ళి నా భార్య, పిల్లలకు ఇస్తానన్నాడు. సాధువు అడిగాడు – మీ సంపాదనలతో సుఖాలు అనుభవించే మీ వాళ్ళు మీ పాపాలలో భాగం పంచుకుంటారేమో అడిగి నాకు రేపు చెప్పండి అని వెళ్ళిపోయాడు.

నిజమే ఈ విషయం కనుక్కోవాలి అని ఇంటికి వెళ్లి భోజనం చేసేటప్పుడు తన భార్య, పిల్లల్ని మన జీవితం ఎలా ఉంది అని అడిగాడు. వారు మీ సంపాదన వలన మేమంతా ఎంతో సుఖంగా, ఆనందంగా బ్రతుకుతున్నాం అని బదులు చెప్పారు. అందుకు వ్యాపారి నా సంపాదనతో సుఖాలను పొందుతున్నారు కదా! మరి నేను ఆ సంపాదన చేయడానికి ఎన్నో పాపాలు చేస్తున్నాను. ఆ పాపాలలో వాటా పంచుకోండని అడిగాడు. దానికి అతని భార్య పిల్లలు చాలు, చాల్లే నీ పాపాలలో భాగం పంచుకోవలసిన కర్మ మాకేంటి? మేము నిన్ను అక్రమంగా సంపాదించి తెమ్మని చెప్పామా? నువ్వు తెస్తున్నావు. మేము ఖర్చుపెడుతున్నాము. నువ్వు కొంచెం తెస్తే కొంచెంలోనే సర్దుకుపోయే వాళ్లము. నీ కర్మ నువ్వే అనుభవించాలి గాని మాకేం సంబంధం అన్నారు. కనుక ఎవరైతే తనవాళ్ళు అనుకుంటూ వాళ్లని సంతోషపెట్టడం కోసం పాపాలు చేసి సంపాదిస్తారో ఆ పాపాన్ని మాత్రం పూర్తిగా సంపాదించిన వారే అనుభవించాలి. అలాగని భగవంతుడు సంసారంలో భార్యా, పిల్లల్ని సంతోషంగా ఉండేలా చూడొద్దని చెప్పడం లేదు. మన గత జన్మ కర్మఫలం అనుసరించి మనకి ఎంత ప్రాప్తి వస్తుందో దానితోనే సంసారాన్ని నడపమని చెబుతున్నాడు. మన సంపాదన, మన శక్తి ఇంటిలో వారికి యథార్థంగా తెలియచెప్పి వాళ్లు కూడా మనకి ఉన్న దానిలోనే సర్దుకుపోయి తృప్తిగా బ్రతకడానికి అలవాటుపడేలా చేయాలని చెబుతున్నాడు. ఒకవేళ వారు కోరికలతో మనల్ని ప్రోత్సహించి అక్రమమార్గంలో ధనార్జన చేయమన్నా మీరు చేయకండని భగవంతుడు చెబుతున్నారు. అలా చేస్తే ఫలితం పైన చెప్పిన విధంగా ఉంటుంది.

### 69వ శ్లోకం

**యా నిశా సర్వ భూతానాం తస్యాం జాగర్తి సంయమీ**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః**

లో ఎవరైతే కంటికి కనబడే ఈ వస్తు సముదాయం, ప్రకృతి సంబంధమైన విషయాల పట్ల నిమిత్తభావం లేకుండా వాటి మీదే ధ్యాస



అంతా ఉంచి జీవితాన్ని గడుపుతూ ఉంటారో వారు ఎన్నటికీ జ్ఞానస్వరూపుడైన భగవంతుని తెలుసుకోలేరు. కనుక వారు ఎంత భౌతిక సుఖాలలో ఉన్నా రాత్రి అంటే అజ్ఞానంలో ఉన్నట్లే. అలాగే ఎవరైతే లౌకిక విషయాలలో ఉంటూ కూడా వాటికి అంటకుండా ఉంటూ నిరంతరం వెలుగు అంటే భగవంతుని కోసం ప్రయత్నం చేస్తారో వారికి అది పగలుగానే వర్తిస్తుంది.

### 72వ శ్లోకం

**ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి**
**స్థిత్వా స్యా మస్తకాలే పి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి**

లో ఎవరైతే అంత్యకాలం వరకు భగవంతుని స్మృతి చేస్తూ శరీరం విడుస్తారో వారు బ్రహ్మానందం పొందుతారు. చాలా మంది భగవంతుని కార్యం చేయాలంటే చిన్న వయస్సులో ఎందుకు? అప్పుడే ఏమంత వయస్సు అయిపోయింది. ముందు సంపాదన, ఇల్లు అన్నీ సమకూర్చుకున్న తరువాత తీరుబడిగా తీర్థయాత్రలు మొదలైనవి చేసి పుణ్యం సంపాదించుకోవచ్చునులే అని భావిస్తుంటారు. నిజానికి ఏ క్షణంలో మనం శరీరం వదిలేస్తామో ఎవ్వరికీ తెలియదు అలాంటప్పుడు గ్యారంటీ లేని ముసలితనం వరకు ఆగడం ఎలా సాధ్యం! ఒక వేళ మనకి ఈ భూమి మీద ఇంకా నూకలు ఉండి ఎక్కువ కాలం బ్రతికినా అప్పుడు శరీరానికి సంబంధించిన కఫ, వాత, పిత్తాలు అంటే రొంప, దగ్గు, పక్షవాతం లేక కీళ్లనొప్పులు, మూలశంఖ లాంటి బాధలు మనల్ని దైవ చింతన వైపు నిలువనివ్వవు. అంతే కాకుండా పరుగు పందెంలో పాల్గొనేవాడు ఎంతో కాలంగా అభ్యాసం చేస్తేనే గాని పరుగుపెట్టలేడు. అప్పటి కప్పుడు పరుగుపందెంలోకి దిగితే కాళ్ళు పట్టేస్తాయి కానీ గమ్యం చేరలేరు. అదేవిధంగా మనిషి చిన్నతనం నుండి భగవంతుని గురించి తపనతో సన్మార్గంలో ప్రయాణం చేస్తుంటేనే అంతిమ సమయానికి కూడా భగవంతుని స్మృతి ఉంటుంది. లేకపోతే అజామీళుని కథలో వలె నార అని కూడా అనలేక పీచు అని శరీరం వదిలివేయవలసి వస్తుంది. అందువలన అందరూ చిన్నతనం నుండే భగవంతుని చేరే మార్గంలో ప్రయాణం మొదలుపెట్టాలి. ఇప్పటికే వయస్సు పెరిగిపోయినా పర్వాలేదు. ఏకాగ్రచిత్తంతో భగవంతుని స్మృతిలో ఉంటే వారికి కూడా మిగతా జీవితకాలం అంతా ఆనందమయంగా మారిపోతుంది. వరదలు వచ్చినప్పుడు ఇల్లు మునిగిపోయినవారు ఏడుస్తుంటారు. మరి అదే ఎత్తైన ప్రదేశంలో ఉన్నవారు ఆ దృశ్యాన్ని ఎంతో

ఆనందంగా చూస్తుంటారు. నిజానికి ఇక్కడ వరద అంటే కష్టాలు లాంటివి. వాటిని చూసి సామాన్యుడు బెంగ పడతాడు. మరి ఎత్తు అంటే భగవంతుని జ్ఞానం ఆధారంగా మనస్సు, బుద్ధిని ఉన్నతి చేసుకున్నవారు ఎంత కష్టం వచ్చినా అదొక దృశ్యంలా ఆనందంగా చూడగలరు. కనుక దైవబలం ఆధారంగా మనిషి చివరివరకు ఆనందం పొందగలుగుతాడు. వ్యక్తుల సహాయంతో కొంత సుఖం వెనువెంట దుఃఖం ఇలా పడిలేచే ఆట ఆడతారు.

## 3వ ఆధ్యాయం - కర్మయోగం

### 3వ శ్లోకం

**లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ**
**జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్**

ఆత్మను గురించి, పరమాత్మను గురించి తెలుసుకోవాలనే తపన గలవారికి జ్ఞానయోగము, కోరికలు లేకుండా కర్మ చేసే యోగులకి కర్మయోగము ఆచరింపదగినది. ఎవరైతే తనని తాను (ఆత్మను) తెలుసుకోవాలనే తలంపుతో ప్రయత్నిస్తూ జ్ఞాన మార్గంలో వెళ్ళి ఇతరులకి ఆ మార్గం చూపించినా లేక తన శ్రేష్ఠ కర్మ ద్వారా లోక కళ్యాణం చేస్తూ ఇతరులకి శుభం చేకూర్చినా రెండూ మంచివే.

### 5వ శ్లోకం

**న హి కశ్చిత్క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్**
**కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః**

కర్మ చేయకుండా ఎవ్వరూ ఒక్క క్షణం కూడా ఉండలేరు. ఊపిరి పీల్చడం కర్మ, తినడం కర్మ, నడవడం కర్మ, మాట్లాడటం కర్మ ఇలా ఏది చేసినా అది కర్మే అవుతుంది కనుక కర్మ చేయకపోవటం అన్నది లేనేలేదు. ఎవరైతే తన కోసం కాకుండా, లోకం కోసం కర్మ చేస్తారో వారు కర్మ చేసినా చేయనట్లే అదేవిధంగా ఎవరైతే సోమరితనంతో శారీరక కర్మలని విడిచిపెట్టి మనస్సుతో ఆలోచనలు చేస్తారో వారు వ్యర్థకర్మలు చేసినట్లే.

### 12వ శ్లోకం

**ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞ భావితాః**
**తైర్దత్తానప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః**





మనిషి చేసే కర్మల ననుసరించి వారికి భోగ, భాగ్యాలు సమకూరతాయి. వాటిని భగవంతుడు మనకి కర్మఫలంగా ఇస్తాడు. అలా భగవంతుడు ఇచ్చిన ఫలాన్ని అతనికి తిరిగి సమర్పించకుండా అనుభవించినా, భుజించినా అతడు దొంగ అని భగవంతుడు చెపుతున్నాడు. అంటే మనది అనుకునేది నిజంగా భగవంతుడు ఇచ్చింది. మనం అన్నం తినాలంటే అన్నం, కూరలు మొదలైనవి అన్నీ ఉన్నంత మాత్రాన సరిపోదు. ఆ సమయంలో మనకి ఆరోగ్యం బాగుండాలి. ఆరోగ్యం బాగున్నా ఎటువంటి దుర్వార్తలు (ఎవరో చనిపోయారని లేక ఎవరికో ప్రమాదం జరిగిందని) చెవిని పడకూడదు. అలా పడితే అన్ని భక్ష్య, భోజ్యాలు ఉన్నా వాటిని మనం తినలేము. కనుక ఆ సమయంలో అవాంతరాలు ఏమి లేకుండా అన్నం తినగలుగుతున్నామంటే అది భగవంతుడు మనకు ఇచ్చిన అవకాశంగా భావించి ఆయనకు అర్పణచేసి భోజనం చేయాలి. నిజానికి భగవంతునికి అర్పణ చేస్తే ఆయన తింటాడా? లేదు. భగవంతుడు అభోక్త, అంటే వేటిని భోగించడు. కానీ మనం మంచి మనస్సుతో అన్నం భగవంతునికి అర్పణ చేస్తే దానిలో భగవంతుని స్మృతి ఉన్న కారణంగా ప్రసాదంగా మారుతుంది. సూర్యునికి ఎదురుగా తడిబట్ట వేస్తే - ఆ తడిబట్ట వలన సూర్యుడికి ఏమీ వేడి తగ్గిపోదు. కానీ బట్టకి ఉన్న తడిపోయి పొడిగా అయ్యి తిరిగి మనం ధరించడానికి ఉపయోగపడుతుంది. అదేవిధంగా భగవంతునికి నైవేద్యం చేసే ఆహారం కూడా మనకు శాంతి, ఆనందం ఇస్తుంది. అందుకే మన ఇంట్లో ఎన్ని స్వీట్లు ఉన్నా పుణ్య స్థలాల నుండి తెచ్చిన ప్రసాదానికి ఎంతో విలువనిచ్చి కళ్ళకి అద్దుకుని తింటాము. కారణం అవి భగవంతుడికి అర్పణ చేసినవి కావడమే. అందుకే వాటికి అంత విలువ - వాటిలో ఉన్న పంచదార, నెయ్యి, పిండి అన్నీ మన ఇంట్లో ఉండేవే కాకపోతే అవి తయారయ్యాక నైవేద్యం పెడతారు. కనుక ప్రసాదం అంటున్నారు. మామూలుగా వండుకుంటే పిండివంట అంటున్నారు. నిజానికి అన్నం వలన ప్రాణాలు నిలుస్తున్నాయి. మరి ఆ అన్నం ఎంత మంచిగా ఉండాలి! ఎలాంటి అన్నం తింటామో అలాంటి మనస్సు ఏర్పడుతుంది. ఎలాంటి మనస్సుతో అన్నం తయారుచేస్తామో అలాంటి అన్నం తయారవుతుంది. అంటే మనిషి ప్రవర్తన మీద అన్నం, ఆ అన్నం తయారుచేసిన వ్యక్తి యొక్క మనస్సు ప్రభావం పడతాయి. అందుకే చూడండి, పేదవారయినా పిల్లలకి తమ తల్లులు ప్రేమతో గంజి అన్నం పెట్టినా వారు ఆరోగ్యంగా, ఆనందంగా ఉంటారు. ఉన్నవారయినా వంటగదిని వంటవాళ్ళకి వదిలిపెడితే వారు మొక్కుబడిగా

వండి వడ్డిస్తే అది తిన్నవారు ఎంత ధనవంతులైనా అనారోగ్యంతో, నిస్సారంగా ఉంటారు. కారణం ఎన్ని రకాలు వండుకున్నా వాటిని సరైన మనస్సు పెట్టి వండని కారణంగా ప్రభావం చాలా తేడాగా ఉంటుంది.

అన్నం ప్రభావం చాలా గొప్పది. ఎలా అంటే – ఒక రాజుగారు తన భార్యతో కలిసి వారం రోజులు పాటు ఒక వ్రత దీక్షని చేపట్టాడు. దానిని నిర్వహించడానికి ఓ సాధువుని ఆహ్వానించి ఈ వారం రోజుల పాటు మా వ్రతాన్ని మీరు నడిపించి రెండు పూటలా మా ఇంటిలో భోజనం చేసి వెళ్లమని కోరాడు. దానికి ఆ సాధువు మహారాజా! నేను ఎప్పుడూ నా వంట నేనే స్వయంగా భగవంతుని స్మృతిలో తయారు చేసుకుంటాను. ఇప్పుడు మీరు నన్ను మీ ఇంట భోజనం చేయమంటున్నారు. దేశాన్ని పరిపాలించే మీరు నాకు తండ్రిలాంటివారు. మహారాణి నాకు తల్లిలాంటిది అలాంటి మీ కోరికను నేను కాదనలేను కనుక ఈ వారం రోజులు మహారాణీ వారే స్వయంగా భగవంతుని స్మృతిలో నాకు వంట చేసి పెడితే నేను తప్పక తింటానని చెప్పాడు.

దానికి మహారాణి అయ్యా! తప్పకుండా నేనే స్వయంగా భగవంతుని స్మృతిలో మీకు అన్నం వండి పెడతానని చెప్పింది. సరే వ్రతం జరుగుతోంది. ప్రతి రోజు రెండు పూటలా సాధువుకి బంగారుపువ్వు ఉన్న వెండి పళ్లెంలో భోజనం పెడుతున్నారు. భోజనం తిన్న తరువాత ఆ పళ్లాన్ని కడిగి అక్కడ ఉన్న బల్లపై ఉంచి సాధువు తన ఇంటికి తాను వెళ్లిపోతున్నాడు. నాలుగు రోజులు గడిచాక సాధువు ఇంటికి వెళ్లి తన జోలెని తీసి ప్రక్కన పెడుతుండగా దానిలో వెండి పళ్లెం కనిపించింది అప్పుడు సాధువుకి ఎంతో ఆశ్చర్యం వేసింది. నేను పుట్టినప్పటి నుంచి దొంగతనం చేసి ఎరుగను అటువంటిది ఈ రోజు నేను తెలియకుండానే రాజుగారి పళ్లెం దొంగతనం చేసి తిన్న ఇంటికే కన్నం వేసిన దొంగగా మారాను అని బాధపడి వెంటనే రాజుగారి ఇంటికి వెళ్ళి జరిగిన విషయం చెప్పి ఈ రోజు వంట మీ భార్య చేయలేదు అని అన్నాడు అప్పుడు మహారాణి గారు వచ్చి క్షమించండి స్వామీ నాకు చాలా అనారోగ్యంగా ఉండి ఈ రోజు మా వంట మనిషితో వంట చేయించాను అని చెప్పింది. అప్పుడు ఆ సాధువు వంట మనిషిని కేకేసి అమ్మా నీకు ఏమీ భయం లేదు రాజుగారు నిన్ను క్షమిస్తారు నువ్వు ఏ ఉద్దేశ్యంతో వంట చేశావో చెప్పమని అడిగాడు ఆ వంట మనిషి అయ్యా నాకు ఎప్పటినుంచో ఆ వెండి పళ్లెం దొంగిలించాలనే కోరిక ఉంది. ఆ భావనతోనే వంట చేశాను అని చెప్పింది.





దానికి సాధువు చూశారా మహారాజా ఆమె మనస్సు ప్రభావం ఆమె వండిన అన్నం మీద పడి, ఆ అన్నం తిన్న పాపానికి నేను దొంగగా మారాను. అని చెప్పాడు. అందుకే నేను ఎక్కడా భోజనం చేయను స్వయంగా వంట చేసుకుని తింటాను అని చెప్పాడు. దీనిని బట్టి అన్నం యొక్క ప్రభావం ఎంత గొప్పదో తెలుస్తుంది. మరి ఇక్కడ వంటవారు చెడుగా వండుతారు, ఇంటివారు అయితే మంచిగా వండుతారన్నది కాదు సమస్య వంటవారైనా ఇంటివారైనా ఎలాంటి భావంతో వండుతారో అలాంటి అన్నం తయారవుతుంది. ఆ అన్నం ఎవరైతే తింటారో వారికి తిరిగి అలాంటి భావనే కలుగుతుంది. కనుక ఆడవారు భగవంతుని స్మృతిలో అన్నం వండటం చాలా అవసరం. అది ఇంటిల్లిపాదికి ఆరోగ్యాన్ని, ఆనందాన్ని ఇస్తుంది. ఎవరు ఎలాంటి భావనతో వండారో మనకి తెలియదు కనుక ఎవరికి వారు భోజనం చేసేముందు భగవంతునికి అర్పణ చేసి ఈ ఆహారం ఏవిధంగా తయారైనా సరే నీ స్మృతిలో నేను స్వీకరిస్తున్నాను కనుక ఇది ప్రసాదంగా మారి నాకు శాంతిని, సుఖాన్ని ఇచ్చేదిగా నన్ను ఇంకా నీకు దగ్గరగా చేసే విధంగా మార్చాలని కోరుకుంటూ తినండి, అప్పుడు అన్నం మీద భగవంతుని స్మృతి ప్రభావం పడి మీకు మేలు చేకూరుస్తుంది.



### 16వ శ్లోకం

**ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః**
**అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి**

లో భగవంతునిచే బోధించబడిన ధర్మమార్గాన్ని విడచి ఎవరు తనకు తోచిన విధంగా ప్రవర్తిస్తారో వారు వ్యర్థంగా బ్రతుకుతారు. జీవితానికి గమ్యం లేక, పరమార్థం తెలుసుకోవాలనే ఆసక్తి లేక కేవలం తినడం, త్రాగడం, విచ్చలవిడిగా తిరగడం ఇలా జీవితాన్ని గడిపేవారు ఎవరికీ, ఎందుకూ ఉపకారం లేకుండా పోతారు. కనీసం పశువులైనా తిన్న తిండికి సరిపడా శారీరక శ్రమ చేసి యజమానికి ఉపకారం చేస్తాయి. కానీ పైన చెప్పిన వారు వ్యర్థంగా జీవిస్తూ సృష్టించిన భగవంతునికి, శరీరాన్ని ఇచ్చిన తల్లి తండ్రులకు కూడా చెడ్డపేరు తీసుకువస్తారు. ఈ రోజుల్లో శారీరక సుఖాల పేరుతో వ్యభిచారం చేసేవారు చివరికి ఘోరమైన వ్యాధులతో దేహం విడుస్తున్నారు. అలాగే మంచి – చెడు తెలియక దుర్మార్గంతో, శారీరక పశుబలంతో పదిమందినీ బాధించేవారు చివరికి దిక్కులేని చావు చస్తున్నారు. మనిషి తప్పు

మార్గంలో వెళ్తున్నాడంటే కారణం – అతనికి జ్ఞానం తెలికపోవడమే, అది తెలుసుకున్న నాడు మనిషి, మనిషిగా బ్రతికి దేవతగా మారతాడు.

### 21వ శ్లోకం

**యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః**
**న యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే.**

లో గొప్పవారు ఏదైతే పని చేస్తారో మిగిలినవారు కూడా అదే పని చేస్తారు. ఇంటిలోని పిల్లలు పెద్దవాళ్ళు ఏవైతే చేస్తుంటారో ఆ పనులనే అనుకరించి చేసే ప్రయత్నం చేస్తారు. పెద్దలు చెడుమాటలు మాట్లాడుతుంటే పిల్లలు కూడా అవే నేర్చుకుంటారు. మంచి మాటలు మాట్లాడితే పిల్లలకి కూడా మంచిమాటలే వస్తాయి. మరి పెద్దలు భగవంతునికి దగ్గర అయ్యే ప్రయత్నాలు చేయాలి అప్పుడు వారి పిల్లలు కూడా భగవంతునికి దగ్గర అవుతారు.



### 35వ శ్లోకం

**శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వ సుష్ఠితాత్**
**స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయా వహః**

లో చక్కగా ఆచరింపబడిన ఇతరుల ధర్మం కంటే గుణము లేనిదైనను తన ధర్మమే మేలు. తన ధర్మమునందు మరణమైనను మేలే. ఇతరుల ధర్మం భయంకరమైనది. మరి తన ధర్మం–పరధర్మం. ఇవి ఏమిటి? గీత వెలువడే నాటికి ఈ భూమిపై వేరే ఇతర ధర్మాలు లేనే లేవు. కనుక పరధర్మం అనేది వేరే ఏదో కాదు. అది మనలోనే ఉంది. స్వ అంటే ఆత్మ. దాని ధర్మం– శాంతి, దయ, ప్రేమ, అహింస, పవిత్రత, ఆనందం మొదలైన లక్షణాలు, వీటిలో ఉండటం చాలా కష్టం అయినా సరే వాటిని విడువకు, వాటిని కాపాడుకోవడానికి ప్రయత్నం చేయి. దానిలో నీకు మరణం కలిగినా మేలే. కానీ పరధర్మం (పర అంటే పరాయిది) అంటే దేహం. ఈ దేహం పంచభూతాల కలయిక. దీని ధర్మం– కామం, క్రోధం, లోభం మోహం, అహంకారం, వీటిలో నడవటం చాలా తేలిక మనం శాంతిగా ఉండమంటే ఉండలేము. కానీ కోపంగా ఉండమంటే ఎంతో తేలికగా, ఇష్టంగా ఉంటాము, నిజానికి పరధర్మం చాలా తేలికగా ఆచరించవచ్చు, అయినా దానిలో ఉంటే అధోగతి తప్పదు. ఎత్తు ఎక్కడం చాలా కష్టం. అదే జారుడు బల్ల మీద నుండి జారడం





చాలా తేలిక, స్వధర్మంలో ఉండటం ఎత్తు ఎక్కడం లాంటిది. ఈ దేహధర్మం అనేది పాకుడు పట్టిన జారుడుబల్ల లాంటిది. మనల్ని ఆకర్షించి దిగజార్చి ఊబిలోకి నెట్టేస్తుంది.

### 43వ శ్లోకం

**ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మా నమాత్మనా**
**జహి శత్రుం మహాబాహూ కామరూపం దురాసదమ్.**

ఆత్మ, బుద్ధి కన్నా అతీతమైనదని, అది మనస్సు, బుద్ధి, సంస్కారాల కలయికలతో కూడిన యజమాని అని అటువంటి ఆత్మ మనస్సుని బుద్ధి ద్వారా అరికట్టి కోరికలను జయించవలెనని చెబుతారు. నిజానికి ఆత్మ యొక్క శక్తులలో మొదటిది మనస్సు దీని పని నిరంతరం ఏదో ఒకటి ఆలోచించడమే. అది మంచి అయినా, చెడు అయినా ఆలోచిస్తూనే ఉంటుంది. సముద్రంలో అలలు ఎలా అయితే ఆగకుండా వస్తాయో అలాగే మనస్సులో ఆలోచనలు వస్తూనే ఉంటాయి. మరి మనకి వచ్చే ఆలోచనలను బుద్ధి నిర్ణయం చేస్తుంది. బుద్ధి యొక్క డ్యూటీ–నిర్ణయం చేయడం. అందుకే ఫలానా వారి బుద్ధి సరిగా పని చేయటం లేదు ఫలానా వారు చాలా బుద్ధిశాలి అంటుంటారు. మనస్సు చేసే ఆలోచనలని బుద్ధి మంచిగా నిర్ణయం చేస్తే అది పుణ్యంగా మారి సంస్కారంలో మనకి పుణ్యం జమ అవుతుంది. బుద్ధి కనుక చెడుగా నిర్ణయం చేస్తే అది పాపంగా మారి సంస్కారంలో మనకి పాపం జమ అవుతుంది. ఈ పాప, పుణ్యాల ఆధారంగానే మనిషి అనేకానేక జన్మలు కష్ట–నష్టాలు, సుఖ–దుః ఖాలు, కలిమి–లేములు అనుభవిస్తున్నాడు. ఈ సంస్కారమే మనకి నిజమైన మిత్రుడు – నిజమైన శత్రువు. అందుకే పతనానికి మూలం–కామం, కనుక దానిని మనస్సు, బుద్ధి ద్వారా నియంత్రించు అంటే అదుపులో ఉంచు అప్పుడు నీవు సుఖపడతావని భగవంతుడు చెబుతున్నారు.

## 4వ అధ్యాయము - జ్ఞాన యోగము

ఈ అధ్యాయం పేరు జ్ఞానయోగం, సృష్టిలో అన్నింటికంటే పరమ పవిత్రమైనది జ్ఞానం అని దానివలననే మనిషి ఈ సంసార దుఃఖం నుండి తొలగిపోగలడని భగవంతుడు చెబుతున్నాడు. అసలు జ్ఞానం అంటే తెలివి. ఏది మంచి – ఏది చెడు తెలుసుకున్న మనిషి చెడు పనులు చేయడు. తెలియక మానవుడు తప్పు చేస్తున్నాడు.

నిజానికి భగవద్గీతలో 18 అధ్యాయాలలో కూడా ఎలా భగవంతుని పొందవచ్చో చెప్పారు. అందులో సులభమైనది – జ్ఞానమార్గం ఎందుకంటే ఎవరినైనా కలుసుకోవాలంటే వారి పేరు, ఊరు, రూపం తెలుసుకుంటే తేలికగా కలుసుకోగలుగుతాము. అదే మనం కలుసుకోవలసిన వ్యక్తి ఎవరో, ఎక్కడ ఉంటారో ఎలా ఉంటారో తెలియకపోతే అతనిని కలుసుకోవడం సాధ్యం కాదు అలాగే ఎంతోమంది ఎన్నో విధాలుగా భగవంతుని పొందడానికి అనేక జన్మల నుండి ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. కానీ భగవంతుడే స్వయంగా జ్ఞానమార్గం ద్వారా తన పరిచయాన్ని చెబితే కానీ మానవుడు భగవంతుని తెలుసుకోలేకపోయాడు.

జ్ఞానం అనేది అతి తేలికైనది. ఖర్చులేనిది, కష్ట, నష్టాలు కలిగించనిది, జ్ఞానం యొక్క గొప్పతనం మనం తెలుసుకుందాం.

ఒక రాజుగారికి ముగ్గురు భార్యలు ఉండేవారు. వారు ముగ్గురికి ముగ్గురు మగ పిల్లలు ఉన్నారు. ముగ్గురూ మహావీరులే. ఆ రాజ్యంలో పెద్దవాడికే రాజ్యం అనే నియమం ఏమీ లేదు. అందుచేత ముగ్గురు రాజకుమారులు రాజు తర్వాత సింహాసనం ఎక్కాలని కోరుకుంటున్నారు. దానికి రాజు తన మంత్రితో ఆలోచించి ఒక చక్కని ఉపాయం పన్నాడు. అదేమిటంటే ముగ్గురు కొడుకులని పిలిచి ముగ్గురికి తలొక 100 బంగారు నాణేలు ఇచ్చి వారికి వేరు వేరుగా మూడు గదులు ఇచ్చి రేపు తెల్లారేసరికి ఈ గదులని కొంచెం కూడా కాళీ లేకుండా నింపేయాలి. అందుకు మీకిచ్చిన 100 నాణేలు మాత్రమే ఖర్చు చేయాలి అని చెప్పాడు. మర్నాడు ఉదయం పెద్ద కొడుకు తండ్రిని తీసుకెళ్ళి గది తలుపులు తెరచి చూపించాడు లోపల ఎండుగడ్డి నింపి ఉంది. ఇదేంట్రా! ఈ గడ్డి నింపావేంట్రా! అని రాజుగారు అడిగితే మీరిచ్చిన 100 రూపాయలకి గడ్డి కాక ఇంకేమి వస్తుంది అని అడిగాడు. సరే రెండవ వాడు తన గది తలుపులు తెరచి చూపించాడు దానిలో దూది నిండి ఉంది. అందరికీ ముక్కులోకి వెళ్ళి ఉక్కిరిబిక్కిరి అయ్యారు. ఏంట్రా ఈ పని! అని రాజుగారు అడిగితే అన్నయ్య చెప్పినట్లు మీరిచ్చిన 100 రూపాయలకి గడ్డో లేక దూదో వస్తాయి గాని ఇంకెలా నింపాలి అన్నాడట.

ఇక మూడవవాడు తనకిచ్చిన గది తలుపులు తెరచి చూపించాడు. లోపల అంతా ఖాళీ. అప్పుడు తన తండ్రితో నాన్నగారు ఒక్క నిమిషం ఆగండని చిన్న ప్రమిదలో కొంచెం నూనె పోసి వత్తి పెట్టి వెలిగించాడు. అంతే గదంతా



వెలుగుతో నిండిపోయింది. ఆ పిల్లవాడు తండ్రితో నాన్నగారూ! మీరిచ్చిన 100 నాణేలతో ఒక్క నాణమే ఖర్చు అయింది ఇవిగో మిగిలిన 99 నాణాలు అని తిరిగి తండ్రికి ఇచ్చాడట. అప్పుడు మహారాజు సంతోషించి మూడవ వాడికి రాజ్యాభిషేకం చేసాడట. నిజానికి ముగ్గురు మహావీరులే కానీ బుద్ధిలో మాత్రం చిన్నవాడు ప్రజ్ఞ చూపించాడు. అలాగే భగవంతుని కోసం ఎలా ప్రయత్నం చేసినా అన్నింటి కన్నా తేలికైనది, ఖర్చు లేనిది, శ్రమలేనిది – జ్ఞానమార్గం, కళ్ళు మూసుకుని చెట్టుకి ఉన్న కాయని కొట్టడం స్థూలం. ఎన్ని రాళ్ళు వేసినా తగులుతాయన్న గ్యారంటీ లేదు. అదే గురి చూసి ఒక్క రాయితో కాయని కొట్టడం సూక్ష్మం. అదే జ్ఞానం.

### 5వ శ్లోకం

**బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున**
**తాన్య హం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప.**



జీవుడు – శివుడు ఇద్దరూ ఒకే ఆత్మ స్వరూపులు. జీవుడు శరీరాలు ధరిస్తూ, విడుస్తూ ఉంటాడు. మాయకి వశం అయిపోతాడు. శివుడు శరీరాలు ధరించడు. మాయకి అతీతుడు. మానవాత్మ ఉప్పులాంటిది అయితే పరమాత్మ కర్పూరంలాంటి వాడు. చూడడానికి రెండూ ఒకే విధంగా ఉంటాయి. రుచులలో మాత్రం తేడా ఉంటుంది. అలాగే ఆత్మ–పరమాత్మ చూడటానికి సూక్ష్మ బిందురూపాలే. గుణాలలోనే తేడా. చాలామంది ఆత్మ – పరమాత్మ ఒకటే అంటారు.

నిజానికి ఈ శ్లోకం ద్వారా రూపం మాత్రమే ఒకటి కానీ గుణాలు మాత్రం కాదని తెలుస్తుంది. సినిమాలో హీరో పాటలకి, బయట రికార్డింగ్ డ్యాన్స్‌లో కొంచెం పోలిక ఉన్నవారు డ్యాన్స్ చేస్తారు. అంతమాత్రాన హీరో, బయటవారు ఒకటి అవుతారా? అలాగే భగవంతుడు కూడా ఆత్మే. కాకపోతే ఎవరైతే ఉన్నతోన్నతమైన భగవంతుడు చెప్పిన జ్ఞానమార్గంలో వెళ్తూ భగవంతునికి సమానంగా అవుతారో వారినే భగవత్ స్వరూపులు అని అంటారు.

### 7వ శ్లోకం

**యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత**
**అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.**

## 9వ శ్లోకం

**పరిత్రాణాయ సాధూనాం వినాశయ చ దుష్కృతామ్**
**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే**

లో ఈ భూమి మీద ధర్మం ఎప్పుడు బాగా క్షీణించిపోతుందో, అధర్మం పెచ్చు పెరిగిపోయి మంచివారికి అపకారం జరుగుతుందో దుర్మార్గులు పెరిగిపోతారో ఆ సమయంలో నేను ఈ భూమిపై అవతరించి ధర్మస్థాపన చేస్తాను.

నిజంగా ఇది చాలా లోతుగా ఆలోచించవలసిన విషయం. భగవంతుడు ప్రపంచంలో ఎన్నోసార్లు అవతారాలు ఎత్తాడని చెప్పారు. దుష్టశిక్షణ చేశాడని వ్రాసారు. మరి ఒక యుగంలో దుర్మార్గులను నాశనం చేస్తే తర్వాత పాపాత్ములు పెరగకూడదు. కానీ రోజురోజుకి పాపాత్ములు పెరిగిపోతున్నారు. పోలీసులు దొంగలందరినీ జైల్లో పెట్టేశాము ఇక మీకు దొంగల భయం లేదని చెప్పాక ఆ మర్నాడు దొంగతనాలు ఎక్కువ అయిపోయినాయనుకోండి మరి దొంగలందరినీ పట్టుకున్నట్లు కాదు కదా! అలాగే దుర్మార్గులు అంతా నశించిపోతే మరలా ఇంతమంది మరీ ఎక్కువగా ప్రపంచమంతా పెరిగిపోరు కదా! మరి భగవంతుడు ఈ భూమి మీదకి వచ్చే సమయం ఎప్పుడు? దానికి సమాధానం చతుర్యుగాల అంతిమంలో బ్రహ్మ లలాటంలో శివుడు ప్రవేశించి ఆది ప్రణవనాదం వినిపిస్తాడని మన పూర్వీకులు వ్రాసారు. అంటే భగవంతుడు వచ్చే సమయం ఏమిటి? సత్య, త్రేతా, ద్వాపర, కలియుగాలు అని పిలువబడే ఈ సృష్టి చక్రం చివర భగవంతుడు ఈ భూమిపైకి వచ్చి ధర్మస్థాపన చేస్తారు. ఈ సమయం ఎలా ఉంది? చాలా ఘోరంగా, భయంకరంగా ఉంది. అన్నదమ్ముల మధ్య కలహాలు, మత కల్లోలాలు, స్వార్థం, హింస అన్ని చెడుగుణాలు పూర్తిగా పెరిగిపోయాయి. అరాచకం ఎక్కువ అయిపోయింది. వావివరసలు లేని సంబంధాలు, పశువుల కన్నా హీనంగా మనిషి తిండికీ, తిరుగుడికీ అలవాటు పడిపోయాడు. ఈర్ష్య ద్వేషాలు, కామ క్రోధ లోభాలు, అహంకారం, మమకారం ఎక్కువ అయిపోయాయి. 50 సంవత్సరాల క్రితం కూడా ఎంతో కొంత ధర్మంగా ఉండేదని, సాటి మనిషికి సాయపడాలనే తపన ఉండేదని ముసలివారు చెబుతారు. అంటే ఇప్పుడు ప్రపంచంలో జనులు చెడిపోయినంతగా ఎప్పుడూ చెడిపోలేదని ఎంతో కొంత ధర్మంగానే బ్రతికారని అర్థం అవుతుంది. అదీకాక పై శ్లోకాల అర్థంలో కూడా యుగే యుగే అంటే





అప్పుడప్పుడు అని స్పష్టంగా వ్రాసారు. ఎప్పుడైతే ధర్మానికి అతిగా అపకారం జరుగుతుందో అప్పుడే భగవంతుడు భూమి మీదకు వస్తాడు.

అంతకు ముందు ధర్మం భూమి మీద తగ్గడం మొదలుపెట్టినప్పుడు భగవంతుని ప్రతినిధులుగా కొంతమంది ఒకరి తరువాత ఒకరు భూమిపైకి వచ్చి ధర్మం నిలబెట్టడానికి తమ వంతు ప్రయత్నం చేసారు. ఎన్నిరకాలుగా ఎంతమంది ప్రయత్నాలు చేసినా కొంతవరకు మాత్రమే మనిషిని ధర్మ మార్గంలో నడపగలిగారు. మరలా మనిషి పూర్తి పతనావస్థకి అంటే తనలో ఉండే చెడుగుణాలకి బానిస అయిపోయాడు. ఏ విధంగా అయితే యుద్ధంలోకి ముందు సైన్యం, సేనాధిపతులు, మంత్రులు, యువరాజులు, మహారాజులు అయిపోయాక చివర స్వయంగా చక్రవర్తి రంగంలోకి దిగుతాడో అదేవిధంగా ఈ భూమి మీద ధర్మస్థాపన చేయడానికి స్వయంగా భగవంతుడే ఇప్పుడు దిగి వచ్చాడు. ఇక ఈ భూమిపై అధర్మం అంతం కాక తప్పదు.

## 10వ శ్లోకం

**వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః**
**బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః**

ఎవరైతే అనురాగం, భయం, కోపం విడిచి భగవంతునియందే మనస్సుని నిలిపి ఆరాధిస్తారో వారు భగవంతుడినే పొందుచున్నారు. ప్రపంచంలో ఎన్ని తపస్సులు ఉన్నా అన్నిటికన్నా జ్ఞాన తపస్సే చాలా గొప్పదని చెబుతున్నారు. ఎందుకంటే ఎన్ని స్థూల నదులలో స్నానం చేసినా శరీరపు మురికి మాత్రమే పోతుంది. గాని ఆత్మలో ఉండే మురికి ఎన్నటికీ పోదు. నిజంగా పుణ్యనదులలో స్నానాలు చేయటం వలన మనలో ఉండే పాపాలు తొలగిపోయినట్లయితే ఆ పుణ్యనదులలో ఉండే కప్పలు, చేపలు, పల్లెవాళ్ళు ఎంతో పవిత్రం అయిపోయి ఉండాలి. కానీ ఎక్కడా అలా జరగలేదు. ఆత్మ పావనం అవ్వాలంటే భగవంతుని జ్ఞాన స్నానమొకటే ఆధారం, వాస్తవానికి.

**ఆత్మ శస్త్రముచే - ఛేధించబడదు**
**అగ్నిచే - కాల్చబడదు**
**నీటిచే - తడపబడదు**
**వాయువుచే - ఆర్పివేయబడదు. కానీ**
**ఆత్మలో ఉండే చెడు సంస్కారాలు మాత్రం పరమాత్మ యొక్క**

**జ్ఞానమనే శస్త్రంచే - ఖండించబడతాయి**
**జ్ఞానమనే అగ్నిచే - కాల్చబడతాయి**
**జ్ఞానమనే గంగచే - శుభ్రం చేయబడతాయి**
**జ్ఞానమనే గాలిచే - బయటికి విసిరి వేయబడతాయి.**

అందువలన అందరం జ్ఞానసాగరుడు అయిన భగవంతుని జ్ఞాన గంగలో పూర్తిగా స్నానం చేయాలి. అప్పుడే మనలో ఉండే చెడు తొలగిపోతుంది.

### 11వ శ్లోకం

**యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్**
**మమ వర్త్మా నువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః**

ఎవరు, ఏ విధంగా నన్ను పూజిస్తారో వారిని ఆ విధంగానే నేను అనుగ్రహి స్తున్నాను. ఎలా పూజ చేసినా ( సేవించినా) మనుష్యులు నా మార్గాన్ని అనుసరిస్తు న్నారు అని, ప్రపంచంలో ఎన్నో భాషలు ఉన్నాయి. అయినా భావం ఒక్కటే. అలాగే ఎన్నో రకాలుగా భగవంతుని రకరకాల రూపాలతో, పేర్లతో కొలుస్తున్నారు. అయినా సృష్టికర్త ఒక్కడే. ఎవరిని ఎలా కొలిచినా మనస్సులో కొంచెం కూడా కోరిక లేకుండా కొలిస్తే అది స్వయం భగవంతుని కొలిచినట్లే.

### 19వ శ్లోకం

**యస్య సర్వే సమారమ్భాః కామ సంకల్ప వర్జితాః**
**జ్ఞానాగ్ని దగ్ధకర్మాణాం తమాహుః పణ్డితం బుధాః**

ఎవరైతే కోరికలు లేకుండా, సంకల్పంలో కూడా ఆలోచన రాకుండా జ్ఞానమనే అగ్ని ద్వారా వాటిని భస్మం చేసి కర్మ చేస్తారో వారే పండితులు అని భగవంతుడు చెబుతున్నారు. లౌకికంలో శాస్త్ర పరిజ్ఞానం, స్థూల అలంకారముల ద్వారా (అంటే రుద్రాక్షలు, నామాలు, విభూతి మొదలైనవి) వ్యక్తిరూపాన్ని చూసి పండితునిగా భావిస్తారు. నిజానికి అవి శరీర పోషణకి ఉపయోగపడే విద్యలే కానీ భగవంతుని పొందడానికి అంతగా ఉపయోగపడవని తెలుస్తుంది. అలా ఎవరికైనా స్థూలమైన పాండిత్యంతో పాటు వినయం కూడా ఉంటే ప్రజలంతా వారిని ఎంతో గౌరవిస్తారు. వారి విద్య స్థూలమైనదైనా సరే వినయంతో ఇంకా రాణిస్తుంది. అదే అహంకారంతో తమనితాము గొప్పవారిగా



భావిస్తే స్థూలవిద్య రానివారిని హీనులుగా భావిస్తే వారు నిజంగా భగవంతుని దృష్టిలో పండితులు కారు. పైగా అజ్ఞానులే. అంతే కాక ఎవరైతే విద్య ఉండి అహంకారంతో ఉంటారో వారి బ్రతుకు ఏమౌవుతుందో చూద్దాం.

ఒక శాస్త్ర పరిజ్ఞాన పండితుడు పడవ ఎక్కి గోదావరి దాటుతున్నాడు. పడవ నడిపేవాడు పండితుడు ఇద్దరే ఆ పడవలో ఉన్నారు. అప్పుడు ఆ పండితుడు పడవ నడిపేవాడితో ఒరేయ్ నువ్వు భారత రామాయణాలు చదివావా అని అడిగాడట. దానికి పడవనడిపేవాడు - లేదు బాబయ్యా! అన్నాడట. ఛీ....ఛీ..... నీ జీవితంలో పావు జీవితం వ్యర్థం అన్నాడట పండితుడు. కొంచెం సేపు తరువాత పోనీ పురాణాలు చదివావా అని పండితుడు అడిగాడు. చదవలేదు బాబూ అని పడవవాడు చెప్పాడు. ఎందుకు పుడతారు రా ! పురాణాలు చదవలేదా? అయితే నీ సగం జీవితం వ్యర్థం రా అని అన్నాడట. ఇంకొంత ప్రయాణం జరిగింది. తిరిగి పండితుడు ఒరేయ్ కనీసం భాగవతం అయినా చదివావా, అదీ లేదా అని అడిగాడట. ఆ పడవవాడు అయ్యా! ఇందాకటి నుండి తమరు ఏవేవో పెద్ద, పెద్ద మాటలు అడుగుతున్నారు. నాకసలు చదువురాదు బాబయ్యా అని అన్నాడట. అప్పుడు ఆ పండితుడు ఏమిటి? చదువు రాదా అయితే నీ జీవితంలో మూడువంతుల జీవితం వ్యర్థం అన్నాడట.ఆ తర్వాత పడవవాడు పండితునితో అయ్యా! తమరికి ఈదడం వచ్చా అని అడిగాడట. దానికి ఆ పండితుడు కంగారుగా ఏ ఎందుకు?నాకు ఈత రాదు అన్నాడట. అప్పుడు పడవవాడు అయితే మీ పూర్తి జీవితం వ్యర్థం. పడవకి చిల్లు పండింది అని చెప్పి గోదావరిలోకి దూకి ఈదుకొని వెళ్ళిపోయాడు. పాపం ఈ స్థూల పాండిత్యం గల పండితుడు గోదావరిలో పడి గల్లంతు అయిపోయాడు. నిజానికి మనిషి, మనిషిగా బ్రతకడానికి ఉపయోగపడేదే విద్య గాని గొప్పలు చెప్తూ పదిమందికి ప్రదర్శించడానికి చూపించేది విద్య కాదు. ఉత్తములైతే తమకి తెలిసిన విద్యని అది స్థూల విద్య అయినా సరే, జ్ఞానమైనా సరే పదిమందికీ ప్రేమతో పేరు, గౌరవం ఆశించకుండా తెలియచెప్పడానికి ప్రయత్నం చేయాలి గానీ అహంకారంతో తమకి తెలిసినదే గొప్పదిగా భావిస్తూ ఇతరులని చిన్న చూపు చూడకూడదు. నీటిలో దిగేవాడికి ఈత వచ్చి ఉండాలి. అడవిలో వెళ్ళేవాడికి చెట్టు ఎక్కడం వచ్చి ఉండాలి. ఇలా జీవితానికి ఉపయోగపడేదే విద్య గాని పదిమంది ముందు పేరు కోసం ప్రదర్శించేది విద్య కాదు. అలా చేస్తే ఫలితం ఇదిగో ఇలానే ఉంటుంది.

## 22వ శ్లోకం

**యదృచ్ఛా లాభసన్తుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః**
**సమః సిద్ధావ సిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే.**

అప్రయత్నముగా లభించిన దానితో తృప్తిగా ఉండేవారు, సుఖమైనా, దుఃఖమైనా ఒకటి అనే భావన కలిగినవారు ఫలితం లభించినా, లభించక పోయినా ఒకే విధంగా ఉండేవారు. మాత్సర్యం లేనివారే జ్ఞానవంతులు. అలాంటివారు శరీరం కోసం కర్మ చేసినా దాని ఫలితంలో బంధించబడరు.

కొంతమంది ఎంత సంపాదించినా, ఎంత కలిసి వచ్చినా ఇంకా రాలేదని బాధపడుతూ ఉంటారు. వారికి తృప్తి అనేది లేనే లేదు, వారి జీవితాలు అంతా సంపాదనతోనే గడిచిపోతాయి. కనీసం విశ్రాంతి తీసుకునే సమయం కూడా లేక చీమలా కూడపెడుతూ ఉంటారు. ఒక విధంగా ఇలాంటి సంపాదన వారికి శాపం లాంటిదే, మరి కొందరు తమకి లేదని ఏడవటంతో పాటు ఇతరులకి ఉందని (చుట్టు ప్రక్కల వారికి) ఏడుస్తూంటారు. ఇది చాలా హీనమైన విషయం తనకి లేదని ఏడిస్తే ఒకటే పోయింది. ఎదుటివారికి ఉందని ఏడిస్తే రెండూ పోయినాయని చెబుతారు.

ఒక ఊరిలో రామయ్య, సోమయ్య అనే ఇరుగు పొరుగువారు ఉన్నారు. వారిలో రామయ్య అంటే సోమయ్యకి ఈర్ష్య కారణం – ఊరిలో అందరు రామయ్యని గౌరవిస్తూ ఉంటారు. రామయ్య ఒకసారి తపస్సు చేస్తే దేవత ప్రత్యక్షమై నీకేం వరం కావాలో కోరుకో అందట. అప్పుడు రామయ్య ఏది కావాలంటే అది జరిగిపోవాలని అడిగాడట దానికి దేవత తథాస్తు అని వరం ఇచ్చి వెళ్లి పోయిందట. అప్పుడు రామయ్య ఇల్లు కావాలంటే ఇల్లు, ఆవులు, గేదెలు పొలం ఇలా ఏవి కావాలంటే అవి వచ్చేస్తున్నాయట. ఇది చూసిన సోమయ్యకి ఈర్ష్య ఎక్కువైపోయింది తను కూడా ఎంతో కష్టపడి తపస్సు చేసి అదే దేవతను ప్రత్యక్షం చేసుకున్నాడట. అప్పుడు ఆ దేవత నీకేం కావాలో కోరుకో అంటే పక్కింటి రామయ్య గాడికి ఏదైతే వస్తుందో అదే ఫలం నాకు రెట్టింపు రావాలి అని కోరుకున్నాడట. దానికి దేవత అతనితో నీకు పోటీ ఎందుకు నీ సొంతానికి ఏదైనా కోరుకో అన్నదంట. వీల్లేదు నువ్వు వరం ఇస్తానన్నావు నేనడిగినట్టే వరం ఇచ్చి తీరవలసిందేనని పట్టుబట్టాడు. అప్పుడు ఆ దేవత నీ కర్మ అనుభవించు నీవు కోరినట్లే జరుగుతుంది అని చెప్పి మాయం అయిపోయింది.





సోమయ్య ఆనందంగా పొంగిపోతూ ఇంటికి వచ్చాడు. రామయ్య ఒక ఇల్లు కావాలంటే అతనికి రెండు ఇల్లు వస్తున్నాయి. రామయ్య వెయ్యి రూపాయలు కావాలని కోరుకుంటే సోమయ్యకి రెండువేల రూపాయలు వస్తున్నాయి. ఇలా ఏదైనా ఒకటికి రెండు వస్తున్నాయి. అప్పుడు గర్వంతో సోమయ్య రామయ్యని చూసి, చూసావా నా గొప్పతనం ఇప్పుడు నీకంటే నేను గొప్పవాడిని అని గొప్పలు పోయాడట. దానికి రామయ్య వీడికి గుణపాఠం చెప్పాలని తలచి దేవతని తనకి ఒక కన్ను పోవాలనే వరం కోరుకున్నాడట. అంతే అక్కడి సోమయ్యకి రెండు కళ్ళూ పోయాయి. అప్పుడు సోమయ్య భోరుమంటూ గొల్లుమన్నాడట. ఇలా ఎదుటివారితో పోల్చుకుంటే మన గతీ ఇంతే. మనకి ఉన్న దానిలోనే తృప్తిగా బ్రతకాలి గాని ఎవరితోను పోల్చుకోకూడదు. ఎవరి అదృష్టం వారిది, ఎవరి ప్రాప్తం వారిది.

## 30వ శ్లోకం

**అపరే నియతహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి**
**సర్వే ప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపిత కల్మషాః**



ఈ శ్లోకం ప్రకారం కూడా ఆహారం యొక్క గొప్పతనాన్ని భగవంతుడు మనకి తెలియ చేస్తున్నారు. ఆహారం ఎలా ఉండాలో భగవంతుడు చెబుతున్నారు. ఆహారం 1. తక్కువ తినాలి. 2. సాత్విక ఆహారం (అంటే శాకాహారం) మాత్రమే ఉండాలి. 3. మన సంపాదన న్యాయబద్ధంగా ఉండాలి. అలాంటి ధనంతోనే మనం భోజనం చేయాలి. 4. మనం తినే భోజనం భగవంతునికి అర్పణ చేయాలి. 5. వండిన తర్వాత ఎక్కువ ఆలస్యం లేకుండా భోజన పదార్థాలు స్వీకరించాలి. ఇది చాలా అవసరం. చాలా మత గ్రంథాలలో శాకాహారం మాత్రమే తినాలని ఎక్కడా చెప్పరు. మాకు తెలిసినంతలో భగవద్గీతలో మాత్రమే ఇలా శాకాహారం మాత్రమే తినండి, మాంసాహారం తినరాదని చెబుతారు. నిజానికి మానవుడి శరీర నిర్మాణం శాకాహారానికి మాత్రమే అనుకూలంగా భగవంతుడు సృష్టించాడు. ఈ రోజులలో డాక్టర్లు కూడా మనిషికి శాకాహారం అంటే కూరగాయలు, పళ్లు మొదలైనవి చాలా మంచిది అని చెబుతున్నారు. సైన్స్ ప్రకారం మనం పరిశీలించినా మానవుని అన్నవాహిక నుండి జీర్ణాశయం వరకు ఉన్న ప్రేగు పొడవు సుమారు 5 మీటర్లు ఉంటుంది. దానిలో ఊరే రసాయనాలు కూడా కొంచెం తక్కువ శక్తితో ఉంటాయి. అదే పులి, సింహం లాంటి క్రూర జంతువులలో ప్రేగు

పొడవు ఒక మీటరు మాత్రమే ఉంటుంది. కానీ దానిలో తయారయ్యే రసాయనాలు అత్యంత శక్తివంతంగా ఉంటాయి. ఆ కారణంగా క్రూర జంతువులు సాటి జంతువులను తిన్నా ఆ మాంసం నోటి నుండి జీర్ణాశయంలోకి వెళ్ళేలోగానే 75% కరిగిపోతుంది. మిగతా 25% తర్వాత జీర్ణం అయిపోతుంది. మరి మనిషి శరీరంలో ఊరే రసాయనాల శక్తి తక్కువ కారణంగా మాంసాహారం భుజిస్తే అది నోటి నుండి జీర్ణాశయంలోకి వెళ్ళేలోగా 10% కూడా అరుగుదలకి నోచుకోదు. మిగిలినదంతా జీర్ణాశయంలోనే ఉండిపోతుంది. దానిని అరిగించడానికి రక్త ప్రసరణ అంతా ఎక్కువగా జీర్ణకోశం వైపు వెళ్తుంది. ఈ కారణంగానే మెదడుకి రక్త ప్రసరణ తగ్గి మగతగా, బద్ధకంగా అనిపిస్తుంది. అదే విధంగా సరిగ్గా అరగని కారణంగా ఇటువంటి ఆహారం తిన్న వారికి విరేచనాలు, వాంతులు మొదలైనవి అవుతాయి. ఇక మనిషి నాలుక రుచి కోసం కాక శరీరానికి ఎంత అవసరమో అంతే తినాలి. లేకపోతే శరీరం పెరిగిపోయి ఆయాసం వస్తుంది. చలాకీతనం పోతుంది అలాగని మరీ తక్కువ తినడం కూడా చాలా తప్పు. సరిపడా తీసుకోవాలి. చూడండి కారుకి పెట్రోలు తక్కువ అయినా సరిగా పరుగుపెట్టదు. అలా అని మరీ ఎక్కువ అయినా ఉక్కిరిబిక్కిరి అయి పరుగెట్టదు. సమానంగా అందుతున్నప్పుడే ఆ ఇంజన్ వేగంగా పరుగెడుతుంది. అలాగే మనిషి కూడా సమంగా తింటేనే చలాకీగా ఉంటాడు.

అంతేకాకుండా మనం ఇంత క్రితం చెప్పుకున్నట్లు న్యాయంగా సంపాదించిన సొమ్ముతోనే భోజనం చేయాలి. ఎందుకంటే అక్రమ సంపాదనతో తినే అపవిత్ర పరమాన్నం కంటే. సక్రమ సంపాదనతో త్రాగే సంగటి జావే మనకు ఆనందం ఇస్తుంది. చూడండి పొలాన్ని నమ్ముకున్న రైతు ఉన్నంత ప్రశాంతంగా, వ్యాపారం చేసే వ్యాపారస్తుడు ఉండలేడు. నిజంగా రైతుకు ప్రకృతి కలసిరాక ఓ పంట నష్టపోయినా ప్రకృతి తిరిగి సహకరించినప్పుడు మరలా తేరుకుంటాడు. కానీ వ్యాపారస్తుడు ప్రతి క్షణం వ్యాపారంలో తెలిసో తెలియకో కొంత మోసం ఉన్న కారణంగా డాబుగా తిరిగినా మనస్సు అశాంతితోనే బ్రతుకుతాడు. మరి ఈ రోజులలో రైతులు కూడా తమ ధర్మం తప్పిన కారణంగా ప్రకృతి కూడా రోజురోజుకి వ్యతిరేకం అయిపోతుంది. ఎంతోమంది రైతులు ధాన్యం బదులు చెరువులు త్రవ్వి జీవరాసులను పెంచి చంపుతూ సొమ్ము చేసుకుంటూ వ్యాపారస్తులుగానే ప్రవర్తిస్తున్నారు. ఇలా ధర్మం తప్పాక ఇక ఎవరికి మాత్రం సుఖం ఎలా వస్తుంది? భగవంతునికి





అర్పణ చేసిన భోజనం యొక్క ఫలితం మనందరం ముందే తెలుసుకున్నాము. నియమిత సేవనం అంటే మనం వండుకున్న వంట వండిన తర్వాత మూడు గంటల్లోపు తినాలని మన పెద్దలు చెబుతున్నారు. తర్వాత అది పాచిపోవడం మొదలుపెడుతుంది. కానీ ఈనాడు మనమందరం దురదృష్టవశాత్తు పూర్తిగా ఈ విషయానికి వ్యతిరేకంగా భోజనం చేస్తున్నాము. మనిషి జీవన పోరాటంలో సమయం లేక ఈ రోజు వండుకున్నది ఫ్రిజ్ అని పిలువబడే చద్దిపెట్టెలలో దాచుకుని మరునాడు, ఆ మర్నాడు కూడా తింటున్నాము. ఇది ఒక విధంగా కర్మ ఫలమే.

### 31వ శ్లోకం

**యజ్ఞ శిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్**
**నయం లోకో స్త్య యజ్ఞస్య కుతో న్యః కురుసత్తమ**

లో పైన తెలిపిన విధముగా ఉన్న ఆహారం తిన్నవారికి శాశ్వత పరబ్రహ్మ, పరమాత్ముని సన్నిధి దొరుకుతుంది. అలా చేయలేనివారికి ఈ లోకంలోనే సుఖం, శాంతి ఉండదు. ఇక పైలోకం సంగతి ఏం చెప్పగలము అని చెబుతున్నారు. మనిషి తన జీవిత కాలం అంతా శ్రమ చేసినా కొంత భూమిని, కొంత ధనాన్ని, కొంత కీర్తిని పొందగలుగుతున్నాడు. కానీ ఇవన్నీ అశాశ్వతాలు. ఎప్పుడు మనల్ని విడచిపెట్టేసి వెళ్ళిపోతాయో తెలియదు. ఒకవేళ ఉన్నా మనల్ని కట్టెల్లో పెట్టే దాకా మాత్రం కూడా ఉంటాయి. ఆ తర్వాత ఏవీ కూడా రావు, కానీ పరబ్రహ్మ పరమాత్ముడు ఒక్కడే శాశ్వతుడు. అందరూ సక్రమమైన రీతిలో బ్రతికి ఆ భగవంతుని చేరుకోవాలి అదే మానవ జీవితానికి గమ్యం దానికి సక్రమ సంపాదన, సత్ప్రవర్తన, భోజన నియమం మొదలైనవి ఆధారం.

### 33వ శ్లోకం

**శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాన జ్ఞానయజ్ఞః పరస్తప**
**సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరసమాప్యతే.**

లో ద్రవ్యం అంటే ధనంతో సాధించే యజ్ఞం కంటే జ్ఞానయజ్ఞం చాలా గొప్పదని చెబుతున్నారు. ఇది ముమ్మాటికి నిజం. ఎందుకంటే ధనంతో చేసే యజ్ఞాలు ఆర్భాటానికి, హంగుకీ, పదిమందికీ చూపించడానికి వేదికలుగా మారుతున్నాయి. కానీ జ్ఞానం అనేది సరస్వతీనది లాంటిది. అంతర్వాహిని, కంటికి కనపడదు. కానీ దాని ప్రవాహం వలన మనలోని చెడు తొలగిపోతుంది.

అదీకాక ధనయజ్ఞం వలన పుణ్యం వస్తుందో, పాపం వస్తుందో కూడా మనలో చాలా మందికి తెలియదు. మనలో ఎందరో దేవాలయాలకు వెళ్లినప్పుడు చిల్లరమార్చి, మెట్ల మీద ఉన్న ముష్టివాళ్లకు వేస్తుంటాము. అమ్మయ్య ఈ రోజు పదిమంది ముష్టివాళ్లకు దానం చేసాను. పుణ్యం వచ్చింది అనుకుంటాము. నిజానికి పుణ్యం మాట ఎలా ఉన్నా పాపం వచ్చే అవకాశం ఎక్కువ ఉందని భగవంతుడు చెబుతున్నారు. ఇదేం భగవంతుడు! "దానం చేస్తే పుణ్యానికి బదులు పాపం వస్తుందంటున్నాడు" అని ఆశ్చర్యంగా ఉండచ్చు. ఇదే మానవుని జ్ఞానానికి, భగవంతుని జ్ఞానానికి ఉన్న తేడా, భగవంతుని జ్ఞానం చాలా లోతైనది. నిజంగా చూడండి – మనం పుణ్యం కోసం ముష్టివాడికి ఒక రూపాయి దానం చేశామను కుందాం. ఆ రూపాయి తీసుకెళ్లి ఆ ముష్టివాడు ఏ గంజాయికో, లేక సిగరెట్టుకో లేక ఇంకో చెడు పనికో ఉపయోగిస్తే ఆ పనిని వాడు చేయడానికి సహాయోగం మనం చేసిన వాళ్లం అవుతాము. కనుక దానిలో భాగంగా పాపం మనకి జమ అవుతుందని భగవంతుడు చెబుతున్నారు. మరి దానం చేయద్దని భగవంతుడు చెబుతున్నారా? లేదు. అలా ఎప్పటికీ భగవంతుడు చెప్పరు. నీ ఇంటికి వచ్చిన యాచకుడికి (ముష్టివాడికి) నీ ఎదుటే నీ సమానంగా (అంటే ఇంట్లో అని కాదు) నువ్వు తినేది, పాచిపోనిది, పులిసిపోనిది కడుపు నిండా పెట్టు అంతేగాని జోలెలో కూడా వేయద్దు. ఎందుకంటే ఎంతో మంది ముష్టివాళ్లు తమ అవసరం కన్నా ఎక్కువ వచ్చిన అన్నాన్ని, సాటి ముష్టివాళ్ళకి అమ్మి ధనంగా మార్చుకొని ఆ ధనాన్ని వేరే వ్యసనాలకి ఉపయోగిస్తున్నారు. అసలు ముష్టివానికి తన భార్య, పిల్లలను పోషించుకునే హక్కు లేదని భగవంతుడు చెబుతున్నారు. ఇదంతా చూస్తుంటే ఓర్నాయనోయ్ భగవంతునికి ఎంత కఠిన హృదయం అనిపిస్తుంది కదా! అది చాలా తప్పు భగవంతుడు ఏం చెబుతున్నాడంటే ఆ ముష్టివాళ్లకి గత జన్మలలో కూడా ఎంతో మంచి జీవితాలనే ఇచ్చాను కానీ వారు తమ జీవితాన్ని వృర్థం చేసుకొని ఈ జన్మలో ఇలా తయారయ్యారు అని. కనుక ఇప్పుడు బాగా బ్రతుకుతున్నాం అనుకొంటున్న మనందరం కూడా ఈ జీవితాలని సఫలం చేసుకోక, దుర్వినియోగం చేసుకొంటే మన రాబోయే జన్మలకి నమూనాయే వాళ్ళుగా భావించాలి. మరి అన్ని సమయాలలో మనం ఇంటి దగ్గరే ఉండము కదా! బయటికి వెళ్ళినప్పుడు కూడా అన్నం పట్టుకెళ్ళలేము కదా! అనే ప్రశ్నలు రావొచ్చు.





ఉదాహరణకి మనం రైలులో ప్రయాణం చేస్తున్నప్పుడు రెండు చేతులు లేనివాడో, కళ్ళు లేనివాడో ఇలా ఎంతో బాధని కలిగించేవారు వచ్చి అడుక్కొంటారు. అప్పుడు మన దగ్గర ధనం తప్ప వేరే ఏమీ లేదు కనుక ఏం చెయ్యాలి? అప్పుడు మనం అతనికి ఇవ్వదలచుకున్నది ఇచ్చే ముందు ఓ భగవంతుడా! ఈ ధనంతో ఈ ముష్టివాడు కడుపు నింపే ఆహారాన్ని కొనుక్కోవాలే గాని వేరే ఇతర వ్యసనాలకి వాడకుండా అతనిని నడిపించమని సంకల్పం చేసి వేస్తే దానిని అతడు ఎలా ఉపయోగించినా ఆ ఫలితం మనకు అంటదని భగవంతుడు చెబుతున్నారు కానీ ఇదే సాకుగా ప్రతీసారీ చేయకూడదు. సాధ్యమైనంతవరకు మన దగ్గర ఉన్న పండో, కాయో ఇవ్వడానికి చూడాలి. అదీ అశక్తులైన వ్యక్తులకు మాత్రమే సాయం చేయాలి. సోమరులకి అవయవాలు లోపం లేనివారికి అసలు చేయకూడదు. అలా చేస్తే బూడిదలో పోసిన పన్నీరు అవుతుంది. ఇలా జ్ఞానయుక్తంగా ధర్మం చేస్తే మనకి కర్మఫలం ఉండదు.

## 36వ శ్లోకం

**అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః**
**సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి**



పాపాలు చేసిన వాళ్ళందరిలోకి – నువ్వు పెద్ద పాపాలు చేసిన వాడివైనా పర్వాలేదు. ఈ జ్ఞానమనే తెప్ప నిన్ను ఆ పాపసముద్రాన్ని దాటించేస్తుంది. నిజానికి మానవులు తెలియక పాపాలు చేస్తున్నారు. ఇకనైనా ఈ జ్ఞానం వలన ఎవరైతే తమలో ఉండే పాపగుణాలను విడిచిపెట్టి పుణ్యకార్యాలు చేస్తుంటారో వారు నెమ్మదినెమ్మదిగా తమ పాపాలను భస్మం చేసుకుని పుణ్యాత్ములుగా మారవచ్చునని భగవంతుడు చెబుతున్నారు. రెండు రకాలుగా మనం మనలో పాపాలను తొలగించుకోవచ్చు.

1. చెరువులో ఉన్న పాత నీటినంతా తోడేసి క్రొత్త నీటిని ఎక్కించటం. అనగా మనలో ఉన్న చెడునంతా తొలగించుకుని మంచిని నింపటం. ఇది కొంచెం కష్టసాధ్యమైన పని. 2. చెరువుకి ఆవలివైపు గండి కొట్టి, ఈవలి వైపు నుండి కొత్త నీటిని నెమ్మదిగా చెరువులోకి పంపించటం. అలాగే మనలో చెడుని తొలగించుకుంటూ కొత్తనీరు అంటే పుణ్యం నింపుకోవటం.కొన్నాళ్ళకి పాతనీరు అంతా పోయి కొత్తనీరుతో చెరువు నిండిపోతుంది. కొంచెం పాత, క్రొత్త నీరు కలిసినా మనం రంగుని బట్టి వేరుచేయచ్చు అలాగే జ్ఞానం ఆధారంగా పాపం, పుణ్యం తెలుసుకుని తొలగించుకోవచ్చు.

పాపాత్ములు గీత చదవకూడదు. శాస్త్రాలు చదవకూడదు అని కొంతమంది పండితులు అంటారు. ఇలా అనేక రకాలుగా ఆంక్షలు పెడుతూ ఉంటారు. కానీ గీతలో భగవంతుడు అలా ఎప్పుడూ చెప్పలేదు. పైగా పతనం అయిపోతున్న మనిషికే ఎక్కువగా జ్ఞానం అవసరం అని చెప్పాడు. బాగా చదివేవానికి ప్రత్యేకంగా చదవమని చెప్పనవసరం లేదు. చదవకుండా అల్లరిగా తిరిగే విద్యార్థికే అందరూ బాగా చదవమని బుద్ధి చెప్తారు. అలాగే సన్మార్గంలో నడిచేవారికంటే చెడు మార్గంలో నడిచేవారికే ఈ జ్ఞానం అవసరం.

**39వ శ్లోకం**

**శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః**
**జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమచిరేణాధిగచ్ఛతి.**

ఎవరైతే శ్రద్ధతో, మనస్సుని, బుద్ధిని అదుపులో ఉంచి సాధన చేస్తున్నారో వారు జ్ఞానాన్ని చక్కగా పొంది తొందరగా శాంతిని పొందుతున్నారు.

జ్ఞానం పొందడానికి నిజమైన అర్హత-శ్రద్ధ. అలాగే మనస్సు యొక్క పవిత్రత, దీనికి తోడు శరీరానికి కూడా అవసరమే ఎందుకంటే శరీరం అశుభ్రంగా ఉంటే మన శరీర దుర్గంధం మనకే సోకి భగవంతుని మీద మనస్సు నిలవనీయదు. అదే శరీర ఆరోగ్యం, పరిశుభ్రతలను కాపాడుకుంటే సగం వరకు అవి మనల్ని భగవంతుడి జ్ఞానం వైపు వెళ్లడానికి సహాయోగం చేస్తాయి.

**40వ శ్లోకం**

**అజ్ఞశ్చాశ్రద్ధ ధానశ్చ సంశయాత్మా వినశ్యతి**
**నాయం లోకో స్తి న పరో న సుఖం సంశయాత్మనః**

జ్ఞానం లేనివాడికి, శ్రద్ధ లేనివాడికి అనుమానం (అంటే భగవంతుడినే అనుమానించడం) ఉన్న వారికి ఈ లోకంలో గాని, పరలోకంలో గాని సుఖం లేదని చెబుతారు.

**భుజబలంతో - పెద్దపులిని చంపవచ్చును**
**నాగుపాము మెడను - చంకలో పట్టవచ్చును.**
**వాడియైన కత్తిని - చేతితో ఆపవచ్చును.**
**ముళ్ళ కంపలోనికి - ప్రవేశింపవచ్చును.**



**కానీ ఎంత నేర్పరి అయినా సరే -**
**దుష్టులకి జ్ఞానాన్ని తెలియచెప్పి**
**వారిని మంచివారిగా మార్చలేదు**

**- నరసింహశతకం నుండి గ్రహీతం**

కొంతమంది తమ మూర్ఖత్వంతో - దుష్టగుణంతో జ్ఞానాన్ని తెలుసుకోలేక పూర్వజన్మ లేదు. మరలా జన్మలేదు అసలు భగవంతుడు ఎలా పుట్టాడు... ఇలా వితండవాదం చేస్తారు. అసలు మానవుడు తన శక్తి గురించి తెలుసుకున్న తర్వాత తనను సృష్టించిన భగవంతుని విమర్శ చేసే సాహసం చేయాలి. మానవుడు ఈ రోజు తన శక్తిని తాను చాలా గొప్పగా ఊహించుకుంటున్నాడు. ఈ విశాల విశ్వంలో భూమి అన్నదాని ఉనికే చాలా చిన్నది. ఆవగింజలాంటిది. దానిపై అనేకానేక దేశాలలో, అనేకానేక పేర్లతో పాత్రను అభినయించే మనిషి జీవితం సముద్రంలో సూది ముంచి తీస్తే వచ్చే నీటిలో కోటానుకోట్ల వంతు కూడా ఉండదు. అలాంటి మనం ఆ పరమాత్మ ఉనికిని ప్రశ్నించే సాహసం చేయడం చాలా తప్పు. ముందు ముందు గీతలోనే చెబుతారు.

నమే భక్తః ప్రణశ్యతి అంటే నన్ను నమ్మినవాడు ఎన్నటికీ చెడిపోడు అని. భగవంతుని నమ్మి చెడినవాడు లేడు, నమ్మక సుఖపడినవాడూ లేడు. ఆకాశం వైపు చూసి ఉమ్మి వేస్తే అది తిరిగి మనమీదే పడుతుంది. అదే ఆకాశంపై పువ్వులు జల్లితే అవి మనమీదే పడతాయి. ఏది చేయాలో మనమే నిర్ణయించుకోవాలి. అంతా మన చేతులలో, చేతలలోనే ఉంది.

## 5వ అధ్యాయం - కర్మ సన్న్యాస యోగం

గీత కర్మసన్యాసం అంటే కర్మ చేయకుండా ఉండటం అనుకుంటే అది చాలా తప్పని, ఇక్కడ సన్యాసం అంటే కర్మని సన్యసించడం అని కాదని, కర్మ ఫలాన్ని అంటే కర్మ చేయడం వలన వచ్చిన ఫలాన్ని ఆశించకుండా ఈశ్వరార్పణం చేయడం, త్యాగం చేయడమే ఉత్తమమని చెబుతుంది.

**2వ శ్లోకం**

**సన్న్యాసః కర్మయోగశ్చనిశ్శ్రేయసకరా వుభౌ**
**తయోస్తు కర్మ సన్న్యాసాత్కర్మ యోగో విశిష్యతే.**

ఇక్కడ కర్మ త్యాగము - కర్మయోగము, పైన చెప్పినట్లు కర్మ ఫలాన్ని త్యాగం చేయడం - మొదటిది. ఇది చాలా కష్టమైనది. ఎంతో సాధనతో

సాధ్యం అవుతుంది. ఇక రెండవది - మంచి మనస్సుతో నిస్వార్థ కర్మ చేయడం దీనినే కర్మయోగం అని అంటారు. ఇది మొదటి దాని కంటే శ్రేష్ఠమైనది. ఎందుకంటే ఎంతోమంది నిజంగా కర్మలు చేయకుండా ప్రపంచంలో విషయా లని మనసుతో ఆలోచిస్తుంటారు. వారు నిజంగా బద్ధకస్తుల క్రిందే లెక్క. చాలా కొద్దిమంది మాత్రమే ఎక్కడో కోటికి ఒక్కరు మాత్రం నిర్వికల్ప సమాధి స్థితిలో అంటే నిరంతరం సంకల్పంలో కూడా అంటే ఆలోచనలలో కూడా వికల్పం అంటే చెడు అనేది లేకుండా యోగస్థితిలో ఉండి లోకం కోసం తమ మనస్సు యొక్క శక్తిని ధారపోస్తారు. అలాంటి వారికి మాత్రమే కర్మ సన్యాసం అనే పదం పూర్తిగా వర్తిస్తుంది. వారు కర్మ చేసినా చేయనట్లే. కర్మ చేయకుండా ఉన్నా అందరి కోసం చేసినట్టే. అలాంటి అందరి కంటే కూడా ఒక్క భగవంతుడు మాత్రమే నిజమైన కర్మ సన్యాసి, మనందరం కర్మయోగంలో కొనసాగడమే చాలా మంచి పద్ధతి. దాని వలన ఉడుత సాయంలాగ ప్రపంచానికి ఎంతో కొంత మేలు జరుగుతుంది.

### 3వ శ్లోకం

**జ్ఞేయస్స నిత్య సన్న్యాసీ యో న ద్వేష్టి న కాజ్క్షతి**
**నిర్ద్వన్ద్వో హి మహాబాహో సుఖం బన్ధాత్ప్ర ముచ్యతే.**

ఎవరైతే దేనినీ ద్వేషించరో, దేనినీ కూడా కోరుకోరో వారే నిజమైన సన్యాసి. అలాంటి వారే నిత్య సన్యాసి. కొంతమంది, రూపానికి సన్యాసి వేషం వేస్తారు కానీ క్రోధాన్ని కానీ, అహంకారాన్ని కానీ విడిచిపెట్టరు. అలాంటి వారు బాహ్య సన్యాసులు మాత్రమే అని భగవంతుడు చెప్తున్నారు.

**బ్రహ్మజ్ఞానం తెలిసినవాడే - బ్రాహ్మణుడు గాని,**
**జంధ్యం ఉన్నంత మాత్రాన - బ్రాహ్మణుడు కాలేడు.**
**విష్ణు మహిమ నెరిగినవాడే - వైష్ణవుడు గాని,**
**నామములు పెట్టినంత మాత్రాన - వైష్ణవుడు కాలేడు.**
**ఈశ్వర మహిమ తెలిసినవాడే - శివభక్తుడు గాని,**
**బూడిద పూసుకున్నంత మాత్రాన - శివభక్తుడు కాలేడు.**
**ఆశ విడిచినవాడే - సన్యాసి గాని,**
**కాషాయం కట్టినంత మాత్రాన - సన్యాసి కాలేడు.**

**-నరసింహ శతకం**



కొంతమంది తాము అన్నింటినీ జయించేశామని గొప్పలు చెబుతూ, ఉపన్యాసాలు ఇస్తూ తిరిగుతుంటారు. కానీ భగవంతుడు, ముందు అధ్యాయాలలో కామ, క్రోధాల్ని జయించడం చాలా కష్టం, అయినా ఏకాగ్రతతో, దృఢమైన మనస్సుతో నన్ను సేవిస్తే వాటిని జయించడం సాధ్యమవుతుందని చెబుతారు. నిజంగా వాటిని జయించినవారు తాము జయించేశామని నోటితో చెప్పుకోరు. నిండు కుండ తొణకదు కదా! కనుక అలాంటివారు వినయంతో తమ జీవితాన్ని ప్రశాంతంగా గడుపుతారు. ఇక వేషధారి సన్యాసులు అయితే అందరినీ ఆకర్షించడానికి ఉపన్యాసాలు చెబుతూ తమ పబ్బం గడుపుకుంటారు. తీరా ఆచరణలోనికి వచ్చే సరికి చెప్పడానికే నీతులు గాని చేయడానికి కాదనన‌ట్లు వారి ప్రవర్తన ఉంటుంది.

సాధువు వేషం వేసిన ఒక వ్యక్తి ఊరూరా తిరిగి ఉపన్యాసాలు ఇస్తూ తాను కామ, క్రోధాలను జయించేశానని ఢంబాలు పలుకుతున్నాడట. ఒక ఊరిలో ఈ సాధువు గారు ఉపన్యాసం చెబుతుంటే ఒక కుర్రవాడు స్వామీ! మీరు నాకు ఒక విషయం చెప్పాలన్నాడట. దానికి సాధువు అలాగే నాయనా! అదేమిటో అడుగు చెపుతాను అన్నాడట. మరలా ఆ కుర్రవాడు స్వామి మీరు నాకు ఒక విషయం చెప్పాలన్నాడట. సాధువు శాంతిగా అలాగే నాయనా! అదేమిటో అడుగు చెబుతాను అన్నాడట. మరలా ఆ కుర్రవాడు అదే విషయాన్ని అడిగాడట. సాధువు అలాగే లేరా! అసలు విషయం ఏమిటో చెప్పు అన్నాడట. మళ్ళీ ఆ కుర్రవాడు స్వామీ అని అదే విషయాన్ని అడిగాడట. దానికి సాధువు ఒరేయ్ ఇందాకటి నుండి చూస్తున్నాను అసలు విషయం చెప్పకుండా చంపుకు తినేస్తున్నావు నాకు గానీ తిక్కరేగిందంటే నిన్ను ముక్క ముక్కలుగా నరికేస్తానని అన్నాడుట. అప్పుడు ఆ కుర్రవాడు ఇంతకు ముందే కదా స్వామీ మీరు క్రోధాన్ని జయించేశానని ఉపన్యాసం చెప్పారు. తీరా నేను నాలుగుసార్లు ఒకే విషయం అడిగేసరికి సహనం చచ్చిపోయి నన్ను ముక్కలు, ముక్కలుగా నరికేస్తానన్నారు. ఇక మీరేం జయించారు. ముందు మీలో ఉండే ఈ అహంకారాన్ని, కోపాన్ని ముక్క ముక్కలుగా నరుక్కుని అప్పుడు అందరికీ హితబోధలు చేయండి అని వెళ్ళిపోయాడట. కనుక స్థూలమైన రూప సన్యాసం కాకుండా మనస్సుతో ఎవరైతే సన్యసించి శరీరంతో కర్మ చేస్తారో వారు నిజంగా కర్మయోగులే అని భగవంతుడు చెబుతున్నాడు.

### 6వ శ్లోకం

**సన్న్యాసస్తు మహాబాహూ దుఃఖ మాప్తుమయోగతః**
**యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి.**

జ్ఞానయోగం కూడా కర్మయోగం లేకుండా సాధ్యం కాదు. రెండూ కలిస్తేనే భగవంతుని పొందడం సులభం. నిజంగా ఎంతో మంచి విషయం. జ్ఞానం అంటే తెలివి అని తెలుసుకున్నాము. దానిని ఆచరణలోనికి తీసుకు రావడమే విజ్ఞానం. అంటే అది కర్మ వలననే సాధ్యం అవుతుంది. తెలివి ఆధారంగా చేసిన కర్మ శ్రేష్ఠంగా అవుతుంది. అలాగే ఎంత తెలివిగల మనస్సు ఉన్నవారైనా దానిని కర్మలోకి తీసుకురాకపోతే ఫలితం పొందలేరు.

### 10వ శ్లోకం

**బ్రహ్మణ్యాధాయ కర్మాణి సజ్గం త్యక్త్వా కరోతి యః**
**లిప్యతే న స పా పేన పద్మపత్రమివామ్భసా**

ఎవరైతే తాము చేసే పనుల ఫలితాన్ని భగవంతునికి అర్పణ చేసి కోరికలు లేకుండా ఉంటారో వారు తామరాకును నీటి బిందువులు అంటని విధంగా ఉంటారని, వారికి పాపం అంటదని, నిజంగా కర్మ సన్యాసం శుద్ధ దండగని, కర్మఫలం ఈశ్వరార్పణంగా చేసి కర్మ చేయడమే శ్రేష్ఠమని ఎంతగానో భగవంతుడు చెబుతున్నారు. కొందరు ఈ సంసారం - సముద్రంలో కాకిరెట్ట సుఖంలాంటిదని భావించి భార్యా, పిల్లల్ని విడిచి అడవులకి వెళ్ళిపోయి, తపస్సు పేరుతో కాలం గడుపుతారు. కొన్నాళ్ళు గడిచాక నేను ఇల్లు విడిచిపెట్టి పదేళ్ళు అయిపోయింది. ఇప్పటికి నా కూతురు పెళ్ళీడుకొచ్చి వుంటుంది. నా భార్య పెళ్లి చేసిందో లేదో ఇలా ఆలోచిస్తూ ఉంటారు. అంటే శరీరాన్ని ప్రపంచానికి దూరంగా తీసుకుపోయి బుద్ధి, మనస్సు మాత్రం కుటుంబంలో ఉంచుతున్నా రన్నమాట. అలాంటి వారు భగవంతుని చింతనలో ఉంటూ, ఈ కుటుంబ వ్యవహారాల పట్ల మక్కువ లేక, సన్యాసులుగా మారిపోతే చాలా మంచి విషయం, కానీ పెళ్ళి చేసుకుని శారీరక సుఖాలు అనుభవించి, పిల్లలను కని తీరా కష్టాలు రాగానే వైరాగ్యం పేరుతో పారిపోయేవారు నిజంగా పాపులే. ఎందుకంటే తనని నమ్ముకున్నవారిని, వారి కర్మఫలానికి వదిలి వెళ్ళిపోవడం కూడా నేరమే. అందుకే భగవంతుడు అలా పారిపోకండి, కుటుంబంలోనే ఉండండి కానీ కుటుంబ బంధనలో ఉండకండి. బురదలోనే తామరపువ్వు





ఉంటుంది. దాని మూలం బురదలో వున్నా కానీ ఈ పువ్వుకు బురద అంటదు, అలాగే సంసారమనే బురదలో వున్నా ఆ బురద మీకు అంటకుండా తామరపువ్వులా ఉండండని చెబుతారు. అందుకే దేవతలకి తామరపువ్వు మీద కూర్చున్నట్లు బొమ్మలు తయారుచేస్తారు. వారు సంసారంలో ఉంటూనే పవిత్రంగా ఉన్నారని గుర్తుగా అలా బొమ్మలు గీసారు. నిజానికి ఈ ప్రపంచాన్ని ఏ సన్యాసి పరిపాలించలేదు. సరిగ్గా సద్వినియోగం చేసుకుంటే గృహస్థాశ్రమం చాలా ఉత్తమమైనది. కోరికలు లేకుండా శరీరంతో ఎన్ని కర్మలు చేసినా మనస్సుతో ఆ మనిషి కర్మలు చేయనట్లే అని భగవంతుడు చెబుతున్నారు.

### 15వ శ్లోకం

**నా దత్తే కస్య చిత్పాపం న చైవ సుకృతం విభుః**
**అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః**

భగవంతుడు ఎవరి యొక్క పాపాన్ని గాని, పుణ్యాన్ని గాని స్వీకరించడు. మనిషి తెలివితక్కువతనం వలన భగవంతునికి సంబంధాలు అంటగడు తున్నాడు.

కొందరు తమకి ఏదైనా కష్టం వస్తే భగవంతుడు తమకి ఎంతో అన్యాయం చేశాడని బాధపడతారు. మరికొందరు తమకి ఏదైనా మంచి జరిగితే భగవంతుడు తమకి మేలు చేసాడని ఆనందపడతారు. నిజానికి రెండు భావనలు తప్పేనని భగవంతుడు స్వయంగా చెబుతున్నారు. ఎందుకంటే భగవంతుడు మనందరి కర్మలకి సాక్షి మాత్రమే. మన పాప పుణ్యాలతో భగవంతునికి ఏమీ సంబంధం లేదు. మనం చేసే పాప పుణ్యాలను భగవంతుడు చూస్తుం టారు. మనం గత జన్మలోను, ఈ జన్మలోను చేసుకున్న పాపం, పుణ్యం యొక్క ఫలం అనుభవిస్తూంటాము. మనం దుఃఖం పొందినా, ఆనందం పొందినా మన స్వయంకృతమే గాని భగవంతునికి ఏమి సంబంధం లేదు. మరి ఇంత దానికి భగవంతుడు ఎందుకు అన్న ప్రశ్న మనకి రావచ్చును. గతంలో మనం చెప్పుకున్నాము. సూర్యునికి ఎదురుగా వేసిన తడిబట్ట ఆరిపోయి తిరిగి మనకే ఉపయోగపడుతుందని అదేవిధంగా సుగంధం వెదజల్లే అగరుబత్తి వెలిగిస్తే దాని వాసనని మనమే పొందుతాము. కాబట్టి పరమ పవిత్రుడైన భగవంతుని సదా స్మృతి చేస్తుంటే మనం తప్పులు చేయడానికి సాహసించము. దాని ఫలంగా మంచి పనులు చేయటం వలన తిరిగి మనకే పుణ్యం వస్తుంది. శాంతి, సుఖం కలుగుతాయి.

### 18వ శ్లోకం

**విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని**
**శుని చైవ శ్వపాకే చ పణ్డితాః సమదర్శినః**

చదువు సంధ్యలు కలిగిన బ్రాహ్మణుని (బ్రహ్మజ్ఞానం తెలిసినవాడు) యందును, ఆవు, ఏనుగు, కుక్క మొదలైన అన్ని జంతువుల యందు అలాగే కుక్క మాంసం వండుకు తినేవాడియందు ఒకే లాంటి భావన ఎవరికైతే ఉంటుందో వాడే పండితుడని భగవంతుడు చెబుతున్నారు. స్థూలమైన పాండిత్యం, భాషా ప్రయోగాలు కాదు, సమదృష్టి మాత్రమే పాండిత్యానికి కొలబద్ద అని భగవంతుడు పదే పదే చెబుతున్నారు.

ఈ దృష్టి కూడా 3 రకాలుగా ఉంటుంది.

1. బాహ్య దృష్టి – ఇది కళ్ళకి కనపడేది. ఉదాహరణకి మనం పెళ్ళి చూపులలో చాలా ఎక్కువగా రూపానికే ప్రాధాన్యం ఇచ్చి, వధూవరులను నిర్ణయం చేస్తాము. అలాగే కంటికి అందంగా కనపడే వస్తువులనే ఇష్టపడతాం. ఇలాంటివన్నీ బాహ్యమైనవి.
2. మనస్సుతో మనస్సుని చూడటం – వీరు ఎదుటివ్యక్తి లేదా వస్తువు యొక్క రూపానికంటే గుణానికి, వారిలో ఉండే ప్రజ్ఞాపాటవాలకి విలువ ఇస్తారు.
3. ఎదుటి జీవిలో స్థూలమైన రూపాన్ని గానీ, సూక్ష్మమైన మనస్సుని గానీ చూడక ఏకంగా ఆత్మ స్వరూపాన్నే చూస్తారు. వారికి బాహ్యం – అంతరం అని కాక సరాసరి జ్యోతిస్వరూపమైన ఆత్మిక భావనే ఉంటుందని చెప్పారు. మొదటివారు అధములని, రెండవవారు మధ్యములని, మూడవవారు ఉత్తములని, అలాంటి వారు చాలా తక్కువని గీత బోధిస్తుంది – మనందరం ఒకటి నుండి రెండుకి, రెండు నుండి మూడుకి మన ప్రయాణం సాగించాలి, అంటే అలా తయారయ్యే ప్రయత్నం చేయాలి.

### 28వ శ్లోకం

**యతేన్ద్రియమనో బుద్ధిర్మునిర్మోక్షపరాయణః**
**విగతేచ్ఛాభయక్రోధోయస్సదాముక్త ఏవ సః**

ఎవరైతే ప్రకృతి సంబంధమైన విషయములను మనస్సు నుండి తొలగించి దృష్టిని కనుబొమ్మల మధ్య ఆత్మ స్థానంలో నిలిపి మనస్సుని, బుద్ధిని ఏకాగ్రం చేసి కోరికలను, భయమును, కోపాన్ని విడిచి పరమాత్మ చింతనలో ఉంటారో వారే ముక్తులు, ముక్తి అంటే మరలా జన్మ లేకుండా ఉండటం కాదని భగవంతుడు చెబుతున్నాడు. ఎవరైతే శరీరంలో ఉంటూనే దానికి అతీతమైన ఆత్మగా అనుభవం చేసుకుంటూ పరమాత్మని యోగం ద్వారా పొందుతారో వారు ముక్తిని పొందినట్లే.

### 29వ శ్లోకం

**భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్**
**సుహృదం సర్వ భూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి.**

ఎవరు ఏ విధంగా కర్మలు చేసినా, తపస్సులు చేసినా వాటి యొక్క ఫలం భగవంతునికే చేరుతుంది. ఆ భగవంతుడే సర్వలోకాలకు ప్రభువు. సమస్త ప్రాణుల మంచి కోరేవాడు, మనిషికి శాంతినిచ్చేవాడు ఈశ్వరుడు ఒక్కరే. ఇంకెవ్వరు నిజమైన శాంతి ఇవ్వలేరు.



## 6వ, అధ్యాయం – ఆత్మ సంయమయోగము

### 1వ శ్లోకం

**అనాశ్రితః కర్మ ఫలం కార్యం కర్మ కరోతి యః**
**స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చా క్రియః**

ఎవరైతే కర్మలను ప్రతిఫలం ఆశించకుండా చేస్తారో వారే సన్యాసి కానీ జందెము వదిలినంత మాత్రాన, పనిపాటలు మానేసి దేశదిమ్మరిగా తిరిగినంత మాత్రాన సన్యాసి గాని, యోగి గాని కాలేరు. దీనిని బట్టి శారీరక కష్టం చేయకుండా సోమరిగా తిరిగే పనిదొంగలు, కొంగ జపంలాగ భగవంతుని జపం చేసే దొంగ సన్యాసులు ఎవరూ నిజంగా సన్యాసులు కాదని, ఎక్కడ ఉన్నా అంటే గృహస్థునిగా ఉన్నా లేక వానప్రస్థంలో ఉన్నా ప్రతిఫలం ఆశించక ఈశ్వరార్పణంగా కర్మ చేసేవాడే సన్యాసి మరియు యోగి అవుతాడు.

### 5వ శ్లోకం

**ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మా నమవసాదయేత్**
**ఆత్మైవ హ్యాత్మనో బన్ధురాత్మైవ రిపురాత్మనః**

మానవుడు తనని తానే ఉద్ధరించుకోవాలి, తనలోని మనస్సుని, బుద్ధిని జయిస్తే తనకి తానే బంధువు, మిత్రుడు అవుతాడు లేకపోతే తనకి తానే శత్రువు అవుతాడు.

మనకి ఎంతమంది ఏ విధంగా మార్గాలు చూపించినా, చివరికి భగవంతుడే స్వయంగా మార్గం చూపించినా ఆ మార్గాల ద్వారా మనకు మనం ఉన్నతికి చేరుకోవాలి. ఎవరైనా వారి ఆకలి తీరాలంటే వారు స్వయంగా తినాలి. ఇతరులు తింటే ఆకలి తీరదు. ఏదైనా అందమైన దృశ్యాన్ని మన కళ్ళతో మనమే చూస్తే అది మనస్సుకి ఆనందం ఇస్తుంది. కానీ ఎవరో చెబితే విన్నంతనే ఆనందం రాదు. మన ఉన్నతికి ఎందరో ఎన్నో మార్గాలు చూపించారు కానీ వాటన్నింటికన్నా సత్యమైనది దగ్గరైనది, తేలికగా గమ్యాన్ని చేర్చేది– స్వయంగా భగవంతుడు చూపించిన దారి. దానిలో మనందరం ఎవరికి వారే ముందుకి వెళ్ళిపోవాలి. లౌకికంలో ఒక వ్యక్తి సంపాదిస్తే ఇంటిల్లపాది తినవచ్చు కానీ ఆత్మ ఉన్నతిమాత్రం ఎవరు ఎంత సంపాదించుకుంటారో అంతే పొందుతారు. ఇదే లౌకిక సంపాదనకి, అలౌకిక సంపాదనకి (ఆత్మ జ్ఞానం) తేడా.

## 9వ శ్లోకం

**సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబన్ధుషు**
**సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే.**

కొంతమంది ప్రతిఫలం కోరుకోకుండానే మనకి సాయం చేస్తారు. మరికొందరు మన నుండి ఏదో ఆశించి సాయం చేస్తారు. మనకి శత్రువులుంటారు. ఎటూ చెప్పలేనివారు (మంచి చెడు తెలిసీ చెప్పలేని భీష్ముడు, ద్రోణుడు లాంటివారు) మధ్యవర్తులు, బంధువులు, పాపాత్ములు వారి చెడు పనులలో ద్వేషించదగినవారు. ఇలా అనేకులు మనకి ఎదురుపడతారు. అలా వారు ఎలా ఉన్నా, ఎవరైతే అందరి పట్ల సమభావన కలిగివుంటారో వారే అందరికంటే శ్రేష్ఠమైనవారు అని భగవంతుడు తెలియచేస్తున్నారు. నిజంగా అలా వుంటే మనిషి సాక్షాత్తు భగవంతుని సమానంగా తయారైపోతాడు. మనందరం మనలో ఎంత వరకు ఆ శక్తులు ఉన్నాయి అనేది చూసుకోవాలి. మన బంధువులని, విరోధులను ఒకేలా చూస్తున్నామా? మంచివారిని – చెడ్డవారిని ఒకే తక్కెడలో తూస్తున్నామా లేదా? ఇలా మనల్ని మనం ప్రశ్నించుకుంటూ సమభావన వైపు అడుగు వేయాలి. నిజానికి మనకి ఎవరైనా అపకారం చేసినా, నింద చేసినా ఆ ఆత్మ అజ్ఞానంలో తెలియక నిన్ను నింద చేస్తుంది. కనుక ఆ ఆత్మని దోషిగా చూడకూడదు. నీ పూర్వజన్మ కర్మఫలం ఆధారంగా పేరు, గౌరవం, అవమానం, సుఖం, దుఃఖం ఇలా కలుగుతున్నాయి. అవి ఏదో రూపంలో రావాలి కనుక స్నేహితులుగానో, చుట్టాలు గానో, విరోధులుగానో రకరకాల పాత్రధారుల రూపంలో వచ్చి నీ కర్మలఖాతాని పూర్తి చేస్తున్నాయి. కనుక వాటి యొక్క రహస్యం తెలుసుకుని వారందరినీ సమానంగా చూడగలగాలి. అందం, అధికారం, పాండిత్యం ఇవి ఉన్నంత మాత్రాన ఆ వ్యక్తి గొప్పవాడవుతాడు అని భగవంతుడు చెప్పడం లేదు. ఎవరైతే సర్వుల పట్ల సమమైన మనస్సుతో ఉంటారో వారే గొప్పవారని చెబుతున్నాడు.




## 10వ శ్లోకం

**యోగీ యుఞ్జీత సతతమాత్మానం రహసి స్థితః**
**ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః**

భగవంతుని కలుసుకోవాలని కోరుకునేవారు, ఏకాంత ప్రదేశంలో అయినా, ఒంటరిగా మనస్సుని ఏకాగ్రం చేసి, బుద్ధిని అదుపులో ఉంచి, ఎవ్వరి నుండీ ఏమీ ఆశించకుండా, ఎప్పుడూ మనస్సుని పరమాత్మునియందే నిలపాలి. ఈ రోజుల్లో ఎక్కడ చూసినా జనసంచారమే, మనిషికి ఏకాంత ప్రదేశం అంటూ ఎక్కడా దొరకడం లేదు. ధ్వని కాలుష్యం మనిషిని వదిలిపెట్టడం లేదు. అందువలన మనం నివాసం ఉండే స్థానంలోనే మూడు అడుగుల నేల భగవంతునికి కేటాయించి, ఆ స్థలంలో భగవంతుని ఫోటో పెట్టుకుని మనస్సుని ఏకాగ్రం చేసి భగవంతుని ధ్యానం చేయాలి. అదే విధంగా మనం భగవంతుని నుండి పొందిన పుణ్య ఫలంగా మనకి సాటి మానవుల నుండి పేరు, గౌరవం తప్పక వస్తాయి కానీ వాటిని పొరపాటున కూడా తాకకూడదు. అంటే మన మనస్సులో కూడా నాకు పేరు, గౌరవం కానుకలుగా రావాలని కోరుకోకూడదు. భగవంతుని మాటలు ఎవరైతే మాట్లాడుతారో వారినే భగవత్ జనులని అంటారు. అలాంటి వారితో కలసి ధ్యానం చేసినా దానిలో లౌకిక విషయాలు లేని కారణంగా అది కూడా ఏకాంతమే అవుతుంది. అలాకాక లౌకిక విషయాలు కలిస్తే అలాంటి ధ్యానం ఫలితం ఇవ్వకపోగా అశాంతిని కలుగచేస్తుంది. మనం ప్రత్యేకంగా ఈ పద్ధతిలో కూర్చుని లేక నుంచుని భగవంతుని ధ్యానం చేయాలని కొంతమంది చెబుతున్నా అన్నింటి కంటే ముఖ్యమైనది మనస్సుని ఏకాగ్రం చేయటం. అంతేకాకుండా ఎంత నిటారుగా కూర్చున్నా, ఎన్ని పద్ధతులు పాటించినా అది హఠమే అవుతుంది. గానీ యోగానికి దారి తీయదు. శరీర ఆరోగ్యం సరిగాలేనివారు, కాళ్ళు చేతులు లేనివారు, అశక్తులు శరీరాన్ని తమ ఇష్టం వచ్చినట్లు నిలపలేరు. కనుక అన్నింటికంటే ముఖ్యమైనది – భగవంతునిపై విశ్వాసం. ఏకాగ్రత, ఎందుకంటే

నియమనిష్ఠలతో చేసే వ్రతం కంటే నమ్మకంతో, విశ్వాసంతో చేసే అమాయక మైన పని అయినా మంచి ఫలితాన్ని ఇస్తుంది.

ఓ గ్రామంలో ఓ సాధువు తన శిష్య బృందంతో భగవంతుని గురించి ఉపన్యాసం చెప్పడానికి వెళ్ళాడు. ఆయన ఉపన్యాసం సాగుతోంది. ఈ విషయం ఊరి చివరన మేకలు కాసుకుంటున్న ఓ ముసలి అవ్వకి తెలిసింది. ఆమెకి ఈ సాధువుని కలుసుకుని మంత్రం ఉపదేశం పొందాలని ఎప్పటినుండో కోరిక. ఆమె ఆదరాబాదరాగా మేకల్ని తోలుకుని ఇంటికి వచ్చి స్నానం చేసి గబగబా సాధువు ఉపన్యాసం చెప్పే చోటుకి బయలుదేరింది. అప్పటికే ఆ సాధువు తన ఉపన్యాసం ముగించుకుని వేరేపనిమీద తొందరగా వెళ్ళిపోవు చున్నాడు. అప్పుడు ఆ అవ్వ సాధువుకి ఎదురెళ్లి దండం పెట్టి తనకి మంత్రోపదేశం చేయమని అడిగింది. ఆ సాధువు వేరే పనితో వెళ్తున్న హడావుడిలో ఈ అవ్వ అడిగిన విషయం వినపడక వారికి అడ్డంగా ఉందన్న భావనతో తప్పుకో – తప్పుకో అంటూ వెళ్లిపోయాడు. పాపం ఆ ముసలి అవ్వ సాధువుగారు తనకి 'తప్పుకో – తప్పుకో' అని మంత్రోపదేశం చేసారని నమ్మకంతో ప్రతి క్షణం కూడా తప్పుకో – తప్పుకో అంటూ జీవితం గడుపుతోంది. కొన్ని రోజులకి అదే సాధువుగారు మరలా తిరిగి అదే ఊరికి వచ్చారు. కొంతసేపు ఉపన్యాసం చెప్పి తిరిగి ప్రక్క ఊరికి వెళదామని బయలుదేరే సరికి రెండు ఊరులకి మధ్యన ఉన్న వాగు హఠాత్తుగా పొంగి ప్రవహించడం మొదలుపెట్టింది. అవతలి వైపు వెళ్లడానికి పడవవారు ఎవరూ వీలుపడదని చెప్పారు. అప్పుడు సాధువు అయ్యో! ఇప్పుడెలా వెంటనే అవతలకి వెళ్ళకపోతే ఆ ఊరి జమీందారుగారు కోప్పడతారు అని కంగారుపడుతున్నాడు. ఊరిలో ఒక వ్యక్తి స్వామీ! ఈ మధ్య మా ఊరిలో ఉన్న ముసలి అవ్వ ఏమి మాట్లాడితే అలా జరుగుతుంది ఎప్పుడూ తప్పుకో – తప్పుకో అంటూ తిరుగుతుంది. ఆవిడ మీకేమైన సహాయం చేయగలదేమో చూద్దామని అన్నాడు. సాధువు తన శిష్యులతో కలసి మేకలు మేపుకుంటున్న అవ్వ దగ్గరకు వెళ్ళి విషయం చెప్పాడు. అప్పుడు అవ్వ అదేంటి స్వామి – నాకు మంత్రోపదేశం చేసిన మీకే వాగు అడ్డం వస్తుందా దాని సంగతి చూద్దాం పదండని బయలుదేరింది. సాధువు అయోమయంగా నేను ఈమెకి మంత్రోపదేశం ఎప్పుడు చేశానని శిష్యులని అడిగాడు. ఒక శిష్యుడు స్వామి నాకు గుర్తుకు వచ్చింది. క్రితంసారి మనం ఈ ఊరు వచ్చినప్పుడు ఈ అవ్వ తమరిని మంత్రోపదేశం చేయమంది. మీరు తొందరలో ఉండి వినిపించుకోక తప్పుకో





– తప్పుకో అన్నారు. ఆ మాటలే ఈమె మంత్రంగా భావించి నడుస్తుందని చెప్పాడు. అందరూ ఏటిగట్టుకు వెళ్ళారు. అప్పుడు అవ్వ నా స్వామి దాటటానికి వీలు లేకుండా అడ్డం పడతావా? తప్పుకో – తప్పుకో అందట. అంతే! ఆ వాగు ప్రవాహం ఆగిపోయి దారి ఇచ్చిందని కథ వ్రాసారు. నిజానికి అక్కడ ముసలి అవ్వ నమ్మకానికి, అమాయకత్వానికి ప్రతీక. అలా ఎవరు ఎలా ఆసనం తయారు చేసుకున్నా విశ్వాసం, ఏకాగ్రత ముఖ్యం దాని ఆధారంగా ఫలం పొందుతారు.

## 17వ శ్లోకం

**నాత్యశ్నతస్తు యోగో స్తి న చైకాస్తమనశ్న తః**
**న చాతిస్వప్నశీలస్య జాగ్రతో వైవ చార్జు.**

తక్కువ ఆహారం తీసుకోవటం, మంచి ప్రవర్తన కలిగి ఉండటం, ఎంత వరకూ అవసరమో అంత వరకే కర్మ చేయడం, మితంగా అంటే తక్కువగా సరిపడులాగ నిద్రపోవడం, అలాగే ఎంత వరకు అవసరమో అంతవరకే మెలకువగా ఉండటం ఇలాంటి వారికి యోగం బాగా కుదిరి సంసార దుఃఖాన్ని పోగొడుతుంది.

ఎక్కువ ఆహారం తీసుకుంటే మత్తు కలిగి బద్ధకం, నిద్ర ముంచుకు వస్తాయి. కనుక శరీరానికి అవసరమైనంత ఆహారం మాత్రమే తీసుకోవాలి అలా అని ఉపవాసాల పేరుతో శరీరాన్ని హింస పెట్టడం రాక్షస లక్షణమని స్వయం భగవంతుడే చెబుతున్నారు. సరిపడా ఆహారం తీసుకుంటే శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. అప్పుడు మనస్సు ఉల్లాసంగా ఉండి యోగం బాగా కుదురుతుంది. అలాగే మన నడవడిక గమ్యం లేని గాలిపటంలా కాక ఒక పద్ధతిలో ఉంటే మనకి దాని వలన భగవంతుని మార్గం దగ్గర అవుతుంది. ఏదైనా పరిమితి దాటితే వెగటు అవుతుంది. అతి సర్వత్రా వర్జయేత్, అతి అన్నది ఎప్పుడూ, ఏ విధంగా పని చేయదు. దానిని వదిలేయాలని మన పెద్దలు చెబుతారు. తినగా తినగా గారెలైనా చేదుగా అనిపిస్తాయని అంటారు.

మనవాళ్ళు చాలామంది ఉపవాసం అంటే భోజనం మానేసి ఫలహారాలు, పళ్ళు మొదలైనవి తినడం అనుకుంటారు. నిజానికి ఉప అంటే దగ్గరగా, వాసం అంటే నివసించుట అని అర్థం. అంటే భగవంతునికి దగ్గరగా ఆయన స్మృతిలో నివసించడమే నిజమైన ఉపవాసం. అన్నం మానేస్తే ఉపవాసం అనుకోవడం పొరపాటు. లేనివాడు అన్నం తినకపోతే – పస్తు అంటారు.

ఆరోగ్యం బాగుగా లేనివాడు అన్నం మానేస్తే - లంఖణం అంటారు. ఒళ్ళు పెరిగిన వాళ్ళు అన్నం మానేస్తే - డైటింగ్ (పథ్యం) అంటారు. అంతమాత్రాన ఇవన్నీ ఉపవాసాలు కాదు కదా! శరీర ఆరోగ్యానికి వారానికి ఒక పూటో లేక 10 రోజులకి ఒక పూటో ఆహారం తీసుకోకపోవడం చాలా మంచిది. ఎందుకంటే అంతకు ముందు ఆహారంలో అరగకుండా మిగిలిపోయిన మలిన పదార్థాలు ఆ సమయంలో జీర్ణం అయిపోతాయి. ఇక జాగరణ అంటే నిద్ర లేకుండా గడపడం అని మనం ఆలోచిస్తాం. ఇదివరకు అయితే పుణ్యదినాలలో ఏదొక భజన కాలక్షేపం లేక పురాణ కాలక్షేపం పెట్టుకుని రాత్రంతా మేల్కొని ఉండేవారు. కానీ ఈ రోజుల్లో రోడ్డు మీద సినిమాలు వేయించి వాటిని చూస్తూ రాత్రంతా మేల్కొని ఉండి మరునాడు పగలు నిద్రపోయి పనిపాటలకు కూడా ఎగనామం పెట్టేస్తున్నారు. ఇలాంటి పనుల వలన భగవంతునితో యోగం కుదురుతుందా? మనమే ఆలోచించుకోవాలి. నిజానికి జాగరణ అంటే జాగృదావస్థ అంటే మన మనస్సుని ఎల్లప్పుడూ మేల్కొని ఉంచి, బుద్ధిని నిరంతరం కాపలా కాయిస్తూ మనలో చెడు గుణాలు ప్రవేశించకుండా జాగ్రత్త పడటమే జాగరణకి అర్థం. కనుక మనం అన్ని విషయాలలో మితంగా ఉంటూ భగవంతుని పొందాలి. అంతే కానీ మితం అన్నారు కదా అని భగవంతుని కార్యంలో మితం పనిచేయదు. మన శక్తి మేరకు ఎంత ఎక్కువగా మనస్సు శరీరాన్ని ధనాన్ని పెట్టగలిగితే అంతగా భగవంతుని పొందుతాము. ధనం లేకపోయినా ఏమీ పర్వాలేదు. శరీరాన్ని, మనస్సుని ఉపయోగించండి అని భగవంతుడు చెబుతున్నారు. ఏది పెట్టినా తిరిగి ఆ ఫలం మనకే వస్తుంది. మనిషి మనస్సు ఎంతో చంచలమైనది. దానిని అదుపులో పెట్టడం చాలా కష్టం అలాగని వదిలేస్తామా? దానిని కృషి, పట్టుదలలతోను, ఈ ప్రాపంచిక విషయాల మీద వైరాగ్యంతో అదుపులో పెట్టవచ్చని భగవంతుడు చెబుతున్నారు.

మనలో చాలా మంది మంచిగా బ్రతకాలని, చెడు వ్యసనాలను వదిలివేయా లని ఎన్నో వ్రతాలు, దీక్షలు చేస్తుంటాము. కొన్ని రోజులు గడిచేసరికి పాత సంస్కారాల (అలవాట్లు) వాసన ఏదో రూపంలో మనల్ని తిరిగి తన గూటికి లాగేసే ప్రయత్నం చేస్తుంది. చాలామంది వాటికి వశం అయిపోయి తిరిగి పాత మార్గానికి వెళ్ళిపోతుంటారు. దానికి కారణం - చంచలమైన మనస్సు, దానిని ఎవరైతే బుద్ధి ద్వారా అదుపులో పెట్టి పాత అలవాట్లు, బలహీనతలను, మాయను జయిస్తారో వారే విఘ్నవినాశకులు అంటే వినాయకులుగా పిలువబడతారు. మాయ అనేది ఎలుకలాంటిది. అది





మనం నిద్రపోయినప్పుడు మనకి మెలకువ రాకుండా మన శరీరాన్ని కరుస్తుంది. అదేవిధంగా ఈ మనస్సులో బలహీనతలు మనల్ని భగవంతుని మార్గంలో వెళ్లకుండా చుట్టాల రూపంలోనో, స్నేహితుల రూపంలోనో లేక వేరే రూపంలోనో వచ్చి విఘ్నం వేసి వెనక్కి తీసుకువెళ్ళిపోతాయి. వినాయకుడి వాహనంగా ఎలుకని చూపిస్తారు దానికి నిజమైన అర్థం - జ్ఞానీ ఆత్మ ఎలుకలాంటి మాయని ఆధీనం చేసుకున్న దానికి గుర్తుగా అలా చూపించారు.

### 40వ శ్లోకం

**పార్థనైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే**
**న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి.**

భగవంతుడు పైన చెప్పిన మార్గంలో ఉన్నవారికి ఏదైనా అవాంతరాలు వచ్చి ఆ మార్గం విడిచి వెళ్లిపోయినా వారికెన్నటికీ వినాశనం లేనే లేదు. వారు ఎప్పుడూ దుర్గతిని పొందరు. మనం చివరి వరకు భగవంతుని మార్గంలో నడవగలమో, లేదో ఎందుకులే, మొదలుపెట్టి మానేయడం కంటే అసలు మొదలుపెట్టకపోవడమే మంచిది అని కొందరు భావిస్తుంటారు. పిరికితనంతో ప్రయత్నం చేయకుండా ఉండటం కంటే ధైర్యంతో ప్రయత్నం మొదలుపెట్టడం మంచిదని. ఒకవేళ ప్రయత్నం మధ్యలో ఆగిపోయినా నష్టం లేదని భగవంతుడు గ్యారంటీ ఇస్తున్నారు. కనుక మనలో ఉండే సందేహాలకి ఇక టాటా చెప్పి ధైర్యంతో భగవంతుని మార్గంలో ప్రవేశించాలి. మనలో ఎన్ని లోపాలున్నా పర్వాలేదు ముందు పరమాత్మ మార్గంలో ప్రయాణానికి బయలుదేరితే చాలు. అదే గమ్యం చేరుస్తుంది.

### 47వ శ్లోకం

**యోగినామపి సర్వేషాం మద్గతేనా స్తరాత్మనా**
**శ్రద్ధవాన్ భజతే యో మాం స మే యుక్తత మో మతః**

యోగులందరిలో ఎవరు నాయందు మనస్సు నిలిపి శ్రద్ధతో నన్ను ధ్యానిస్తారో వారే సర్వ శ్రేష్ఠమైనవారు, అంతకుముందు చెప్పుకున్నాము కదా- మనం ఎలా ప్రార్థన చేసినా, ముఖ్యం మనస్సు అని, అలాంటి మనస్సు సత్యమైనదైతే దానికి భగవంతుడు రాజీ పడతాడు. ఎవరైతే పరిభ్రమించని మనస్సుతో అంటే అటు ఇటూ చంచలం లేని మనస్సుతో ఏకాగ్రంగా భగవంతుని కొలుస్తారో వారే ఈ సృష్టిలో అందరికంటే శ్రేష్ఠమైనవారు అని భగవంతుడు చెబుతున్నారు.

## 7వ అధ్యాయం - విజ్ఞానయోగం

జ్ఞానం అంటే తెలివి అని మనం తెలుసుకున్నాము. అలాగే విజ్ఞానం అంటే ఆ తెలివిని ప్రాక్టికల్‌లోకి (అనుభవంలోకి) తీసుకురావటం. ఎలాగంటే భగవంతుడు ఎవరో, ఎలా ఉంటారో తెలుసుకున్నాము. ఇది జ్ఞానం. మరి యోగం ద్వారా భగవంతుని కలుసుకుంటే అది అనుభవంలోకి తీసుకురావడం దీనినే విజ్ఞానం అంటారు. అలాగే లౌకికంలో కూడా ఏదైనా వస్తువుని లేదా యంత్రాన్ని తయారు చేసే పద్ధతిని జ్ఞానం అంటారు. దానికి రూపం తయారుచేసి ఉపయోగపరచటం విజ్ఞానం.

### 3వ శ్లోకం

**మనుష్యాణా సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే**
**యతతామసి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః**

వేలమందిలో ఏ ఒక్కడో నా కోసం ప్రయత్నం చేస్తున్నాడు. అలా ప్రయత్నం చేసిన ఎంతోమందిలో ఒకానొక్కడు మాత్రమే నన్ను యథార్థంగా తెలుసుకోగలుగుతున్నాడని భగవంతుడు చెబుతున్నారు. ఇది ఎంతో గొప్ప విషయం. ప్రపంచంలో ఎన్నో చెట్లు పూలు పూస్తున్నాయి. వాటిలో కొన్నింటిని మాత్రమే పూజకి ఉపయోగిస్తాము. అలా జల్లినపూలలో కూడా ఏ ఒకానొకటో ఆ రూపం మీద పడుతుంది. మిగిలినవన్నీ తిరిగి నేలమీదే పడిపోతాయి. అదేవిధంగా ఎన్నోకోట్ల జనాభా ఉన్నా ఈ భూమి మీద యథార్థంగా భగవంతుని కోసం ప్రయత్నించేవారు కొద్దిమంది మాత్రమే ఉంటారు. వారిలో కూడా చాలా కొద్దిమంది మాత్రమే యథార్థంగా భగవంతుని కలుసుకోగలుగుతారు. అసలు ప్రయత్నం చేయని వారి కంటే ప్రయత్నం చేసేవారు ఎంతో కొంత గొప్పవారే కదా! ఆటల్లో ఆడేవారు మొదటివాడైనా, చివరివాడైనా చూసేవారి కంటే గొప్పవాడే కదా! అలా మనందరం ఎవరికి వారు భగవంతుని కోసం ప్రయత్నం చేయాలి. గమ్యం అనేది చేరడం. చేరకపోవడం మనకి సంబంధం లేదు మన కృషిలో లోపం లేకుండా. కోరికలు లేకుండా భగవంతుని మార్గంలో ప్రయాణం చేయడమే మన ధర్మం.

### 7వ శ్లోకం

**మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.**





నాకంటే గొప్పవాడు కానీ, గొప్ప వస్తువు కానీ ఈ ప్రపంచంలో మరేది లేదు. దారంలో మణులు గ్రుచ్చబడినట్లు ఈ జగమంతా నాయందే నిక్షిప్తం అయి ఉంది. ఇక్కడ భగవంతుడు ఈ సృష్టి అంతటికీ తానే కారకుడనని తనకి మించి వేరేది, గొప్పది లేదని, ఈ జగత్తులో కనిపించే ప్రతి గ్రహం, జీవి నా ఆధారంగానే నడుస్తున్నాయని అందుకే ఈ జగమంతా దారంతో గ్రుచ్చబడిన మణులలాంటిదని అంటే ఆధారం అయిన దారం తానేనని స్పష్టంగా చెబుతున్నాడు. కొంతమంది దీనికి భగవంతుడు సర్వవ్యాపి అని ఎక్కడ పడితే అక్కడ ఉన్నాడని నమ్ముతారు. నిజానికి భగవంతుడు సర్వశక్తివంతుడే గాని సర్వవ్యాపి కాదు. ఒక దేశం ప్రెసిడెంట్ ఆజ్ఞ మీదే నడుస్తుందంటే దానికి అర్థం ఆ ప్రెసిడెంట్ ఆ దేశం అంతటా ఉన్నాడని కాదు కదా! ఎక్కడో ముఖ్యస్థానంలో ఉండి తన ఆజ్ఞానుసారం ఆ దేశాన్ని నడిపిస్తాడని అందరికీ తెలుసు. అదేవిధంగా భగవంతుడు పరంధామంలో ఉండి ఈ సృష్టిని నడిపిస్తున్నాడు. అంతేగానీ సర్వవ్యాపి కాదు.



### 8వ శ్లోకం

**రసో హమప్సు కౌన్తేయ ప్రభాస్మి శశిసూర్యయోః**
**ప్రణవః సర్వవేదేషు శబ్దః ఖే పౌరషం నృషు.**

### 9వ శ్లోకం

**పుణ్యో గన్ధః పృధివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ**
**జీవనం సర్వ భూతేషు తపశ్చాస్మి తపస్విషు.**

### 10వ శ్లోకం

**బీజం మాం సర్వ భూతానాం విద్ధి పార్థ సనాతనమ్**
**బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్మినామహమ్**

### 11వ శ్లోకం

**బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్**
**ధర్మా విరుద్ధో భూతేషు కామో స్మి భరతర్షభ.**

వీటి అర్థంలో కూడా తాను కొన్ని కొన్ని జీవులలోనే, కొన్ని కొన్ని దృశ్యాలలోనే ఉన్నానని చెబుతున్నాడు. అలా చూసినా మిగతా వాటిలో భగవంతుడు లేనట్లే కనుక ఏ విధంగా ఆలోచించినా భగవంతుడు సర్వవ్యాపి

కాదని అర్థం అవుతుంది. ఉదాహరణకి చూడండి మనలో ఎవరికి కష్టం వచ్చినా భగవంతుడా! ఏంటయ్యా నాకీ పరీక్ష నన్ను రక్షించు అని ఆకాశంవైపు చూసి ప్రార్థిస్తాము. మరి భగవంతుడు సర్వవ్యాపి అయితే ఎక్కడో ఆకాశం వైపు చూడటం ఎందుకు? ప్రక్కకి గానీ, క్రిందకి గానీ చూసి చేయచ్చు కదా! అదీ కాక భగవంతుడు సర్వవ్యాపి అయితే ప్రత్యేకంగా గుళ్ళు గోపురాలకు మనం ఎందుకు వెళ్తున్నాము? అందరిలో భగవంతుడు ఉంటే ఒకరినొకరు ఎలా తిట్టుకుంటున్నాము. చంపుకుంటున్నాము! ఇవన్నీ మనకు మనం మంచి మనస్సుతో ఆలోచించుకోవాలి. ఇవన్నీ వాదనలు చేయకుండా మంచి మనస్సుతో నిర్ణయించుకోవలసిన విషయాలు.

## 12వ శ్లోకం

**యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చయే**
**మ త్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తే మయి.**

సత్వగుణం, రజోగుణం, తమోగుణం వీటిలో ఏది కలిగిన పదార్థమైనా అది భగవంతుని సృష్టేనని స్వయంగా చెబుతూ వాటిలో మాత్రం నేను లేనని చెబుతున్నాడు. ఈ ప్రపంచంలో ఈ మూడు గుణాలకి అతీతమైన జీవి కాని పదార్థం కాని ఏదైనా ఉందా? లేదు కదా! అలాంటప్పుడు గుణాతీతమైన భగవంతుడు సర్వవ్యాపి ఎలా అవుతాడు? మంచిగా ఆలోచించండి.

## 16వ శ్లోకం

**చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినో ర్జున**
**ఆర్తో జిజ్ఞాసురర్థార్థీజానీ చ భరతర్షభ.**

ఆర్తులు అంటే కష్టాలు, ఆపదలో ఉన్నవారు, జిజ్ఞాసువులు అంటే తెలుసుకోవాలనే కోరిక కలవారు. అర్థకాములు అంటే ధనం కోసం లేదా సంపద కోసం కోరికతో భగవంతుని పూజ చేసేవారు. ఆత్మ జ్ఞానం కలవారు నన్ను పూజిస్తున్నారు.

భగవంతుని పూజించే వారిలో 4 రకాల జనులు ఉన్నారని భగవంతుడు చెబుతున్నారు. వారు ఏ భావనతో పూజ చేసినా అసలు పూజ చేయని వారికంటే మేలేనని చెబుతున్నాడు. అంటే గుడ్డి కన్నా మెల్ల మేలని, వారిలో కూడా ఎవరు ఉత్తములో తర్వాత శ్లోకాలలో చెబుతున్నాడు.





## 17వ శ్లోకం

**తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే**
**ప్రియో హి జ్ఞానినో త్యర్థమహం స చ మమ ప్రియః**

పై నలుగురిలో సదా పరమాత్మతో కలిసి ఉండేవారు అంటే ఒక భగవంతుడు తప్ప వేరెవ్వరి యందు భక్తిలేనివారే జ్ఞాని. అలాంటి జ్ఞానియే అందరిలోకి గొప్ప వాడు. పైగా జ్ఞానికి భగవంతునిపై చాలా ప్రేమ ఉంటుంది. భగవంతునికి కూడా అటువంటి జ్ఞాని అంటే చాలా ఇష్టం. అంటే మిగతావారంటే ద్వేషం అని కాదు.

టీచర్ పిల్లలందరికీ ఒకే పాఠం చెబుతాడు, కాని పిల్లలలో కృషి వలన, పట్టుదల వలన, ఎవరైతే అందరికంటే మంచి మార్కులు తెచ్చుకుంటారో వారినే టీచర్ అభిమానిస్తాడు. అదేవిధంగా భగవంతుడు కూడా. పైగా జ్ఞాని ఎప్పుడూ భగవంతుని స్మృతిని మర్చిపోడు, ఆ భగవంతుని తప్ప వేరెవ్వరినీ భక్తి చేయడు. అదే ఏకాగ్రభక్తి. కష్టంలో ఉన్నవారు తమ కష్టం తీర్చమని భగవంతుని ప్రార్థన చేస్తారు. ఆ కష్టం తీరిపోగానే మరలా ఆ పరమాత్ముని మాటే రాదు. వారి దృష్టిలో భగవంతుడు రేవు దాటించేదాక ఓడ మల్లయ్య, రేవు దాటాక బోడి మల్లయ్య అయిపోతాడు. నిజానికి భగవంతుడు వారు అడిగితే వరం ఇవ్వడం. అడగకపోతే శాపం ఇవ్వడం ఇలా ఏదీ చేయడని ముందే చెప్పారు కదా! భగవంతుడు సాక్షి.

రెండవవారు – ఏదైనా కష్టకాలం వచ్చినప్పుడు కొంత వైరాగ్యం వచ్చి తమ తోటి పెద్దల్ని ఈ కర్మ ఫలానికి కారణం ఏమిటి? ఎందుకు ఇలా జరుగుతుంది? అని ఆసక్తిగా వివరాలు అడుగుతారు. తీరా కొంచె సమయం గడిచాకా వేరే వ్యాపకంలో పడిపోయి ఈ విషయాన్ని మర్చిపోతారు. అంటే వీరు చిటికన వ్రేలు పెట్టి వస్తువుని పైకి తీయడానికి ప్రయత్నం చేసేవారన్నమాట. నిజానికి ఇలాంటివారు చిటెకన వ్రేలుతో కాక గుప్పిటతో వస్తువుని అంటే భగవంతుని పొందే ప్రయత్నం చేస్తే తొందరగా భగవంతుని పొందగలరు.

ఇక మూడవ వారు – అర్థకాములు అంటే ధనం, పేరు, గౌరవం కోసం కర్మ చేసేవారు. సాధారణంగా ప్రపంచంలో ప్రతి వ్యక్తికి ఈ కీర్తి దురద ఎక్కువగా ఉంటుంది. ఏదైనా గుడి కట్టిస్తే దానిమీద కట్టించిన దాత పేరు, రంగులు వేయిస్తే దాత పేరు ఇలా ఏ పని చేసినా పదిమందికి

చూపెట్టాలనే కోరిక, భగవంతుని కొలవాలన్నా మాకు ఇది కావాలి, అది కావాలి అనే కోరికలతోనే కొలుస్తారు. నిజానికి కోరికలు నిండిన కర్మఫలం తాత్కాలికంగా మాత్రమే లభిస్తుంది.

నాల్గవవారు – జ్ఞాని, జ్ఞాని అంటే నిష్కామకర్మ చేసేవారు, వీరంటేనే భగవంతునికి ప్రీతి అని చెబుతారు. ఎవరైతే ఏకభక్తి చేస్తారో వారు సాక్షాత్తూ జ్ఞాని. జ్ఞానానికి, ఏకాగ్రభక్తికి తేడా లేనే లేదు. రెండూ ఒక్కటే.

### 19వ శ్లోకం

**బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే**
**వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః**

జ్ఞానసంపన్నుడైన మానవుడు అనేక జన్మలు ఎత్తిన తరువాత విజ్ఞానియై నన్ను శరణు పొందుచున్నాడు. భగవంతుడు, సృష్టిలో మానవునికి మాత్రమే జ్ఞానం ఇచ్చాడు.



అలాంటి మానవుడు అనేక జన్మలు ఎత్తిన తర్వాత విజ్ఞానిగా అంటే రకరకాల వస్తువులు కనిపెట్టి తయారుచేసాడు. రైళ్ళు, విమానాలు, కరెంట్ బాంబులు ఇలా అనేకానేక వస్తువులు తయారుచేసి వాటి మూలంగా కొంత సుఖం పొంది ఇప్పుడు అనంతమైన దుఃఖాన్ని పొందుతున్నాడు. శాంతి ప్రదాత అయిన భగవంతుని శరణు పొందుతున్నాడు. అనేక జన్మల నుండి భగవంతుని కొరకు వెతికి ఆ పుణ్యఫలంగా కొందరు ఈ జన్మలో జ్ఞానం లభించి పరమాత్ముని పొందుతున్నారు.

### 20వ శ్లోకం

**కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తే న్య దేవతాః**
**తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా**

కొందరు తమ వివేకాన్ని అంటే తెలివిని కోల్పోయి తమ మనస్సు లోని కోరికలను తీర్చుకోవడానికి దేవతలను ఆరాధన చేస్తున్నారు. ఆ ఫలాన్ని పొందుతున్నారు.

### 23వ శ్లోకం

**అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్**
**దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి.**





అల్పబుద్ధి కలిగిన వారు పొందిన ఫలం తిరిగి నాశనం అయిపోతుంది. దేవతలని కొలిచేవారు దేవతలను, నన్ను కొలిచేవారు నన్నే పొందుతారని భగవంతుడు చెబుతున్నారు. ఇక్కడ ఎవరైతే కోరికలతో దేవతలని కొలుస్తారో వారు అల్పబుద్ధి కలవారని నిక్కచ్చిగా భగవంతుడు చెబుతున్నాడు. ఎందుకంటే దేవతలైనా, మానవులైనా రాక్షసులైనా ఎవరైనా పుట్టి, చనిపోయేవారే. అలాంటివారి వలన కలిగే ఫలితం కూడా వినాశీగానే ఉంటుంది. గాని శాశ్వతంగా ఉండదు. ఒక్క పరమాత్ముడే సత్యమైనవాడు. శాశ్వతుడు. అందుకే సత్యం, శివం, సుందరం అని అంటారు. సత్యమైనవాడు, సదా సుందరుడు (ఒకే రూపాన్ని జ్యోతిర్బిందు రూపాన్ని సదా కలిగి ఉన్నవాడు) శివుడు ఒక్కడే అని, దేవతలు అంటే ఎక్కడో స్వర్గంలో ఉంటారని, రాక్షసులు అంటే పాతాళంలో ఉంటారని మనం కథలలో చదివాము. కానీ భగవద్గీతలో ఈ కిరీటాలు, నగలు పెట్టుకున్నవారు. దేవతలని, కోరలు, పెద్ద పొట్ట ఉన్నవారు రాక్షసులని ఎక్కడా చెప్పడం లేదు అవి మన చిత్రకారులు ఊహించి గీసిన బొమ్మలు మాత్రమే. దైవీగుణాలు కలిగిన మానవులను దేవతలు అంటాము. రాక్షస గుణాలు అంటే ఎదుటివారిని బాధించడం, ఏడిపించడం ఇలాంటి చెడుగుణాలు కలిగిన వారిని రక్కసులంటారు. ఈ రెండుకాక సామాన్యగుణాలు కలిగిన వారిని మామూలు మనుష్యులంటారు. ఈ రోజు ప్రపంచంలో రక్కసి గుణాలు కలిగినవారే ఎక్కువగా ఉన్నారు. సాధారణ గుణములు కలిగినవారు కూడా కొద్దిగా ఉన్నారు. దైవీ గుణాలు కలిగిన వారు చాలా తక్కువగా ఉన్నారు.

దేవతలకి–తనకి గల తేడా భగవంతుడు చెబుతున్నాడు. దేవతలకి కూడా సృష్టికర్త – భగవంతుడు. దేవతలు కూడా ఆ భగవంతుని సంతానమే. నిజానికి మనలో చాలా మందికి దేవతలకి – దేవుడికి తేడా తెలియదు. దేవతలంటే ఆడవాళ్ళని, దేవుళ్ళంటే మగవాళ్ళని భావిస్తారు. అసలు మనకి మనమే ఆలోచిస్తే ఈ రహస్యం ఇప్పుడే తెలిసిపోతుంది. పాండవుల కథలో అశ్వనీ దేవతల వలన నకులుడు, సహదేవుడు పుట్టారని వ్రాసారు. మరి అశ్వనీదేవతలు మగవారే కదా! అలాగే శ్రీశ్రీశ్రీ ఫలానా అమ్మవారు అంటారు. ఆడవారికి శ్రీమతి లేక కుమారి అని వ్రాయాలి కదా! శ్రీశ్రీశ్రీ అని ఎందుకు వ్రాస్తారు! ఇక్కడ శ్రీ అంటే శ్రేష్ఠమైన అని అర్థం. వారు ఆడవారైనా, మగవారైనా శ్రేష్ఠమైన దైవ స్వరూపులు అని వ్రాయడానికి అలా వ్రాస్తారు. ఇక దేవుళ్ళు అంటూ పదిమంది ఉండరు. దేవుడు ఒక్కరే. ఎలాగైతే ఏ జాతికైనా, మతానికైనా

వెలుగునిచ్చేది ఒకే సూర్యుడో అలాగే అన్ని జీవరాశులకి సృష్టికర్త ఒక్కడే. దేవతలు మాత్రం అనేకమంది. ఆ భగవంతునే సర్వేశ్వరుడు, అల్లా, యెహోవా ఇలా అనేకానేక పేర్లతో పిలుస్తుంటారు.

### 24వ శ్లోకం

**అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మామబుద్ధయః**
**పరంభావమజానన్తో మమావ్యయమనుత్తమమ్.**

నాశనములేని – ఎంతో ఉత్తమమైన – విలక్షణమైన (ఎంతో ప్రత్యేకత కలిగిన నా రూపాన్ని (జ్యోతి స్వరూపం) తెలుసుకోని అవివేకులు నన్ను పంచతత్వా లతో కూడిన శరీరాన్ని పొందినవానిగా తలచుచున్నారు.

చాలా స్పష్టంగా భగవంతుడు ఏ దేహంలోను జన్మ తీసుకోడని తెలుసుకోని కారణంగా అవివేకులు భగవంతుడు అవతారాలు ఎత్తుతాడని దుష్ట శిక్షణ చేస్తాడని భావిస్తారు. నిజానికి ఉపనిషత్తుల సారంలో కూడా భగవంతునికి ఎముకలు, మాంసం కలిగిన శరీరం లేదని తెలుస్తుంది. అంటే ఎట్టి పరిస్థితులలోను శరీరంలో భగవంతుడు జన్మ తీసుకోడని ఖరాఖండిగా తెలుస్తుంది. ఎంతటి పురాణ పురుషులు కథలు తీసుకున్నా అందరూ తల్లి గర్భం నుండే వచ్చారు. మరియు శరీరం వదిలి తిరిగి వెళ్ళారే తప్ప శాశ్వతంగా లేరు. కనుక అలాంటి వారు ఎవరూ భగవంతుడు అయ్యే అవకాశం లేదు. ముందుగానే చెప్పుకున్నాము – ధర్మరక్షణ కోసం భగవంతుడు శరీరాన్ని ఆశ్రయిస్తాడు అని వేరే శరీరధారి శరీరంలోకి పరకాయ ప్రవేశం చేసి ఆ శరీరం ద్వారా జ్ఞానం చెప్పి ధర్మాన్ని నిలబెడతాడు.

### 26వ శ్లోకం

**వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున**
**భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన.**

అర్జునా! నేను గతంలో, వర్తమానంలో, భవిష్యత్తులో ప్రాణులందరినీ ఎరుగుదును. కానీ నన్నెవరూ తెలుసుకోలేరు. భగవంతుని యొక్క ఉనికిని నిజంగా ఎప్పుడూ, ఎవ్వరూ తెలుసుకోలేరు. స్వయంగా భగవంతుడే తన యథార్థమైన పరిచయాన్ని చెబితే తప్ప మానవులు, దేవతలు, మునులు, తపస్విలు ఎవరైనా సరే తమంత తాము తెలుసుకోలేరు. ఈ విషయం ముందు ముందు భగవంతుడే స్వయంగా చెబుతారు.



### 28వ శ్లోకం

**యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్**
**తే ద్వన్ద మోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః**

ఏ మానవుల యొక్క పాపం నశించిపోయిందో – ఎవరు అజ్ఞానం నుండి బయటపడ్డారో వారు ధృఢనిశ్చయంతో నన్ను సేవించుచున్నారు. భగవంతుని పొందడానికి ఎందరో ఎన్నో వ్రతాలు, జపతపాలు చేస్తున్నారు. అయినా వారందరికీ యథార్థమైన శాంతి, సుఖం దొరకటం లేదు. దానికి భగవంతుడు వారికి ఇవ్వడం లేదని కాదు కదా అర్థం. ఎవరి మనస్సులో పాత వాసనలు అంటే కోరికలు వదలవో అవి ఉన్న మనస్సులో భగవంతుని జ్ఞానం నిలవదు. దాని కారణంగా భగవంతునితో యోగం అంటే కలయిక జరగదు. దాని ద్వారా పొందవలసిన ఆనందం పొందలేరు. పులిపాలు బంగారు పాత్రలో మాత్రమే నిలుస్తాయి. వేరే ఏ పాత్రలోనైనా విరిగిపోతాయని పెద్దలు చెబుతారు. అలాగే మన మనస్సు కూడా బంగారు పాత్రలాగ ఉంటేనే భగవంతుని స్మృతి నిలబడుతుంది లేకపోతే నిలబడదు. కొందరికి గత జన్మలోనే సంపాదించుకున్న పుణ్యఫలం కారణంగా ఈ జన్మలో సులభంగా భగవంతుని కలయిక జరుగుతుంది. కొంతమందికి కొంచెం కష్టం అవుతుంది. అయినా ఫర్వాలేదు. నెమ్మదిగా మనస్సుని అదుపులో పెడితే భగవంతునితో కలయిక (యోగం) సులభం అవుతుంది.

## 8వ అధ్యాయము – అక్షర పరబ్రహ్మ యోగము

ఇది నాశనములేనిది, భగవంతుని గురించి వివరించేది కనుక (క్షరము లేనిది అనగా నాశనములేనిది) దీనిని అక్షర పరబ్రహ్మ యోగము అని పిలిచారు.

### 3వ శ్లోకం

**అక్షర బ్రహ్మ పరమం స్వభావో ధ్యాత్మముచ్యతే**
**భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః**

సర్వోత్తమమైనది – నాశనంలేనిది ఏదైతే ఉందో అదే బ్రహ్మము. నిజానికి సృష్టిలో అన్నీ జనించి గతించినవే. అందుకే దీనిని జగతి అన్నారు. కానీ పరబ్రహ్మ శివుడు ఒక్కడే అక్షయుడు. మిగతా అంతా వచ్చిపోయే చుట్టాలమే.

### 5వ శ్లోకం

**అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్**
**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః**

ఎవరైతే మరణకాలంలో కూడా నన్నే తలుస్తూ శరీరం విడుస్తారో వారు నన్నే పొందుతున్నారు. దీనిలో ఎటువంటి అనుమానం లేదని భగవంతుడు చెబుతున్నారు. మనం గతంలోనే చెప్పుకున్నాము. ఎవరికైతే మొదటి నుండి అభ్యాసం బాగా ఉంటుందో వారే అంతిమంలో కూడా భగవంతుని స్మరిస్తూ ప్రాణాలు విడుస్తారు అని, అలాకాక అప్పటికప్పుడు అనుకుంటే ఆదరాబాదరాగా ప్రయాణం జరుగుతుంది. చూడండి – మనం ప్రయాణానికి ముందే రిజర్వేషన్ చేయించుకుని, బట్టలు అన్ని సర్దుకుని ఉంటే ఆ ప్రయాణం సుఖంగా జరుగుతుంది. అలాకాక ఆలశ్యంగా, హడావుడిగా అప్పటికప్పుడు ప్రయాణం అయితే ఎన్నో మర్చిపోతారు. టికెట్ దొరుకుతుందో, లేదో తెలియదు రైలు వెళ్ళిపోయిందో, లేదో కూడా తెలియదు. ఈ జీవితం కూడా రైలు ప్రయాణం లాంటిదే.

మనం ముందుగానే భగవంతుని స్మృతి అనే రిజర్వేషన్ టికెట్ పొందితే నిశ్చింతగా మన జీవన యాత్ర సాగిపోతుంది. ఎప్పుడు మన సమయం వస్తే అప్పుడు రైలు దిగి వెళ్ళిపోవచ్చును. కనుక అందరం ఇప్పటి నుండే పుణ్యం అనే పెట్టేబేడా సర్దుకుని ఆఖరి ప్రయాణానికి సిద్ధంగా ఉండాలి. అప్పుడు మన ఆఖరి ప్రయాణం ఎప్పుడు వచ్చినా బెంగ ఉండదు. లేకపోతే అంతిమంలో బాబా అంటే తండ్రీ అనడానికి బదులు బాబోయ్ అని శరీరాలు వదిలి వేయవలసి వస్తుంది.



### 6వ శ్లోకం

**యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కలేబరమ్**
**తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావబావితః**

చనిపోయేటప్పుడు ఎవరు ఏ భావంలో ఉంటారో తిరిగి వారు మరుజన్మలో అలాంటి భావానికి తగిన శరీరాన్ని పొందుతారు. అంటే చనిపోయే టప్పుడు ఎలాంటి మనస్సుతో శరీరం విడుస్తారో తిరిగి అలాంటి శరీరంలోనే మరుజన్మ తీసుకుంటారు. చాలామంది భగవంతుడా! వచ్చే జన్మలో అయినా మమ్మల్ని గొప్ప ఇంట్లో, డబ్బున్న ఇంట్లో, అందంగా పుట్టించు అంటూ రకరకాలుగా కోరుకుంటారు. చివరికి చనిపోయేముందు కూడా వస్తువుల పట్ల, వ్యక్తుల పట్ల ధనం పట్ల తగుల్పాటుతోనే ఉంటారు. అలాంటి వారు తిరిగి మరలా జన్మలలో కూడా తమ కర్మఫలాన్ని అనుసరించి జన్మ తీసుకుంటారు. అలాగని అందరు గొప్ప ఇళ్ళల్లో, ధనం ఉన్న ఇంట్లో పుడతారని





కాదు. వారి గత జన్మ ఋణం బట్టి తల్లి గర్భంలో ప్రవేశిస్తారు. నిజానికి ఇలా ఎన్ని జన్మలెత్తినా తిరిగి ఆ కోరికలు తీర్చుకోవడానికే సరిపోతుంది కానీ శాశ్వత పరబ్రహ్మాన్ని పొందడానికి ఏమాత్రం ఉపయోగపడదు. అందుకే మన మందరం ఈ వస్తు, వైభవాల తగుల్పాటు వదిలిపెట్టి జ్ఞానం ఆధారంగా నిశ్చలమైన మనస్సుతో, కోరికలు లేకుండా అంతిమం వరకు భగవంతుని స్మృతి చేస్తుంటే ఆ ఫలం ఆధారంగా మనం శరీరం విడిచినా తిరిగి భగవంతుని జ్ఞానం – ధ్యానం కలిగిన ఇంట్లో పుట్టి సుఖం – శాంతి పొందుతాము.

### 8వ శ్లోకం

**అభ్యాసయోగయుక్తేనచేతసా నాన్యగామినా**
**పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్.**

### 9వ శ్లోకం

**కవిం పురాణమనుశాసితార**
**మణోరణీయాం సమనుస్మరేద్యః**
**సర్వస్య ధాతారమచిన్త్యరూప**
**మాదిత్యవర్ణంతమసఃపరస్తాత్**

ఎవరైతే ఏకాగ్రతతో, నిశ్చలమనస్సుతో తనని తాను ఆత్మగా భావించి, స్వయం ప్రకాశ స్వరూపుడైన పరమాత్ముని స్మరిస్తారో వారు ఆ పరమాత్మనే పొందుతున్నారు. ఈ రెండు శ్లోకాలలో భగవంతుడు తన యొక్క ఉనికి పూర్తిగా చెబుతున్నాడు. భగవంతుడు సర్వజ్ఞుడు, పురాతనమైనవాడు అంటే ఆ భగవంతునికి పూర్వం ఎవరు గాని, ఏ వస్తువుగాని లేదు. ఈ సృష్టికంతటికీ నియామకుడు. అణువు కన్నా అణువు. ఊహించనలవి కాని రూపం కలవాడు. అందరికీ ఆధారమూర్తి. ఇలా భగవంతుని వర్ణన ఉంది. ఇక్కడ భగవంతుని ఎవరూ ఊహించలేరు అని చెబుతుంటే ఆ భగవంతునికి అనేక రూపాలు తయారుచేసారు అంటే చిత్రకారులు, శిల్పులు మొదలైనవారు ఊహించుకుని ఇలా తయారుచేసారని అర్థం అవుతుంది. అదేవిధంగా మేము భగవంతునిలో ఐక్యం అంటే లీనమైపోతాము అని కొందరు చెబుతుంటారు. నిజానికి భగవంతుని యొక్క రూపం అణువు కంటే అణువు అంటే ఎంతో సూక్ష్మమైనది అని. అలాంటి అణువులో ఇంకో అణువు వెళ్లి ఎలా లీనం అయిపోతుంది? నిజంగా అలా వెళ్ళి అందరు భగవంతునిలో లీనం అయిపోతే ఇంతమంది

జనాభా ఎలా పెరిగిపోయారు? ఎట్టి పరిస్థితులలోను, ఎంత గొప్పవారైనా, ఎంత తపస్సంపన్నులైనా భగవంతునిలో కలిసిపోవడం అనేది ఉండదు. నిజానికి భగవంతుని ప్రేమలో లీనమైపోయారు అని చెప్పడానికి – భగవంతునిలో కలిసిపోయారు అని వ్రాసారు. మీరాబాయి కృష్ణుని ప్రేమలో లీనం అయిపోయింది. రామదాసు – రాముని కీర్తనలను పాడుతూ రాముని ప్రేమలో లీనమయిపోయాడు. అలాగే కబీరు, తుకారం, అన్నమయ్య మొదలైనవారంతా ఆయా రూపాలను కొలుస్తూ వారి ప్రేమలో లీనం అయిపోయారే కాని ఎవరూ భగవంతునిలో లీనం అవ్వలేదు.

### 15వ శ్లోకం

**మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్**
**నాప్నువన్తి మహాత్మానస్సంసిద్ధిం పరమాం గతాః**

### 16వ శ్లోకం

**ఆ బ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినో ర్జున**
**మాము పేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే.**

ఉత్తమమైన మోక్షాన్ని పొందిన మహాత్ములు తిరిగి దుఃఖాలకు నిలయమైన, అనిత్యమైన జన్మలను ఎప్పటికీ పొందరని చెప్పారు. ఇక్కడ మనందరం నిజాయితీగా, నిర్భయంగా ఒక విషయం తెలుసుకోవాలి. మనం ముందుగానే చెప్పుకున్నాము – మహాభారతం ఎనిమిదివేల శ్లోకాల నుండి, లక్షా ఎనిమిదివేల శ్లోకాలకి మార్పు చెందింది అని. అదేవిధంగా భగవద్గీతలో కూడా కొన్ని చోట్ల జన్మించినవాడికి మరణం, మరణించిన పిమ్మట జన్మ అనే వాక్యం చెప్పారు. ఇక్కడేమో తిరిగి జన్మ ఉండదంటున్నారు. అలాగే కొన్ని విశేష వస్తువులు, జీవులలో నేను ఉన్నానని సర్వవ్యాపిని కానని భగవంతుడు చెప్పినట్లు తిరిగి సర్వత్రా నేను వ్యాపిని. సర్వవ్యాపిని అని ఆ భగవంతుడే చెప్పినట్లు వ్రాసారు. యథార్థంగా గీతాబోధ సమయంలో సూక్ష్మంగా కృష్ణుడు అర్జునునికి చెబితే దానిని వ్యాసుడు విస్తార గ్రంథ రూపంగా, స్థూలంగా వ్రాశాడని తెలిపారు. దీనిని బట్టి గీతలో కూడా ఎన్నో క్రొత్త విషయాలు వచ్చి కలిసిపోయాయని ఒప్పుకుని తీరాలి. ఏదైనా హంస పాలు – నీరు ఎలాగైతే వేరు చేస్తుందో అలాగే మనందరం భగవంతుని స్మృతిలో యథార్థాన్ని తీసుకుని మిగతాది వదిలేయాలి. దుఃఖానికి నిలయం అని ఈ దేహాన్ని ఉదహరిస్తున్నారు.





నిజంగా దేహం దుఃఖానికి నిలయం అయితే భగవంతుని సృష్టికే అర్థం ఉండదు. ఒకప్పుడు ఆత్మలు దేహం ఆధారంగానే సంపూర్ణమైన సుఖం, ఆనందం, శాంతి పొందాయి. తిరిగి అవే ఆత్మలు శరీరాలు మారుస్తూ, పాపాలు చేస్తూ ఆ శరీరాల ద్వారానే దుఃఖాన్ని పొందుతున్నాయి. ఆత్మ + శరీరం, ఈ రెండు కలవకపోతే ఎట్టి పరిస్థితులలోను అనుభవం, అనుభూతి ఉండవు, ఆత్మ వేరుగా గాని, శరీరం వేరుగా గాని ఏమి చేయలేవు.

### 28వ శ్లోకం

**వేదేషు యజ్ఞేషు తపఃసు చైవ**
**దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్**
**అత్యేతి తత్సర్వమిదం విదిత్వా**
**యోగి పరం స్థానము పైతి చాద్యమ్**

భగవంతుని యథార్థంగా తెలుసుకున్న యోగి, వేదాల వలన, యజ్ఞాల వలన, దానాల వలన, తపస్సుల వలన వచ్చే పుణ్యఫలాన్ని ఆశించక సర్వోత్తమమైన భగవంతుని పొందుచున్నాడు. అంటే ఏ ప్రక్రియలో ఏ రూపాన్ని కొలిచినా నూటికి 99 మంది ఉద్దేశ్యం ప్రతిఫలాన్ని పొందటమే. కాని నిజమైన యోగి వీటివలన వచ్చే ఫలితాన్ని ఆశించకుండా ఆ భగవంతునే పొందు చున్నాడు. నిజానికి పైన ఏ విధంగా మనిషి కర్మ చేసినా ఆ కర్మ ఫలాన్ని ఇచ్చేది భగవంతుడే. ఆ భగవంతునే స్వయంగా పొందిన వారికి అల్పకాలిక ఫలాలతో పనిలేదు. ఎందుకంటే భగవంతుడు ఈ సృష్టికి బీజం అంటే విత్తనం కదా! ఆయననే మనం పొందితే ఇక అన్నీ పొందినట్లే.

## 9వ అధ్యాయము – రాజవిద్య రాజగుహ్య యోగము

రాజులుగా తయారుచేసి రహస్యయుక్తమైన, మిక్కిలి నిగూఢమైన (అంతరార్థం కలిగిన) యోగం అని అర్థం. సామాన్య మానవుని రాజుగా అంటే ఉన్నతునిగా తయారుచేసే పరమ రహస్యమైనది అని.

### 2వ శ్లోకం

**రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్**
**ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్.**

భగవంతుని గూర్చి యథార్థమైన రహస్యాన్ని తెలియచెప్పే శ్రేష్ఠమైన విద్య. పవిత్రమైనది. ధర్మమైనది. ప్రత్యక్షంగా తెలుసుకోదగినది. రహస్యముల

లోనే మిక్కిలి రహస్యమైనది. ఇటువంటి విద్యను మానవులు ఎవరూ చెప్పలేరని, దానిని స్వయం సృష్టికర్త అయిన భగవంతుడే చెప్పగలడని అర్థం అవుతుంది. మనిషి యొక్క శక్తి ఒక లైట్ వెలిగిస్తే వచ్చే కాంతిలాంటిది. లైట్ యొక్క శక్తిని బట్టి కాంతి మారుతుంది. అలాగే మనుష్యులశక్తి కూడా. ఏ ఒక్కలైట్ కూడా భూమికంతటికి వెలుగు ఇవ్వలేదు. ఒక్క సూర్యుడే భూమికంతటికీ వెలుగు ఇవ్వగలడు. మరి అలాంటి వేలకొలదీ సూర్యులను (నక్షత్రాలను) సృష్టించిన భగవంతుడు మాత్రమే ఈ రహస్యమైన విద్యను భోదించగలడు. ఇంకెవ్వరు చెప్పినా అది కొంతవరకూ నిజమవ్వవచ్చు గాని పూర్తిగా నిజం కాదు. ఎందుకంటే ఈ సృష్టికి రచయిత భగవంతుడు. తను రచించిన రచన గురించి స్వయంగా రచయిత ఒక్కడే నిజం చెప్పగలడు. మిగతా అందరూ ఊహించి మాత్రమే చెప్పగలరు.

### 4వ శ్లోకం

**మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా**
**మాత్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః**

సమస్త ప్రాణి కోటి నా యందు ఉన్నవి. నేను మాత్రం వాటియందు లేను. సత్యమైన భగవంతుడు మిధ్యా వస్తువు అంటే కల్పించబడిన అసత్య వస్తువులో ఎలా ఉండగలరు? దీనిని బట్టి భగవంతుడు సర్వవ్యాప్తి కానే కాదని స్పష్టంగా తెలుస్తుంది.



### 7వ శ్లోకం

**సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్**
**కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్**

సమస్త ప్రాణులను ప్రళయకాలమున నా యందు లీనం చేసుకుని తిరిగి సృష్టి మొదటి యందు నేనే సృష్టించుచున్నాను.

ఈ ప్రపంచానికి తప్పకుండా ఒక చివరి సమయం ఉంది అని, ఆ సమయంలో ఈ జీవరాశి అంతా ఈ సృష్టిని ఖాళీ చేసి ఆ భగవంతుని దగ్గరకు వెళ్లిపోవాలని తిరిగి ఇదే భూమిపై క్రొత్త సృష్టి సమయంలో భగవంతుడు మరలా సృష్టిస్తాడని తెలుస్తుంది. వినాశనం అంటే అందరూ చనిపోరు. కొంతమంది పుణ్యాత్ములు మాత్రం మిగిలి ఉంటారు అని కొంతమంది అంటారు. నిజానికి అవి అన్నీ కంటి తుడుపు మాటలు. భూకంపం వచ్చినప్పుడు



చనిపోయిన వాళ్లంతా పాపాత్ములు, బ్రతికినవాళ్లంతా పుణ్యాత్ములు అనలేము కదా! ఈ రోజు కాకపోతే రేపు అయినా తప్పకుండా ఈ సృష్టికి అంతిమ సమయం పొంచి ఉంది. అందరూ ఇష్టమైనా – కష్టమైనా ఈ ఇల్లు ఖాళీ చేసి వెళ్ళవలసిందే. జీవరాశి అన్నది ఏదీ ఈ సృష్టిలో మిగలదు. తిరిగి భగవంతుని ఆజ్ఞానుసారం క్రొత్త సృష్టి ప్రారంభం అవుతుంది.

### 11వ శ్లోకం

**అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్**
**పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరమ్**

సర్వజీవకోటికి ఆధారం అయిన వాడిని, సర్వులకి శ్రేష్ఠ ప్రభువును అయిన నేను ధర్మ సంరక్షణ కొరకు మానవదేహాన్ని ఆశ్రయించినప్పుడు నా యొక్క యథార్థమైన స్వస్వరూపాన్ని తెలుసుకోలేక నన్ను అవివేకులు అవమానించుచున్నారు.

భగవంతుడు ఎక్కడా జన్మించడు గనుక ధర్మసంస్థాపన కొరకు ఒక మానవ శరీరాన్ని ఆశ్రయించి ఆ శరీరం ఆధారంగా మానవుని ఉన్నతి కోసం జ్ఞానం చెబుతుంటే అవివేకులు భగవంతుడు మానవుని శరీరంలో రావడ మేమిటని హేళనగా మాట్లాడుతారు. నిజానికి భగవంతుడు సృష్టికర్త. ఆయన మానవ శరీరంలో ప్రవేశించి జ్ఞానం చెప్పవలసిన అవసరం ఏమిటి? దీనికేమైనా అంతరార్థం ఉందా? అంటే తప్పకుండా ఉంది. పెద్దగా ఉరుము ఉరిమితేనే మనం గుండె ఆగి చనిపోతాము. అలాంటిది యథార్థంగా భగవంతుని తేజస్సుని ఈ కళ్ళతో చూడగలమా? ఆకాశంలో ధ్వని సృష్టించి ఆశరీరవాణిగా భగవంతుడు పలికితే మన చెవులతో వినగలమా? అందుకే సాధారణమైన మానవ శరీరంలో ప్రవేశించి మనందరికీ అర్థమయ్యే మధురమైన భాషలో ఈ సృష్టి యొక్క ఆది, మధ్య, అంతిమ రహస్యాలు భగవంతుడు చెబుతున్నాడు. ఏ మానవ శరీరంలో ప్రవేశించి యథార్థమైన గీతాజ్ఞానాన్ని చెబుతున్నాడో మరిన్ని వివరాలు చివర పేజీలో తెలుసుకుందాము.

### 17వ శ్లోకం

**పితా హమస్య జగతో మాతా ధాతా పితామహః**
**వేద్యం పవిత్రమోంకారఋుక్సామయజురేవచ.**

ఈ ప్రపంచానికి నేనే తండ్రిని, తల్లిని, తాతను, సంరక్షకుడను... ఇలా పవిత్రమైనవన్నీ తనేనని భగవంతుడు చెబుతున్నారు. నిజంగా భగవంతుడు ఒక్కరే మనకి సర్వస్వం. ఈ దేహ సంబంధాలు జన్మ జన్మలకి మారుతుంటాయి. ఈ రోజు మనకు తల్లిగా ఉన్న శరీరంలో ఉన్న ఆమె ఆత్మ వచ్చే జన్మలో మనకి తోబుట్టువుగా, స్నేహితునిగా, ఏవిధమైన సంబంధంలోనైనా పుట్టవచ్చు. మనమూ అంతే. అందుకే ఎవరిని చూస్తున్నా దేహ సంబంధంలో వారు మనకు తల్లి అయినా, తండ్రి అయినా, భార్య అయినా, బిడ్డలైనా వారిలో ఉండే ఆత్మ మాత్రం భగవంతుని సంతానంగా మనకి సోదర ఆత్మ అని గుర్తు పెట్టుకోవాలి అని భగవంతుడు చెప్తున్నారు. దేహ సంబంధం దేహ సంబంధమే. ఇది ఈ జన్మ చివరి వరకు మారదు. కానీ ఆత్మ రూపంలో మాత్రం అందరం భగవంతుని పిల్లలమే కనుక సోదరులం అని అర్థం చూడండి - ఏదైనా మీటింగులో మాట్లాడేవారు సోదర సోదరీమణులారా? అని అంటారు. మరి వినేవారిలో పిల్లలు, తాతలు, మామలు ఇలా అనేకానేక దేహ సంబంధీకులు ఉండి ఉంటారు మరి అందరినీ సోదర సోదరీల్లారా! అని సంబోధన చేస్తున్నాడు. దానికి కారణం మనకి తెలియకుండానే ఆత్మ సంబంధంలో సోదరులమని నమ్మడమే. అంతే కాదు ఒక కుటుంబం గుడికి వెళ్ళిందనుకోండి. అక్కడ ఇంటికి పెద్దాయన దేవునికి దండం పెడుతూ తండ్రీ! నన్ను, నా భార్యని, నా కొడుకుని, కోడలిని, నా మనుమలని క్షేమంగా ఉండేలా చూడమని కోరుకుంటారు. అలాగే అతని భార్య కూడా తండ్రీ భగవంతుడా! నన్ను, నా భర్తని, నా పిల్లలను, మనుమలను క్షేమంగా చూడు అని కోరుకుంటుంది. అలాగే వాళ్ల అబ్బాయి, కోడలు కూడా కోరుకుంటారు. నిజానికి ఇంటి పెద్దకు తండ్రి అయిన భగవంతుడు ఆయన భార్యకి మామగారు అవ్వాలి కదా! వాళ్ళ పిల్లలకి తాతగారు, అతని పిల్లలకు ముత్తాత ఇలా అనేకానేక వరసలతో పిలవాలి కదా! కానీ అందరూ తండ్రీ తండ్రీ అనే పిలుస్తారు. దానికి కారణం ఆత్మలమైన మనందరికి పరమాత్మ ఒక్కడే తండ్రి. అందుకే తండ్రీ అనే భావనతో అలా కొలుస్తారు. ఈ రోజు దేహ సంబంధీకులు ఏ క్షణంలో ఎవరిని విడిచిపోతారో, ఏ కారణంగా ఎవరు, ఎవరిని ద్వేషిస్తారో తెలియదు. అందుకే క్షణక్షణం మనస్సు మార్చుకునే మనిషిని నమ్మడం కన్నా అనుక్షణం మనల్ని కాపాడే ఆ భగవంతుడినే తల్లిగా, తండ్రిగా, స్నేహితునిగా, బంధువుగా చేసుకుంటే మనకి దుఃఖం అశాంతులు రావు.





## 22వ శ్లోకం

**అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగ క్షేమం వహామ్యహమ్**

ఎవరైతే మనస్సుతో ఇతర ఆలోచనలు చేయకుండా నిరంతరం భగవంతుని గురించి ఆలోచిస్తూ, ధ్యానిస్తున్నారో అలాంటి వారి యోగ క్షేమములకు నేనే బాధ్యత వహిస్తున్నాను అని, ఇది చాలా గొప్ప విషయం. నిజంగా మన మనస్సు నిష్కల్మషంగా ఉండి, సదా భగవంతుని గుణగానం చేస్తూ ఉంటే మన యోగ క్షేమాలకు తనదే బాధ్యత అని భగవంతుడు గ్యారంటీ ఇస్తున్నారు. ఇన్సూరెన్స్ వారు మీరు చనిపోతే మీ ఇంట్లోవారికి డబ్బులు వస్తాయి అని చెప్తారు. నిజానికి అది మనం చూసేది కాదు, మనల్ని కాచేది కాదు. ఎవరైతే నిరంతరం భగవంతుని స్మృతిలో ఉంటారో వారికి భగవంతుడు సుఖం, శాంతి ఇస్తారు. నిశ్చయంతో భగవంతుని నమ్ముకున్న వారికి ఎలాంటి భయం లేదు. భగవంతుని అమ్ముకున్న వారికి మాత్రం ఎప్పుడూ అశాంతే. ఎప్పుడూ భగవంతుని వంకతో ధనం కోసం, పేరు కోసం ప్రాకులాడకూడదు. అది పాములా మన మెడకే చుట్టుకుని కాటేస్తుంది. ఈ విషం వలన అశాంతి, బాధలు వస్తాయి. నిజంగా మనకి 100% దేవునిపై నిశ్చయం ఉంటే మనకి రక్షణ కవచం ఆ భగవంతుడే. అందుకే భారతగాథలో కుంతితో కృష్ణుడు, అర్జునికి మరణమే సంభవిస్తే ఆ శవాన్ని తన గుండెల మీద పెట్టుకుని కాల్చుకుంటానని అన్నాడని వ్రాసారు. అంటే అక్కడ దేవుని నమ్మినంత మాత్రాన చావు రాదని కాదు అర్థం. బ్రతికినంత కాలం భగవంతుని తోడుతో ఆనందంగా బ్రతుకుతాము అని అర్థం. దేవుని తోడు గలవారికి చావు భయం ఎలా ఉంటుంది?

## 23వ శ్లోకం

**యే ప్యన్య దేవతాభక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః**
**తే పి మామేవ కౌన్తేయ యజన్త్య విధిపూర్వకమ్**

ఎవరైతే స్వయం భగవంతుని కాక దేవతారూపములను పూజ చేస్తున్నారో వారు కూడా పరోక్షంగా నన్నే పూజ చేస్తున్నారని భగవంతుడు చెబుతున్నారు. కానీ ఇది సరైన విధానం కాదు. ఎందుకంటే దగ్గరైనది, సులభమైనది, ఇబ్బందులు లేనిది అయిన జ్ఞానమార్గంలో భగవంతుని పొందడం మంచిదో,

ధనవ్యయం, శారీరక శ్రమ, కష్ట నష్టాలతో కూడిన దేవతారాధన మంచిదో మనమే నిర్ణయించుకోవాలి. అన్నింటికంటే ముఖ్యమైనది - మనస్సు యొక్క పవిత్రత, ఏకాగ్రత, కొంతమంది విగ్రహం లేకపోతే నిగ్రహం కుదరదు అంటారు. నిజమే కొంతకాలం వరకు అలా విగ్రహాన్ని ఆధారం చేసుకున్నా పరవాలేదు కానీ సదాకాలికంగా విగ్రహాన్ని ఆధారంగా చేసుకుంటే ఫలితం అల్పకాలికంగానే ఉంటుందని భగవంతుడు చెబుతున్నారు. చిన్న పిల్లవాడికి నడక నేర్పడానికి చక్రాలబండి ఇస్తారు. నడక వచ్చాక ఆ బండిని విడిచి సొంతంగా నడవటం మొదలుపెడతాడు. అదేవిధంగా మొదట్లో కీర్తన, భజన, పూజ మొదలైనవి చేసినా వాటిని కూడా దాటి జ్ఞానమార్గంలో భగవంతుని సేవించి తరించడం మంచిది. ఇవన్నీ మనం చక్కగా ఆలోచించవలసిన విషయాలు.

### 25వ శ్లోకం

**యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః**
**భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినో పి మామ్.**

దేవతలను పూజించువారు దేవతలను, భూతములను ఆరాధించువారు భూతములను, భగవంతుని ఆరాధించువారు భగవంతుని పొందుతున్నారు. దేవతలు, పితృదేవతలు, భూతములు, భగవంతుడు వేర్వేరని స్పష్టంగా తెలుస్తోంది. పైన భగవంతుడు తప్ప అందరూ పుట్టి గిట్టినవారే అలాంటి వాళ్ళు ఇచ్చే ఫలితం కూడా అలాగే ఉంటుంది. కానీ సదా పవిత్రుడు, చావు-పుట్టుకలు లేని భగవంతుని నుండి స్వయంగా పొందిన ఫలం మాత్రం శాశ్వతంగా ఉంటుంది. ఏది పొందాలో మనమే నిర్ణయించుకోవాలి.

### 26వ శ్లోకం

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి**
**తదహం భక్త్యు పహృతమశ్నామి ప్రయతాత్మనః**

ఎవరైతే నాకు కోరికలు లేకుండా పండైనా, పువ్వులైనా, జలమైనా ప్రేమతో సమర్పిస్తున్నారో వాటిని నేను ప్రేమతో స్వీకరిస్తున్నాను. భగవంతుడు స్పష్టంగా ఫలాపేక్ష లేకుండా ఇచ్చిన వాటినే నేను స్వీకరిస్తున్నానని చెబుతున్నారు. దీనిని బట్టి ఇప్పటి వరకు భగవంతుడు ఎవరి నుండి, ఏదీ స్వీకరించలేదని అర్థం అవుతుంది. ఆ విధంగా భగవంతుడు సదా అభోక్తగానే ఉండిపోతాడు. కారణం





ఏమిటంటే ఎంత గొప్ప భక్తులైనా, వ్రతాలు చేసినవారైనా భగవంతునికి అర్పణ చేసే దానిలో మోక్షం గురించో, శాంతి గురించో తెలియకుండానే సంకల్పం కలిసిపోతూనే ఉంటుంది. అందుకే ఏదీ ఇప్పటివరకు భగవంతునికి చేరలేదు. ఇది నిజం మరి అలాంటప్పుడు గుళ్ళూ, గోపురాలు ఎందుకు? అని మనకి సందేహం రావచ్చు. ప్రపంచంలో ముఖ్యంగా భారతదేశంలోనే భక్తి భావం ఎక్కువ. అంతేకాక మనది మొన్నమొన్నటి వరకు ముఖ్యంగా వ్యవసాయ ఆధారదేశం జీవితమంతా పొలం పనులతో సరిపోతుంటే ఇంక పుణ్యఫలం పొందేదెలాగని మన పూర్వీకులు ఈ భక్తిని బోధించి గుళ్ళూ గోపురాలు కట్టారు నీతి కథలు, పురాణ పురుషుల కథలు అల్లి వ్రాసారు. అంతే కాక ఎప్పుడూ ఒకే వాతావరణంలో ఉండి పోతుంటే ఆ మనుష్యులకి మార్పు అనేది లేక నూతిలో కప్పలు లాగా అయిపోతారని ఇలా తీర్థయాత్రలు అవీ పెట్టారు. నిజంగా గుడిలో మనం సమర్పించే కొబ్బరికాయ, అరటిపళ్ళు మొదలైనవి తిరిగి మనకి ఇచ్చి మిగిలినవి పేదలకు ప్రసాదం పెడతారని దయాభావనతో అలాంటి ఆచార, వ్యవహారాలు మన పెద్దలు ఏర్పాటు చేశారు. ఇవన్నీ ఎంతో మంచి మనస్సుతో మన పూర్వీకులు చేశారు కానీ ఈ రోజు కొబ్బరికాయ కొడుతూ తిరిగి పూజారి పెద్ద చెక్క ఇస్తాడో, చిన్న చెక్క ఇస్తాడో అనే ఆలోచన, దేవునికి ఇచ్చేయడానికే కదా పెద్ద అరటిపళ్ళు ఎందుకు, చిన్నవి చాలులే అనే పొదుపు, ఇలా భక్తులు భక్తి చేస్తుంటే పూజారులు ఆ వచ్చిన కొబ్బరి చెక్కలు పదిమందికీ పంచిపెట్టడం మాట అటుంచి హోటల్ వాళ్ళకి చట్నీకి రేటు కట్టి అమ్మేస్తున్నారు. ఇవన్నీ అందరికీ తెలిసిన నిజాలే. ఇలా వ్యాపార సంబంధమైన దృష్టితో భక్తి చేస్తే ఆ ఫలాన్ని భగవంతుడు ఎలా స్వీకరిస్తాడు? మనలో ఎంతోమంది తప్పు చేశామని భయంతోనే భక్తి చేస్తున్నారు. కాని నిష్కామభక్తి ఎవరు చేస్తున్నారో ఎవరికి వారే గుండెల మీద చేతులేసుకుని నిర్ణయించు కోవాలి.

### 27వ శ్లోకం

**యత్క రోషి యదశ్నాసి యజ్జుహూషి దదాసి యత్**
**యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్**

ఓ అర్జునా! నువ్వు ఏది చేసినా, తిన్నా, దానం చేసినా, హోమం చేసినా, తపస్సు చేసినా దానిని నాకు అర్పింపుము అని.

మనిషి ఏం చేసినా భగవంతుడికి అర్పణ చేసి ఆ కర్మని చేయాలి. కర్మ ఫలాన్ని ఈశ్వరార్పణం చేసి, కోరికలు లేని కర్మ చేయాలి. ఆహారమైనా, దానమైనా, ఇంకేదైనా భగవంతునికి అర్పణ చేస్తే ఆ ఫలితం యదార్థంగా ఉంటుంది. ఆహారం నోటిరుచి కోసం కాకుండా, శరీరనిర్వహణ కోసం ఈ సమయానికి ఏది భగవంతుడి ద్వారా మనకి లభిస్తుందో దానినే పరమాత్మకి సమర్పించి స్వీకరించాలి అదీ శరీర అవసరం కోసం ఆ క్షణంలో భగవంతుడు మనకి ప్రసాదించినదిగా భావించాలి. ఇక్కడ రుచిగా భుజించకూడదా అంటే తప్పకుండా తినవచ్చు, అన్నీ కలిసి వచ్చినప్పుడు ఆనందంగా పిండివంటలతో భోజనం చేయచ్చు, అప్పుడు అవన్నీ భగవంతుడికే సమర్పించి స్వీకరించాలి. ఏమీ లేనప్పుడు, అన్నీ సమృద్ధిగా ఉన్నప్పుడు మన భావన మాత్రం ఒకేలా ఉండాలి. భగవంతునికి అర్పణ చేయడం వలన అది ప్రసాదంగా మారుతుందని ముందే తెలుసుకున్నాం. ఇక దానం విషయానికి వస్తే దానఫలాన్ని ఆశించ కుండా దానం చేయమని భగవంతుడు చెబుతున్నారు. మరి ఏ దానం చేయాలి? సాధారణంగా లౌకికంలో మనకి గోదానం, భూదానం, వస్త్రదానం, సువర్ణదానం ఇలా అనేకానేక డబ్బు సంబంధమైన దానాల్ని గురించి చెబుతారు. కానీ ఇవన్నీ మనిషి కల్పించుకున్న స్వార్థపూరిత దానాలు. పిల్లిని చంపితే బంగారు పిల్లిని దానం ఇస్తే ఆ పాపం పోతుందని కొంతమంది చెబుతారు. నిజానికి అలాంటి లెక్క ఆత్మ జ్ఞానంలో లేనేలేదని భగవంతుడు చెబుతున్నారు. అసలు దానాలు అనేవి నిజానికి మూడు మాత్రమే.

మొదటిది – మనస్సుతో శక్తులు దానం. అంటే మనస్సుని భగవంతునితో ఏకాగ్రం చేసి మనలో శక్తులు నింపుకుని అలజడిలో ఉన్న ఆత్మలకి (గాలిలోకి) పంపటం. ఇవి కంటికి కనిపించవు కానీ సంకల్పబలం ఉంటే ఏ ఆత్మకైతే మన మనస్సు యొక్క తరంగాలు తాకాలని సంకల్పాలు చేస్తామో తప్పక ఆ వ్యక్తికి ఆ మనస్సులో భావన ఎవరో చెప్పినట్లు తెలుస్తుంది. చాలాసార్లు మనకి తెలియకుండానే ఎవరి గురించో ఆలోచిస్తూ ఉంటాము. అంతలో ఆ వ్యక్తి మన దగ్గరికి రావటం జరుగుతుంది. అంటే శరీరంలో ఆ వ్యక్తి రాకముందే అతని సంకల్పశక్తి మనల్ని తాకిందన్నమాట. ఇలా ఒక వ్యక్తికి – ఒక వ్యక్తికి కాక సృష్టిలో అందరికీ శుభం జరగాలని ఎవరైతే సంకల్పం చేస్తుంటారో వారినే యోగులని, సిద్ధపురుషులని అంటారు. అలాంటివారు ఇప్పుడు చాలా తక్కువగా ఉన్నారు.



రెండవదానం వాచా అంటే మాటల ద్వారా జ్ఞానదానం. అంటే మనం ఏ మాట మాట్లాడినా వ్యర్థం లేకుండా భగవంతుని జ్ఞానసంబంధమై ఉండాలి. అలా ఎవరితో మాట్లాడినా భగవంతుని జ్ఞానాన్ని వారి మనస్సుకి హత్తుకునేలా స్వయానికి పేరు – గౌరవం ఆశించకుండా ఒక పరికరంలా మారి అందరికీ అందించి వారిని భగవంతునికి దగ్గర చేయాలి.

మూడవది కర్మ ద్వారా గుణాల దానం – ఇది ప్రత్యక్షంగా కనిపించే దానం మన నిస్వార్థ కర్మని చూడగానే ఎదుటివారికి ఆహా! మనం కూడా ఇలాంటి కర్మనే చేయాలనే కోరిక కలగాలి. అంతటి సత్ప్రవర్తన, నడవడిక ఉండాలి. ఇలాంటి దానినే కర్మ ద్వారా గుణాల దానం అంటారు. సమయం వచ్చింది కనుక భగవంతుని యొక్క జ్ఞానం ఎంత లోతైనదో మరొక విషయం ద్వారా మనం తెలుసుకుందాము. దానం ద్వారా పుణ్యం వస్తుందని మనందరికీ తెలుసు కానీ నిజానికి దానం అనేదానికి పుణ్యం అనేదానికి చాలా తేడా ఉంది. పుణ్యం సంపాదించుకోవడానికి దానం ఒక చిన్న మార్గం మాత్రమే. దానం అంటే మన అవసరానికి సరిపోను మిగిలినది ఎవరికైనా ఇచ్చేది కానీ పుణ్యం అంటే మన అవసరాన్ని కూడా మానుకుని ఇతరులకి ఇస్తే వచ్చేది. అందుకే ఆర్భాటంకోసం చేసేది దానం అని, ఆత్మశుద్ధితో చేసిది పుణ్యమని చెబుతారు. దీనికి ఉదాహరణగానే ధర్మరాజు యాగం చేస్తుంటే ఎంతోమంది ఎన్నో దేశాల నుండి వచ్చి ధర్మరాజు ఇచ్చిన కానుకలు తీసుకుని ఇంత గొప్పయాగం ఎక్కడా చూడలేదు. ప్రపంచంలో ఇంత దానాలు ఎవ్వరూ ఇవ్వలేదని పొగుడుతుంటే ఒక ముంగిస వచ్చి ధర్మరాజు దానం చేసి వదిలిన నీళ్ళలో స్నానం చేసి ఇదేమంత గొప్పయాగం కాదు దీనిలో అంతా ఆర్భాట దానమే కానీ నాకైతే దీనిలో ఏమి పుణ్యం కనపడటంలేదు అందిట. ఆ మాటలు విని ధర్మరాజు ఆశ్చర్యపోయి ఓ ముంగిసా! నువ్వు మానవభాషలో మాట్లాడు తున్నావు అంటే నువ్వు సామాన్యమైన ముంగిసవు కావు దయచేసి దానానికి, పుణ్యానికి తేడా చెప్పమన్నాడట. అప్పుడు ఆ ముంగిస – ఓ ధర్మరాజా! నా శరీరం చూశావా? సగం బంగారంతో మెరుస్తుంది. దానికి కారణం ఏమిటో చెబుతాను విను అంది. ఓ గ్రామంలో ఓ బీద బ్రాహ్మణుడు తన భార్య, కొడుకు, కోడలితో కలిసి జీవిస్తున్నాడు ఓ పూట తింటే ఓ పూట తిండిలేనంత పేదవాడు. ఓసారి ఆ రాజ్యంలో కరువు వచ్చి తిండి దొరకడమే కష్టం అయిపోతుంది. ఆ కుటుంబం పస్తులతో చిక్కి శల్యం అయిపోయింది. ఇలా

వారం రోజులు గడిచాక ఆ బీద బ్రాహ్మణునికి ఓ పొలంలో కొన్ని జొన్న గింజలు దొరికాయి. అతను ఆనందంగా గింజలను మూట కట్టుకుని ఇంటికి వచ్చి భార్యతో ఈ రోజు భగవంతుడు మనకి ఆహారం ఇచ్చాడు. వీటిని భగవంతుని స్మృతిలో దంచి పిండి ఉడకబెట్టండి. అందరం తిందామని చెప్పాడు. భార్య, కోడలు పరమానందముతో ఆ జొన్న గింజలను దంచి ఉడకబెట్టి నాలుగు భాగాలుగా చేసి నలుగురూ భోజనం చేయడానికి సిద్ధమయ్యారు. ఇంతలో బయటి నుండి ఓ ముష్టివాడు-అమ్మా! ధర్మం చేయి తల్లీ ఆకలికి ప్రాణం పోయేలా ఉందని కేకేసాడు. అప్పుడు ఆ బీద బ్రాహ్మణుడు బయటకి వచ్చి నాయనా! సమయానికి ముందుగానే వచ్చావు కొంచెం ఆలశ్యం అయి ఉంటే ఆహారం ఎంగిలి అయిపోను, నా అదృష్టవశాత్తు నీకు అన్నం పెట్టే భాగ్యం లభించిందని తన భాగాన్ని ఆ బిచ్చగాడికి ఇచ్చేసాడు. ఆ ముష్టివాడు గబగబా దాన్ని తినేసి ఇంకా ఆకలి చూపులు చూస్తున్నాడు. అప్పుడు బ్రాహ్మణుని భార్య తన వంతు ఆహారాన్ని తీసుకొని వచ్చి అతనికి పెట్టింది. అది కూడా తినేసి ఇంకా ఆకలిగా చూసాడు బిచ్చగాడు. అప్పుడు కొడుకు కూడా తన వంతు భాగాన్ని అతనికి ఇచ్చి వేశాడు. దానిని కూడా తినేసి తిరిగి ఆకలిగా చూస్తున్నాడు. అప్పుడు కోడలు కూడా తన వంతు భాగాన్ని ముష్టి వానికి ఇవ్వబోతుంటే బ్రాహ్మణుడు అడ్డుపడి అమ్మా! నువ్వు చిన్నపిల్లవి. పైగా పరాయి ఇంటి నుండి వచ్చావు నీ భాగం కూడా అతనికి ఇచ్చేస్తే ఆకలికి తట్టుకోలేక మాతో పాటూ నువ్వు కూడా చనిపోతావు. కనుక ఆహారం అతనికి ఇవ్వవద్దని అన్నాడట. అప్పుడు ఆ కోడలు మామగారు నా ఇంటిపేరు మారాక మీ ఇల్లే నాకు సొంతం. మీ గౌరవమే నా గౌరవం. ఇంటికి వచ్చిన అతిథికి కడుపునిండా తిండి పెట్టకుండా పంపడం పాపం కనుక దయచేసి అడ్డు చెప్పకండి అని మృదువుగా మామగారికి చెప్పి తన భాగం ఆహారాన్ని కూడా ఆ ముష్టివానికి వేసేసింది. అది కూడా తిన్నాక ఆ ముష్టివాడు ఆనందంతో హమ్మయ్య నా కడుపు నిండిందని చేతులు కడుక్కున్నాడు. అప్పుడు అక్కడ ఏర్పడిన తడిలో నేను దొర్లాను ఎంతవరకైతే నేను పొర్లాడానో అంతవరకు బంగారంగా నా శరీరం మెరిసిపోతుంది. అప్పటి నుండి నా శరీరంలో మిగతా భాగాన్ని కూడా బంగారు రంగులోకి మార్చుకోవాలని ఎవరు ఎక్కడ యజ్ఞయాగాలు చేస్తున్నా అక్కడికి వెళ్తున్నాను. ఇదిగో ధర్మరాజు యాగం చేస్తున్నాడని తెలిసి తప్పకుండా నా మిగతా భాగం బంగారు రంగులోకి మారుతుందని ఆశతో వచ్చాను. కానీ నాకు ఇక్కడ త్యాగంతో కూడిన నిజమైన యాగం కనపడలేదని చెప్పిందట.





దానికి ధర్మరాజు సిగ్గుతో తలవంచుకున్నాడని మన పూర్వీకులు వ్రాసారు. నిజమైన త్యాగంలోనే పుణ్యం ఉంది తప్ప ఆర్భాటమైన దానాల వలన పుణ్యం ఉండదు. పైన విషయం కథ అయినా నిజంగా అలాంటి త్యాగం ఏదైతే ఉందో అదే నిజమైన పుణ్యం.

## 29వ శ్లోకం

**సమో హం సర్వభూతేషు న మే ద్వేష్యో స్తి న ప్రియః**
**యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్**

నేను సమస్త ప్రాణులయందును సమంగా ఉండేవాడను. నాకు ఒకరంటే ద్వేషంగాని, వేరొకరంటే ఇష్టం గాని లేదు. ఎవరు నన్ను భక్తితో కొలుస్తారో వారు నాయందు, నేను వారి యందు ఉంటాను. ఇక్కడ భగవంతుడు అన్ని ప్రాణుల యందు ఉండటం అంటే శరీరాలు అంతటా వ్యాపించి ఉంటాడని అర్థం కాదు. ఎవరైతే భగవంతునిపై మనస్సు నిలుపుతారో వారి మనస్సులో భగవంతుడు, ఆ భగవంతుని మనస్సులో భక్తుడు ఉంటారని అర్థం. ఇక్కడ భక్తి అంటే జ్ఞాన సమానమైన ఏకభక్తి అని గుర్తుంచుకోవాలి. భగవంతుడు ఎవరినీ ద్వేషించడని, ప్రత్యేకించి ప్రేమించడని, అందరి పట్ల సమదృష్టితో సాక్షిగా ఉంటాడని తెలుస్తుంది. అద్దంలో ఎలా అయితే మన ప్రతిబింబం ఉన్నది, ఉన్నట్లుగా కనపడుతుందో అలాగే మన మనస్సులో భగవంతుని యొక్క ఉనికి ఉంటుంది. కనుక ఎవరికైనా ఏదైనా అపకారం జరిగితే భగవంతుడు మాకు అన్యాయం చేశాడని అనవద్దు. అదంతా మన కర్మ ఫలంగా తెలుసుకోవాలి. మంచి జరిగినా అది మన పుణ్యఫలమే. అంతేగాని భగవంతునికి ఏమి సంబంధం లేదు. అలాంటి దానికి ఇక భగవంతుని స్మృతి ఎందుకు? అనే అనుమానం రావచ్చు. మన ప్రక్కన బురద పోసుకుంటే ఆ చెడువాసన మనకే వచ్చి వికారం కలిగిస్తుంది. అలాగే సువాసన వచ్చే అగరబత్తి వెలిగిస్తే ఆ వాసన మనకే ఆనందాన్ని, ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. భగవంతుని యొక్క స్మృతి కూడా అలాంటిదే. భగవంతుని స్మృతిలో ఏ పని చేసినా అది చెడుగా అవ్వదు. ఎందుకంటే నిజంగా భగవంతుని సాక్షిగా ఎవరైనా చెడు పని చేయగలమా? అందుకే భగవంతుని స్మృతి చేస్తూ కర్మ చేస్తే అది మంచి కర్మగా అవుతుంది. దానికి ఫలితం కూడా మంచిగానే ఉంటుంది. చెడు పనులు చేసేవానికి ఎలాగూ భగవంతుడు అవసరం లేదు. అందుకే నరసింహ శతకంలో ఇలా చెప్పారు.

గాడిదకి - కస్తూరి బొట్టు
కోతికి - మంచి గంధం
పులికి - పంచదార వంటకం
పందికి - మామిడిపండు
పిల్లికి - మల్లె పూలచెండు
గుడ్లగూబకి - కుండలాలు
దున్నపోతుకి - తెల్లబట్ట
కొంగకి - పంజరం

ఏ విధంగా అయితే అవసరం లేదో అదేవిధంగా చెడు ఆలోచించేవాడికి భగవంతుని స్మృతి అవసరం లేదు.

### 31వ శ్లోకం

**క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి**
**కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి**



ఎటువంటి పాపాత్ముడైనా భగవంతుని తెలుసుకుని ఆశ్రయిస్తే తొందరగా ధర్మబుద్ధితో మంచిగా మారి శాశ్వతమైన సుఖాన్ని పొందుతున్నాడు. నన్ను నమ్మినవాడు ఎన్నటికీ చెడడు. సృష్టిలో అందరూ ఎంతో కొంత పాపాన్ని చేస్తూనే ఉన్నారు. ఎవ్వరూ సంపూర్ణ పవిత్రులుగా లేరు. కానీ ఎవరైతే ఎటువంటి పాపాలు ఇప్పటివరకు తెలిసీ తెలియక చేసినా ఇప్పటి నుండి ఆ మార్గాన్ని విడిచి భగవంతుని నమ్ముకుని మంచి మార్గంలో నడిస్తే నెమ్మదినెమ్మదిగా ఆ పాపం తొలగిపోతుంది. ఎలా అయితే గొంగళి పురుగు ఎంత వికారంగా ఉన్నా అది గూడులోకి వెళ్ళిన తర్వాత అందమైన సీతాకోకచిలుకలా మారి బయటికి వస్తుందో అలాగే ఎంత పాపాత్ములైనా భగవంతుని తోడులో ఉంటే తిరిగి పుణ్యాత్ములుగా మారతారు. దీనికి గుర్తుగానే బోయవాడైన వాల్మీకి, మహర్షిగా మారి రామాయణ కావ్యాన్ని వ్రాశాడని చెబుతారు.

### 34వ శ్లోకం

**మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు**
**మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః**

నాయందే మనస్సు నిలుపుము, నాకు భక్తుడవుకమ్ము, నన్నే పూజింపుము, నాకే నమస్కరింపుము, నన్నే శ్రేష్ఠగతిగా తెలుసుకో అప్పుడు నన్నే పొందుతావు.



సృష్టికంతటికీ ఆధారభూతుడైన శివుని ఒక్కడినే మనస్సులో నిలుపుకుని ఆ భగవంతునే పూజిస్తే అతనినే పొందగలము. భగవంతుడు సృష్టికి విత్తనం. ఆ విత్తనంతో మనం డైరెక్ట్‌గా సంబంధం జోడిస్తే ఇక ఆయన ద్వారా వచ్చిన సృష్టి అంతటితోను మనకి సంబంధం ఉన్నట్లే. చెట్టు మొదట్లో నీరు పోస్తే చాలు ఆ చెట్టంతటికీ పాకుతుంది. ప్రతి ఆకు, కొమ్మ, రెమ్మ తడపవలసిన పని లేదు. అలాగే డైరెక్ట్ భగవంతునితో మనం యోగం చేసుకుంటే మిగతా అన్ని సంబంధాలు తెలియకుండానే పరోక్షంగా ఏర్పడిపోతాయి.

## 10వ అధ్యాయము - విభూతియోగము

ఇది భగవంతుని యొక్క మహిమలను గురించి తెలియపరిచే యోగం. నిజానికి గీతలో 9వ అధ్యాయం నాటికే సృష్టి అంతటి యొక్క రహస్యం తెలిసిపోతుంది. ముఖ్యంగా సాంఖ్యయోగం, జ్ఞానయోగం, రాజవిద్యా రాజగుహ్య యోగాలలో గీతాసారం అంతా వచ్చేస్తుంది. కానీ సంఖ్య కోసం 18 అధ్యాయాలుగా వ్యాసుడు ఇంకా విపులంగా గీతను వివరించి ఉండవచ్చును. మన పురాణాలు 18, భారతంలో పర్వాలు 18, యుద్ధం 18 రోజులు, సైన్యం 18 అక్షౌహిణులు, యుద్ధం తర్వాత మిగిలిన వారు 18 మంది, ఇలా 18 అనే సంఖ్య తిరిగి 1+8=9 అంకెగా మారడానికి ఏదో పరమార్థం ఉండి ఉంటుంది. అది అయితే మాకు తెలియదు ఎందుకంటే మాకు శాస్త్ర పరిజ్ఞానం లేదని మీకు ముందే తెలియచెప్పాము. ఇక ఈ అధ్యాయంలో

### 1వ శ్లోకం

**భూయ ఏవ మహాబాహో శ్రుణు మే పరమం వచః**
**యత్తే హం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా.**

నా యొక్క అవతార రహస్యాన్ని, మహిమను దేవతలు గాని, మహర్షులు గాని తెలుసుకోలేరు. ఎందుకంటే వారందరి జన్మలకు కారణమైనవాడను నేనే. మనం క్రిందటే చెప్పుకున్నాము - భగవంతుడే స్వయంగా తన గురించి చెబితే తప్ప ఎవరూ భగవంతుని మహిమను తెలుసుకోలేరు అని అదే విషయం తిరిగి భగవంతుడు చెబుతున్నారు. ఈ సృష్టిలో పుట్టి గిట్టేది భగవంతుడు అయ్యే విషయమే లేదు. అలాంటి చావు పుట్టుకలకు లొంగిపోయేవారు ఎవరైనా సరే భగవంతుని గురించి యథార్థంగా ఎలా చెప్పగలరు!

ఈ రోజులలో ఎంతోమంది తామే భగవంతుని అవతారమని చెప్తున్నారు. అసలు భగవంతునికి అవతారాలే లేవని ఉపనిషత్తుల సారం. మరి ఇప్పుడు రోజుకో క్రొత్త భగవంతుడు పుట్టుకొస్తున్నాడు. మాతాజీల పేర్లతో, స్వాముల పేర్లతో ఎందరో ప్రజల్ని ఆకర్షిస్తున్నారు. దీనికి కారణం ఏమిటి? గత జన్మలలో ఆ ఆత్మలకి ఈ ఆత్మలకు ఉన్న ఋణానుబంధమే ఈ గురు-శిష్య సంబంధాలుగా మారుతాయి. లేకపోతే స్వయం భగవంతుని కాక తల్లి గర్భంలో మల మూత్రాల సంచిలోంచి వచ్చిన దేహధారులకి ఎలా పాదాభివందనం చేస్తారు. ఇది కేవలం ఋణం మాత్రమే కనుక అలా ఎవ్వరైనా చేస్తున్నా వారిని విమర్శించే హక్కు మనకి లేదు. అది ఆయా వ్యక్తుల మధ్య బంధం. ఇక్కడ పాదాభివందనం చేసే భక్తులు నిజానికి అమాయకులే. కానీ అలా దండాలు పెట్టించుకున్నవాళ్లు తెలిసి తప్పు చేస్తున్నట్లే. ఎందుకంటే వారికి తెలుసు తమ కంటే భగవంతుడు గొప్పవాడని, తమకి ఏదొకనాటికి మరణం తప్పదని, ఇవన్నీ తెలిసి తమ భక్తులకి నిజమైన భగవంతుని మహిమ చెప్పకుండా తమ హస్తలాఘవాలతో ఆకర్షితంచేసి తమకి దగ్గర చేసుకుంటున్నారు. అంటే దానికి శిక్ష కూడా చాలా ఎక్కువగా ఉంటుంది. అది బయటకి కనపడకపోవచ్చు. ఆడంబరమైన రూపంతో మనకి వాళ్లు కనపడవచ్చు, కాని వారి మనస్సు లోలోపల వారిని తినేస్తూ ఉంటుంది. నిజానికి ఈ స్వామీజీలు ఎలాంటివాళ్లంటే.

జవహర్‌లాల్ నెహ్రూ ఒకసారి విశాఖపట్నం పిచ్చివాళ్ళ ఆసుపత్రికి వెళ్ళారట. అక్కడ పిచ్చివాళ్ళతో నా పేరు జవహర్‌లాల్ నెహ్రూ, నేను ఈ దేశానికి ప్రధాన మంత్రిని అని చెబితే ఓ పిచ్చివాడు ఇదిగో బాబూ నిజం చెప్పకు. ఇక్కడ నిజం చెబితే పిచ్చివాడని ఆసుపత్రిలో పడేస్తారు. నేను నీలాగే నిజం చెబితే వీళ్లు నమ్మకుండా నన్ను పిచ్చోడని చెప్పి ఇదిగో ఇలా కట్టిపడేసారని చెప్పాడట. దానికి నెహ్రూగారు ఆశ్చర్యపోయి ఇంతకీ నువ్వు చెప్పిన నిజం ఏమిటో చెప్పు నేను తప్పక నమ్ముతాను అని అన్నారట. అప్పుడు ఆ పిచ్చివాడు నేను మహాత్మాగాంధీని అంటుంటే ఎవరూ నమ్మడం లేదని అన్నాడట. ఇది నిజానికి ఒక జోక్ అయి ఉండవచ్చు కానీ యథార్థంగా ఇప్పుడు స్వయం భగవాన్‌లు అందరూ అలాంటివారే.

## 6వ శ్లోకం

**మహర్షయస్సప్త పూర్వే చత్వారో మనవస్తథా**
**మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః**





లోకంలో మానవులందరికీ పూర్వీకులైన సప్తర్షులు, దేవతలు నా సంకల్పం ద్వారానే పుట్టిరి. ఇప్పుడు చాలా మంది చెట్టు ముందా? విత్తనం ముందా? అంటూ వాదన చేస్తుంటారు. నిజానికి భగవంతుని సృష్టిలో ఏది ముందు, ఏది వెనుక అనే సంశయం అనవసరం. ముందు భగవంతుడు తనే స్వయంగా కొంతమంది వ్యక్తుల్ని, జీవరాశుల్ని, వృక్ష సంపదని సృష్టించి తద్వారా మిగతా సృష్టిని పెంపు చేస్తారు. మొదట వాటన్నింటికి ఆధారం భగవంతుని సంకల్పం మాత్రమే. ఎలా అయితే ఇంజనీర్ ఒక మిషన్ తయారుచేసిన తర్వాత ఆ మిషన్ ద్వారా అనేక మిషన్లు ఎలా తయారవుతున్నాయో అదేవిధంగా భగవంతుని సృష్టిలో కూడా తల్లిగర్భం లేకుండా మనుషులు, విత్తనం లేకుండా చెట్లు ఇలా అన్నీ మొదటే తయారవుతాయి. తర్వాత వాటి ఆధారంగా మిగతా సృష్టి పెరుగుతూ వస్తుంది.

## 9వ శ్లోకం

**మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్**
**కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ.**

నా యందు మనస్సు కలవారు. నా యందు అంటే భగవంతుని స్మృతిలో ప్రాణాలు అర్పించిన వారు, నన్ను గురించి పరస్పరం బోధించుకొనుచు, ఎల్లప్పుడు సంతృప్తిని, ఆనందాన్ని పొందుచున్నారు. ఎవరైతే భగవంతునిపై మనస్సు పెట్టి ఆ స్మృతిలో ప్రాణాలు విడిచినా మరుజన్మలో తిరిగి భగవంతుని స్మృతి ఉన్న ఉత్తమమైన ఇంటిలో పుట్టి, సజ్జనుల సాంగత్యంలో ఉంటూ భగవంతుని మహిమలను గురించి మాట్లాడుకుంటూ ఆనందాన్ని పొందుతున్నారు. నిజంగా సత్యమైన ఆనందం భగవంతునితోనే ఉంది. మిగిలినవన్నీ తాత్కాలికమైన ఆనందం. సుఖం ఇచ్చేవే. ఏ క్షణంలో వ్యక్తులు మనస్సు మార్చుకుంటారో, ఏ క్షణంలో ప్రకృతి తన విశ్వరూపం చూపెడుతుందో మనకి తెలియదు. అందుకే ఎవరితో ఉన్నా, ఎలాంటి పరిస్థితిలో ఉన్నా మన మనస్సు మాత్రం భగవంతుని తోనే ఉండాలి. సాధ్యమైనంత ఎక్కువసేపు భగవంతుని కీర్తించే వారితోనే సాంగత్యం చేయాలి. మనకి సాధారణంగా తల్లి, తండ్రి, గురువు ప్రత్యక్ష దైవాలని చెబుతారు. నిజానికి ఈ దేహసంబంధాలు వ్యక్తిగతమైనవి. జన్మజన్మలకి మారుతూ ఉంటాయి. ఈ శరీరం ఉన్నంతవరకు వారిని తప్పక గౌరవించాలి కానీ మనస్సులో మాత్రం ఆ బంధాలు పెట్టుకోకూడదు. అందుకే మాతా, పిత మమత విడవవలెను, భాగవతజనుల్లా

సంభాషించవలెను... అని తత్వాలు చెబుతున్నాయి. ఎవరి మీద మమకారం పెట్టుకోవద్దు. ఒక భగవంతుని నమ్మిన వారితోనే స్నేహం చేయండి. వారితో ఎక్కువగా ఉండండి అప్పుడు భగవంతుని స్మృతి నిలబడుతుంది అని చెబుతారు. దేహసంబంధం ఒక జన్మకే పరిమితం కానీ ఆత్మసంబంధం సదా శాశ్వతం అందుకే ఎవరైతే భగవంతుని సేవలో ఉంటారో వారే మన నిజమైన బంధువులు, స్నేహితులు.

### 20వ శ్లోకం

**అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః**
**అహమాదిశ్చమధ్యం చ భూతానామన్త ఏవ చ.**

సమస్త ప్రాణుల హృదయమందున్న పరమాత్మ స్వరూపుడను నేనే. వాటి సృష్టి, స్థితి, లయాలకు నేనే కారకుడను, భగవంతుడు అన్ని ప్రాణాల హృదయాలలో అంటే మనస్సులలో నిలిచి ఉన్నాడని అర్థం. నిజానికి హృదయం అంటే మనస్సు అంతేగాని మనం అనుకున్నట్లు గుండె అయ్యే అవకాశం లేదు. నిజంగా భగవంతుడే గుండెల్లో ఉంటే ఈ రోజుల్లో గుండె తీసి క్రొత్త గుండె పెడుతున్నారు. కదా! అప్పుడు పై దానికి అర్థం ఏమిటి, కనుక భగవంతుడు మన అందరి మనస్సుల్లోనే ఉంటాడు. గాని స్థూలమైన శరీరభాగాలలో కాదు. ఒకవేళ అలా అని నమ్మినా గుండెల్లోనే ఉంటే మిగతా శరీరంలో లేనట్లే కదా! అలా చూసినా భగవంతుడు సర్వ వ్యాపి కాదు. ఈ అధ్యాయంలో 21 నుంచి 40 వరకూ శ్లోకాలలో తాను కొన్ని వస్తువులలో, గ్రహాలలో, వ్యక్తులలో మాత్రమే ఉన్నానని చెపుతున్నాడు. అలా చూసినా భగవంతుడు సర్వ వ్యాపి కానే కాదు. అంతేకాక కొంచెం లోతుగా ఆలోచిస్తే చెడు వ్యసనమైన జూదంలో కూడా తాను ఉన్నానంటున్నాడు. చెడులో సత్యం ఎలా ఉండగలదు. కనుక ఏది నిజం మనమే ఆలోచించుకోవాలి.

### 41వ శ్లోకం

**యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీ మదూర్జితమేవ వా**
**తత్తదేవారగచ్ఛ త్వం మమ తేజోంశ సమ్భవమ్**

ఈ ప్రపంచంలో ఐశ్వర్యయుక్తమైన, ప్రకాశవంతమైన, ఉత్సాహంతో కూడిన వస్తువు లేదా ప్రాణి నా తేజస్సు యొక్క అంశం నుండి పుట్టాయి.



ఇక్కడ భగవంతుడు పైన చెప్పినవన్నీ గొప్ప లక్షణాలు, అలాంటివన్నీ భగవంతుని జ్ఞానం ఆధారంగానే వస్తాయని, ఆ జ్ఞానమనే వెలుగు నుండే వస్తాయని తెలుస్తుంది. అందుకే కాంతి హీనంతో గాని, శక్తి హీనంతో గాని, నిరాశతోగాని కూడి ఉన్న వాటి గురించి భగవంతుడు చెప్పడం లేదు. అవి ఆత్మల అజ్ఞానం నుండి పుట్టుకొచ్చాయి.

## 11వ అధ్యాయం - విశ్వరూప సందర్శన యోగం

ఇది భగవంతుని శక్తులను తెలియపరిచే యోగం, ఈ సృష్టి అంతటికీ కర్త పరమాత్మ శివుడు. ఆ పరమేశ్వరుడు స్వయంగా సృష్టి, ఆది మధ్య, అంత్య రహస్యాలను తనలోనే చూపగలడు. అంటే జ్ఞానం ద్వారా తెలుపగలడు.

### 7వ శ్లోకం

**ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్**
**మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి.**

ఈ సమస్త చరాచర ప్రపంచములో నీవేది కోరుకుంటే దానిని ఈ శరీరంలో అవయవాల ఉనికి వలె నాలోనే చూడగలవు. మనం శరీరాన్ని చూస్తుంటే దానిలో కాళ్ళు, చేతులు ఇలా అవయవాలు అన్నీ కనపడతాయి కదా అలాగే మనం నిశ్చయంతో మనస్సుని ఏకాగ్రం చేసి భగవంతుని స్మృతిలో ఉంటే ఆ భగవంతుని జ్ఞానం వలన సర్వ రహస్యాలు మనకి తెలిసిపోతాయి. విశ్వంలోని ప్రతి దానిని మనస్సు అనే కన్ను ద్వారా చూడవచ్చు. అందుకే దీనిని విశ్వరూప సందర్శనం అని భగవంతుడు చెబుతున్నారు.

### 8వ శ్లోకం

**న తు మాం శక్య సే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా**
**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్.**

నీ స్థూలమైన కళ్ళతో నా విశ్వరూపాన్ని చూడలేవు. కనుక నీకు దివ్యదృష్టిని అంటే జ్ఞాననేత్రాన్ని ప్రసాదిస్తున్నాను. దాని ద్వారా నా విశ్వరూపాన్ని చూడు అని. స్థూలమైన కళ్ళతో స్థూలమైన దానినే అదీ కొంత పరిధిలోనే చూడగలము. అలాంటి మనం భగవంతుని చూడటం అంటే అనుభూతి చేసుకోవడం ఒక్క జ్ఞాననేత్రం ద్వారానే సాధ్యం. ఇక్కడ భగవంతుని చూడటం అంటే జ్ఞాన, యోగాల ద్వారా కలుసుకోవటం అని గుర్తుంచుకోవాలి. ఎలా అయితే మనం గాలిని కంటితో చూడకపోయినా, శరీరంతో అనుభవం

చేసుకుంటున్నాము. అలాగే వాసన మన కంటికి కనబడకపోయినా ముక్కుతో పీల్చి అనుభవం చేసుకుంటున్నాము. అదేవిధంగా మనకి మనం ఆత్మగా అనుభవం చేసుకుంటూ పరమాత్మని అనుభవం చేసుకోవాలి.

### 15వ శ్లోకం

పశ్యామి దేవాంస్తవ దేవ దేహే - సర్వాంస్తథా భూతవిశేషసఙ్ఘాన్
బ్రహ్మాణమీశం కమలాసనస్థ - మృషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్

### 16వ శ్లోకం

అనేక బహూదరవక్త్రనేత్రం - పశ్యామి త్వాం సర్వతో నన్తరూపమ్
నాన్తం న మధ్యం న పునస్తవాదిం - పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప

### 17వ శ్లోకం

కిరీటినం గదినం చక్రిణం చ -తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా - ద్దీప్తానలార్కద్యుతిమ ప్రమేయమ్.

### 18వ శ్లోకం

త్వమక్షరం పరమం వేదితవ్యం - త్వమస్య విశ్వస్య పరం నిధానమ్
త్వమవ్య యశ్శాశ్వత ధర్మగోప్తా - సనాతనస్త్వం పురుషో మతో మే.

### 19వ శ్లోకం

అనాదిమధ్యాన్తమనన్తవీర్య - మనన్తబాహుం శశిసూర్యనేత్రమ్
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం - స్వతేజసా విశ్వమిదం తపన్తమ్.

### 20వ శ్లోకం

ద్యావాపృథివ్యోరిదమన్తరం హి - వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః
దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం - లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్.

### 21వ శ్లోకం

అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి - కేచిద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి
స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధసఙ్ఘాః - స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః

### 22వ శ్లోకం

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా - విశ్వే శ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ
గన్ధర్వయక్షాసురసిద్ధసఙ్ఘా - వీక్షన్తేత్వాం విస్మితాశ్చైవ సర్వే.





### 23వ శ్లోకం

రూపం మహత్తే బహువక్త్ర నేత్రం - మహాబాహూ బహుబాహూరుపాదమ్
బహూదరం బహుదంష్ట్రాకరాళం - దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథా హమ్.

### 24వ శ్లోకం

నభఃస్పృశం దీప్తమనేకవర్ణం - వ్యాత్తననం దీప్తవిశాలనేత్రమ్
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా - ధృతిం న విన్దామి శమం చ విష్ణో

### 25వ శ్లోకం

దంష్ట్రాకరాలాని చ తే ముఖాని - దృష్ట్వై కాలానల సన్నిభాని
దిశో న జానే న లభే చ శర్మ - ప్రసీద దేవేశ జగన్నివాస

### 26వ శ్లోకం

అమీచ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః - సర్వే సహైవావనిపాలసఙ్ఘైః
భీష్మోద్రోణస్సూతపుత్రస్తథా సౌ - సహాస్మదీయైరపి యోధముఖ్యైః

### 27వ శ్లోకం

వక్త్రాణి తే త్వరమాణా విశన్తి - దంష్ట్రా కరాలాని భయానకాని
కేచిద్విలగ్నా దశనాన్త రేషు - సందృశ్యన్తే చూర్ణితైరుత్తమాఙ్గైః

### 28వ శ్లోకం

యథా నదీనాం బహవో మ్బువేగా - స్సముద్రమేవాభిముఖా ద్రవన్తి
తథా తవామీ నరలోక వీరా - విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి

### 29వ శ్లోకం

యథాః ప్రదీప్తం జ్వలనం పతఙ్గా - విశన్తి నాశాయ సమృద్ధవేగాః
తథైవ నాశాయ విశన్తి లోకా - స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః

### 30వ శ్లోకం

లేలిహ్య సే గ్రసమానస్సమన్తా - ల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః
తేజోభిరాపూర్య జగత్సమగ్రం - భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో

## 31వ శ్లోకం

**అక్యా హి మే కో భవానుగ్రరూపో - నమో స్తుతే దేవవర ప్రసీద**
**విజ్ఞాతుమిచ్ఛామి భవన్త మాధ్యం - న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్.**

అర్జునుడు భగవంతునితో అనేకానేక ప్రాణులను, దేవతలను, భయంకరమైన విషయాలను చూస్తున్నాను. అయినా నేను నీ ఆది, మధ్య, అంతిమములు చూడలేకపోతున్నానని అంటాడు. నిజమే ఎవరికీ కూడా భగవంతుని యథార్థమైన, సంపూర్ణశక్తిని తెలుసుకునే అవకాశం లేదు. కానీ మనందరం అర్జునుడిగా మారితే ఈ సృష్టి పుట్టుక, మహావినాశనం...ఇలా అన్ని రహస్యములు మన జ్ఞాననేత్రం ద్వారా తప్పక చూడొచ్చు. భవిష్యత్తుని యోగశక్తితో చూసి జరుగబోయే వాటిని ముందే తెలియచెప్పారని వీరబ్రహ్మం గారు, నోస్టర్ డామస్ అనే ఆయన ఇలా ఇంకా కొద్ది మంది గురించి మనకి తెలుసుకదా!

## 32వ శ్లోకం

**కాలో స్మి లోక క్షయకృత్ప్రవృద్ధో - లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః**
**ఋతే పి త్వా న భవిష్యన్తి సర్వే - యో వస్థితాః ప్రత్యనీకేషు యోధాః**

ఈ సృష్టిలో ఉన్న సమస్త ప్రాణులను సంహరించే కాల స్వరూపుడను నేనే. దీనితో నువ్వు చంపకపోయినా బ్రతకగలవారు ఎవ్వరూ లేరని, ఈ ప్రపంచానికి నియామకుడు, పెంచి పోషించేవాడు. చివరికి అధర్మం పెరిగిపోయినప్పుడు తిరిగి జీవరాశినంతా చంపేవాడు భగవంతుడే. అందుకే ఈ భూమిలో చెడుని సంహరిం చడంలో మన వంతు కర్తవ్యం మనం చేయాలి. మరి చెడు అంటే మనస్సులో ఉండే చెడుగుణాలను సంహరించడంలో మన పాత్ర మనం అభినయించాలి. అప్పుడు పరమాత్మ కర్తవ్యంలో భాగం పంచుకున్న పుణ్యం వలన మనకి సద్గతి వస్తుంది. ఒకవేళ మనం ముందుగానే చెప్పుకున్నట్లు ఇది మనలో అంతర్యుద్ధం గనుక మనం చేయకపోయినా ఆగేది కాదు. చేస్తే సద్గతి, చేయకపోయినా అంతిమం అనేది తప్పదు. అప్పుడు మనకి వచ్చేది దుర్గతి. అందుకే భగవంతుడు హెచ్చరిక చేస్తున్నాడు నువ్వు చంపకపోయినా ఇక బ్రతికేవారు ఎవ్వరూ లేరు అని. దీనికి గుర్తుగానే భూదేవి తన సొంతబిడ్డ అయిన నరకాసురుని సంహరించమని విష్ణువుని కోరిందని దానికి సత్యభామ ఆధారంగా కృష్ణుడు నరకాసురుని చంపాడని వ్రాసారు. నిజానికి భూమి మనకి తల్లి, అలాంటి తల్లి కడుపులోనే చిచ్చుపెట్టి ఈ రోజు మనిషి ఎంతో ద్రోహంతో, రాక్షస లక్షణాలతో పాపాత్ముడిగా తయారయ్యాడు.



అలాంటి గుణాలు అందరిలోనూ పెరిగిపోయాయి. ఆ పాపభారాన్ని మోయలేక ఇలాంటి దుర్మార్గులను చంపేయమని స్వయంగా తల్లే తన భర్తని కోరిందని ఎంతో అంతరార్థంతో అలా వ్రాసారు. భగవంతుడు స్వయంగా తను కర్మ చేయడు కనుక సత్యమైన ఆత్మలతో మనలో ఉండే చెడుగుణాలను సంహరించే మార్గాన్ని తెలియచెప్పి వారి ద్వారా తిరిగి మానవునిలో ధర్మాన్ని ప్రవేశపెట్టి ఆ తర్వాత ఈ స్థూల సృష్టిని వినాశనం చేసి తిరిగి క్రొత్తసృష్టిలో మనల్ని దేవతలుగా సృష్టిస్తాడు. ఇక్కడ సత్యమైన భామ అంటే ఆడవాళ్ళనే అర్థం కాదు. సత్యమైన ఆత్మలు అని అర్థం. ఎందుకంటే ప్రకృతితో పోలిస్తే ఆత్మ పురుష కానీ పరమాత్మునితో పోలిస్తే ఆయన పరమపురుషుడు. ఆత్మకి స్త్రీ - పురుష అనే బేధం లేదు.

## 48వ శ్లోకం

**న వేదయాజ్ఞాధ్య యనైర్న దానై**
**ర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః**
**ఏవం రూపశ్యక్య అహం నృలోకే**
**ద్రుష్టుం త్వదన్యేన కురుప్రవీర.**

ఓ అర్జునా! నా విశ్వరూపాన్ని మానవలోకంలో ఇప్పటి వరకు ఎవరూ చూడలేదు. నా దయవలన నువ్వు మాత్రం చూడగలిగావు. వేదాలు చదివినా, యజ్ఞాలు చేసినా, దానాలు చేసినా, ఘోరమైన తపస్సు చేసినా సరే ఈ విశ్వరూపాన్ని చూడటం సాధ్యం కాదు. భగవంతుని చూడాలంటే స్థూలమైన కంటికి కనపడే ఏ ప్రక్రియ పనికిరాదని, ఒక్క జ్ఞాననేత్రం ద్వారానే భగవంతుని యొక్క మహిమలను తెలుసుకోగలమని ఖచ్చితంగా తెలుస్తుంది. అందుకే సృష్టిలోకెల్ల పవిత్రమైనది జ్ఞానం అని భగవంతుడు స్వయంగా చెబుతున్నాడు.

## 52వ శ్లోకం

**సుదుర్దర్మమిదం రూపం దృష్టవానసి యన్మమ**
**దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్మనకాజ్ఞిణ**

నా యొక్క ఏ విశ్వరూపాన్ని అయితే నువ్వు ఇప్పుడు చూసావో అది చాలా కష్టసాధ్యమైనది, దేవతలు కూడా ప్రతిదినం దానిని చూడాలని కోరుకుంటారు. గీత ఆదిలోనే ఉంది దేవతలు అంటే దైవీగుణాలు కలిగిన మానవులు అని. ఎవరికైతే దైవీగుణాలు ఉంటాయో వారందరికీ సదా

భగవంతుని మహిమలను తెలుసుకోవా లనే కోరిక ఉంటుంది. అలాంటివారు మనస్సుని భగవంతునిపై నిలిపి కోరికలు లేకుండా ప్రయత్నిస్తే అర్జునిలా భగవంతుని విశ్వరహస్యాన్ని తెలుసుకోగలుగుతారు.

### 55వ శ్లోకం

**మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః**
**నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాణ్డవ**

ఎవరైతే నా కోసమే కర్మ చేస్తారో, నన్నే పరమపురుషునిగా నమ్మి ఉంటారో, కంటికి కనబడే వస్తు సముదాయం, వ్యక్తుల పట్ల ఆసక్తి లేకుండా నిమిత్త భావనతో ఉంటారో, ఏ జీవి పట్ల ద్వేషం లేకుండా ఉంటారో అటువంటి వారు నన్నే పొందు తున్నారు. మనందరం కుటుంబంలో ఉన్నా నిమిత్తంగా కర్మ చేస్తూ జీవన యాత్ర సాగిస్తూ అవసరాలకు మాత్రం సరిపడా సంపాదన కోసం కృషి చేస్తూ ఎక్కువ సమయాన్ని భగవంతుని కార్యం కోసం వినియోగిస్తుంటే ఆ పరమాత్మనే పొందగలం అనే గ్యారంటీ కార్డ్ భగవంతుడు ఇస్తున్నారు. మనందరం ఇంతకు ముందు లేనివాళ్ళు, మధ్యలో వచ్చి చేరినవాళ్ళు తిరిగి విడిపోయేవాళ్లు అయిన దేహ సంబంధీకులతో ఉంటూ కూడా మనస్సుతో భగవంతుడు ఒక్కరినే నమ్ముకోవాలి. ఆయన ఒక్కరే మనకి నిజమైన సుఖం, శాంతి ఇచ్చే దాత.

## 12వ అధ్యాయం - భక్తి యోగము

భక్తి యొక్క స్వరూపం ఏమిటి? భక్తుని లక్షణాలు ఏమిటి? ఇలా భక్తిని గూర్చి చెప్పే యోగం.మనం ముందే తెలుసుకున్నాము కదా! నిష్కామ భక్తి అంటే కోరికలు లేని భక్తి, ఏకీరస భక్తి అంటే ఒకే రూపాన్ని నిరంతరం కొలిచే భక్తి కూడా జ్ఞానంతో సమానమని, అలాంటి స్థితిలో భక్తికి- జ్ఞానానికి తేడా లేనేలేదని, ఎందుకంటే ఏకాగ్ర భక్తి, నిష్కామ భక్తి జ్ఞానానికే దారి తీస్తాయి. గత అధ్యాయాలలో నిరాకార, నిర్గుణ స్వరూపం అయిన పరబ్రహ్మని ఏకాగ్రతతో ధ్యానించాలని తెలుసుకున్నాము. కానీ అందరికీ అది కష్ట సాధ్యమన్న భావనతో ఇలా విస్తారంగా ఆచరించటానికి వీలుగా భక్తిని ప్రబోధించి ఉండవచ్చును.

### 9వ శ్లోకం

**అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్**
**అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ**





ఒకవేళ మనస్సు నాయందు స్థిరంగా నిలుపకపోతే మరల మరల నన్ను పొందటానికి ప్రయత్నం చేయి అని, ఆకారం లేని జ్యోతిబిందువును సదా మనస్సులో నిలపటం కష్టసాధ్యం కనుక దానిని చేరుకోవడానికి ముందు కొద్దిగా సాకార విగ్రహాన్ని ఆధారం చేసుకున్నా నెమ్మది నెమ్మదిగా ఆ విగ్రహానికి కూడా ఆధారమైన సత్య స్వరూపుని తెలుసుకునే ప్రయత్నం చేయాలి. ఇలా ఈ అధ్యాయంలో అన్ని శ్లోకాల అర్థం చూసినా స్థిత ప్రజ్ఞుని లక్షణాలు కలిగిన భక్తుడు నాకు అత్యంత ప్రియమైనవాడని భగవంతుడు చెబుతున్నారు. ఈ అధ్యాయం నుండి 17వ అధ్యాయం వరకు శ్లోకాలు ఎక్కువగా ఉండకుండా తక్కువ. తక్కువ వ్రాసారు. ఎందుకంటే ఇప్పుడు చెబుతున్నవన్నీ ముందరి అధ్యాయాలలోనే చాలా వరకు వచ్చేసాయి.

### 10వ శ్లోకం

**అభ్యాసే ప్య సమర్థో సి మత్కర్మపరమో భవ**
**మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్ప్యసి**



భగవంతుని పొందే అభ్యాసం కూడా నేను చేయలేననే వారికి కనీసం భగవత్ సంబంధమైన కార్యములలోనైనా సహయోగం చేయమని చెబుతున్నాడు. ఏదోవిధంగా భగవంతుని సత్య మార్గంలోకి రావడానికి అనుకూలంగా భగవంతుడు అనేక దారులు చూపెడుతున్నాడు. కానీ అలా అయినా ఏదోలా గమ్యానికి చేరుకుంటారని అలా చెబుతున్నాడు.

## 13వ అధ్యాయము - క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగం

క్షేత్రం అంటే శరీరం అంటే పంచతత్వాల సమ్మేళనం, క్షేత్రజ్ఞుడు అంటే ఆత్మ ఇది ఆత్మకి శరీరానికి గల తేడాలను తెలియచెప్పే అధ్యాయం, నిజానికి శరీరం వేరు, ఆత్మ వేరు, ఆ సంగతి మర్చిపోయి ఆత్మ తాను అనేక జన్మల నుండి శరీరాలు మారుస్తూ, మారుస్తూ తానే ఈ శరీరం అనే భ్రాంతిలో పడిపోయి దుఃఖం, అశాంతి కోరి కొనితెచ్చుకుంది. తిరిగి ఇప్పుడు భగవంతుడు ఆత్మలైన మనందరికీ ఈ తేడాని తెలియచేస్తున్నాడు.

### 2వ శ్లోకం

**ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే**
**ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః**

ఓ అర్జునా! ఈ శరీరమే క్షేత్రం. దానిని తెలుసుకున్నవాడు క్షేత్రజ్ఞుడు అంటే ఆత్మ, శరీరంలోకి ఆత్మ ప్రవేశించి దానికి కదలిక తీసుకువస్తుంది.

ఎప్పుడైతే తిరిగి ఆత్మ బయటకి వెళ్లిపోతుందో ఇక ఆ శరీరానికి కదలిక ఆగిపోతుంది. అంటే శరీరం జడమని, ఆత్మ చైతన్యమని తెలుస్తుంది. ఈ క్షేత్రమనేది ఒక కారులాంటిది. క్షేత్రజ్ఞుడు అంటే ఆత్మ డ్రైవర్ లాంటివాడు, డ్రైవర్ లేకుండా కారు నడవదు కదా అలాగే ఆత్మ లేకుండా శరీరానికి చలనం ఉండదు.

**3వ శ్లోకం**

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత**
**క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞా నం యత్తజ్ఞానం మత మమ.**

ఈ క్షేత్రమునకు, క్షేత్రజ్ఞుడికి గల తేడా ఏదైతే జ్ఞానం చెబతుందో అదే నిజమైన జ్ఞానమని భగవంతుడు చెబుతున్నాడు.

నిజంగా దేహం వేరని, దేహి అంటే ఆత్మ వేరని తెలుసుకుంటే ఇంక అంతా తెలుసుకున్నట్లే అందుకే భగవంతుడు ఇది నిజమైన జ్ఞానం అని చెబుతున్నాడు. శరీరమే మనమనే భ్రాంతిలో ఉన్న కారణంగా శరీర సంబంధమైన దుఃఖాలు, అనుభూతులు కలుగుతున్నాయి, శరీరం వేరు, ఆత్మనైన తను వేరని జీవుడు తెలుసుకున్నప్పుడు ఈ శరీరం ద్వారా వచ్చే సుఖమైనా, దుఃఖమైనా అశాశ్వతం అని గ్రహించి సమభావనతో ఉంటాడు. ఆత్మ సంబంధమైన నిజమైన శాంతి, సుఖం, ఆనందం తనలోనే ఉన్నాయని అనుభవం చేసుకుంటాడు.

ఒకసారి రమణమహర్షుల వారి శరీరానికి ఒక పుండు ఏర్పడిందట. దానికి కొన్ని పురుగులు కూడా పట్టాయట. ఆయన వాటిని పట్టించుకోకుండా నిర్మలంగా, సంతోషంగా ఉన్నారట. ఇంతలో కొన్ని పురుగులు జారి క్రింద పడిపోతే రమణ మహర్షులవారు లేత ఆకుతో ఆ పురుగులని జాగ్రత్తగా తీసి తిరిగి తన శరీరంపైన ఉన్న పుండులో వేసారట. ఇదంతా చూసినవారు ఆశ్చర్యంతో స్వామీ – ఇదేంటి శరీరానికి ఇంత బాధ ఉంటే ఎలా నవ్వగలుగు తున్నారు? పైగా పురుగులని తిరిగి పుండులో వేసారు అని అడిగారట. దానికి ఆయన నాకెందుకయ్యా బాధ, నేను శరీరాన్ని కాదు, ఆత్మని, ఈ శరీరం నేనైతే బాధపడాలి గాని, నేను కానప్పుడు ఇంక బాధ దేనికి పైగా పాపం పురుగులు ఈ శరీరాన్ని తిని బ్రతుకుతున్నాయి. వాటి నోటి దగ్గర ఆహారం చెడగొట్టడం ఎందుకు? అందుకే తిరిగి అక్కడ వేసానని అన్నారట. ఎంత గొప్ప విషయం! నిజంగా ఆ మహాత్ముడు శరీరానికి అతీతమైన స్థితిని పొంది అలా ప్రవర్తించగలిగాడు, మనందరం అలా తయారవ్వాలి. కానీ మనం చిన్న





చీమ కుడితే దానిని కసిగా నలిపి చంపేస్తాము మన ఇంట్లోకి ఏదైనా పాము వస్తే అది అపకారం చేస్తుందో, చేయదో కూడా చూడకుండా చంపేస్తాము కారణం మనలో ఇంకా ఆత్మికస్థితి లేకపోవడమే.

**8వ శ్లోకం**

**అమానిత్వమదమ్భిత్వమహింసా క్షా న్తిరార్జవమ్**
**ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః**

**9వ శ్లోకం**

**ఇన్ద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ**
**జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్**

**10వ శ్లోకం**

**అసక్తిరనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు**
**నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపప త్తిషు.**

**11వ శ్లోకం**

**మయి చానన్య యోగేన భక్తిరవ్యభిచారిణీ**
**వివిక్తదేశ సేవిత్వమరతిర్జనసంసది.**

**12వ శ్లోకం**

**అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వ జ్ఞానార్థదర్శనమ్**
**ఏతజ్ఞా నమితి ప్రోక్తమజ్ఞానం యదతో నృథా.**

ఇక్కడ భగవంతుడు జ్ఞానం అంటే ఏమిటో చెబుతున్నాడు. తనని తాను పొగుడుకోకూడదు. గొప్పలు చెప్పుకోకూడదు. సాటి జీవులని హింసించ కూడదు. ఓర్పుతో ఉండాలి. సత్యంగా ఉండాలి. అసత్యంగా ఉండకూడదు. ఒకే భగవంతుని జ్ఞానంలో స్థిరంగా ఉండాలి. మనస్సుని అదుపులో ఉంచాలి. ప్రాపంచిక విషయాలపట్ల మనస్సుతో విరక్తి కలిగి ఉండాలి. అహంకారం ఉండకూడదు. చావు, పుట్టుకల వలన, ముసలితనం వలన, రోగం వలన వచ్చే దుఃఖాలను, దోషాలను మాటిమాటికి తలవకూడదు, భార్యా పిల్లలు, ఇల్లు, వాకిలి వీటి యందు బంధన ఉండకూడదు, మంచి జరిగినా, చెడు జరిగినా ఒకేలా ఉండాలి. భగవంతునిపై నిశ్చలమైన భక్తి ఉండాలి. మనస్సుని ఏకాంతంగా ఉంచాలి. జన సమూహాలలో తిరగాలనే కోరిక ఉండకూడదు. ఆత్మ స్మృతి కలిగి ఉండాలి. ఆత్మ జ్ఞానం యొక్క గొప్పతనం తెలుసుకోవాలి.

ఇవన్నీ జ్ఞానమార్గాలు. వీటికి వ్యతిరేకమైన వన్నీ అజ్ఞానం అని భగవంతుడు చెబుతున్నారు.

### 21వ శ్లోకం

**కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్చతే**
**పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్చతే.**

పంచతత్వ సమ్మేళనం అయిన శరీరమే సుఖ, దుఃఖాలకు కారణం అయినా, శరీరం జడమైనది కనుక ఆ సుఖదుఃఖాలు అనుభవించడానికి ఆత్మే కారణంగా చెప్పబడుతుంది. శరీరం జడం కనుక దాని ద్వారా ఆత్మే అన్ని అనుభూతులు పొందుతుంది. ఆత్మ ఉన్నంతసేపే శరీరానికి అనుభూతి ఉంటుంది. ఆత్మ వెళ్ళిపోతే ఈ శరీరాన్ని ఏం చేసినా ఉలకదు పలకదు. పాపం అయినా, పుణ్యం అయినా, సుఖం అయినా, దుఃఖం అయినా అనుభవించేది ఆత్మే. అందుకే మనకి తెలియకుండానే పాపాత్ముడు, పుణ్యాత్ముడు, మహాత్ముడు అంటూ ఆత్మనే వర్ణన చేస్తాము కానీ పాప శరీరం, పుణ్య శరీరం అనము కదా. నా మనస్సు బాగాలేదు, ఆత్మ శాంతిగా లేదు అంటాము గాని, శరీరం బాగాలేదు. శరీరానికి శాంతి లేదు అనటం లేదు కదా. దానికి రహస్యం ఇదే.

### 32వ శ్లోకం

**అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాయ మవ్యయః**
**శరీరస్థో పి కౌన్తేయ న కరోతి న లిప్యతే.**

ఆది లేనివాడు, త్రిగుణాలు లేనివాడు అగుట వలన పరమాత్మ శరీరంలో పరకాయ ప్రవేశం చేసినప్పటికీ ఏమి చేయడు. కనుక దేనిచేత అంటకుండా ఉంటాడు. భగవంతుడు మానవ ఆత్మల ఉన్నతికి, జ్ఞానం చెప్పడానికి ఒక మానవ దేహాన్ని ఆధారంగా చేసుకున్నప్పటికీ ఆ శరీరం ద్వారా భగవంతుడు కర్మ చేసినట్లు కాదు. అలాగే ప్రకృతి సిద్ధమైన వేటితోను భగవంతునికి సంబంధం లేదు.

## 14వ అధ్యాయం - గుణత్రయ విభాగం

సత్వ గుణం, రజోగుణం, తమోగుణం మూడింటి గురించి అవి జీవుడిని ఎలా సంబంధలోకి తీసుకువెళ్తున్నాయో, వాటి వలన జీవుడు ఎలాంటి ఫలితాలు పొందుతున్నాడో తెలియచెప్పే అధ్యాయం.





### 1వ శ్లోకం

**పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్**
**యజ్ఞాత్వా మునయః సర్వే పరాం సిద్ధిమితో గతాః**

దేనిని తెలుసుకుంటే ఈ మనుషులందరూ సంసార బంధన నుండి విడివడి సర్వోత్తమైన మోక్షాన్ని పొందగలరో ఆ పరమపవిత్రమైన, జ్ఞానాలలో కెల్లా ఉత్తమమైన జ్ఞానాన్ని నీకు తెలియచేస్తున్నాను. జ్ఞానాలలో కెల్లా ఉత్తమమైన జ్ఞానం మాత్రమే మానవుని సంసారసాగరం నుండి బయటకు తీయగలదని భగవంతుడు చెబుతున్నారు. భౌతికజ్ఞానం ఏదైనా సరే శరీరంలో ఆత్మ ఉన్నంత వరకు ఉపయోగపడగలదేమో గాని తర్వాత మరుజన్మలకి ఎలాంటి ప్రాప్తిని ఇవ్వలేదు. ఆత్మజ్ఞానమొక్కటే మనిషికి మోక్షం ప్రసాదించగలదు. నిజానికి మోక్షం అంటే ముక్తి దీనినే జన్మరాహిత్యం అంటారు. అలాంటి జన్మ రాహిత్యం అనేది లేనే లేదని భగవంతుడు ముందే చెప్పాడు. మరి మోక్షం అంటే ఏమిటి? ఎవరైతే భగవంతుని జ్ఞానం, యోగం ఆధారంగా తమలో యోగశక్తులని నింపుకుని సంసారబంధానికి లొంగక అతీతంగా ఉంటారో వారు సదా ముక్తులే అని భగవంతుడు చెబుతున్నారు. తామర ఆకు నీటిలోనే ఉంటుంది. కానీ దానికి నీరు అంటదు. అలాగే మనిషి సంసారంలో ఉంటూ తన విధి నిర్వర్తిస్తూ గృహస్థ ధర్మాన్ని పాటిస్తూ ఆ బంధనలో మాత్రం ఉండకూడదు ఇక్కడ కుటుంబ సంబంధంలో ఉండాలి కానీ కుటుంబ బంధంలో కాదని భగవంతుడు చెబుతున్నారు.

### 3వ శ్లోకం

**మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్**
**సమ్భవః సర్వభూతానాం తతో భవతి భారత**

గొప్పదైన ఈ ప్రకృతి నా యొక్క సర్వభూతాలకి అంటే జీవులకి స్థానం అంటే క్షేత్రం, దానిలో నేను చైతన్య స్వరూపమైన ఆత్మలను ప్రవేశపెడుతున్నాను. దానివలన సమస్త ప్రాణులు పుడుతున్నాయి. ప్రకృతి పొలం లాంటిది అయితే ఆత్మ విత్తనం అని భగవంతుడు చెబుతున్నారు. ఏ విత్తనం వేస్తే ఆ మొక్కే వస్తుంది. అదేవిధంగా సృష్టి సమతుల్యానికి భగవంతుడు అనేకానేక విధాలైన ఆత్మలను ఈ భూమిపైకి పంపించి ఈ పంచతత్వాల శరీరాలలో ప్రవేశపెడతాడు. ఆ తర్వాత వాటి వలన పునరుత్పత్తి క్రమంలో వాటి సంఖ్య పెరుగుతూ వస్తుంటుంది. ఇక్కడ బీజం అంటే ఆత్మను ప్రవేశపెడుతున్నాను అని ఉంది గాని స్వయంగా పరమాత్మ ప్రకృతిలోకి వస్తున్నట్లు లేనేలేదు.

### 5వ శ్లోకం

సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః
నిబధ్నన్తి మహాబాహూ దేహే దేహినమవ్యయమ్

ప్రకృతి వలన పుట్టినవే సత్వగుణం, రజోగుణం, తమోగుణం ఈ మూడు ఆత్మను దేహమునందు బంధించి వేస్తున్నాయి. నిజానికి ఈ మూడు గుణాలు ఆత్మకు ఆదిలో పరంధామంలో ఉన్నప్పుడు లేకపోయినా శరీరంలోకి వచ్చిన తరువాత జన్మ జన్మల పరంపరలో విడదీయలేనంతగా అంటుకుపోయాయి. ఎప్పటికైనా ప్రకృతి జడమైనదే అంతే కాదు అమాయకమైనది కూడా. ఆ ప్రకృతి ఆధారంగానే ఆత్మ మనస్సు బుద్ధి ద్వారా అన్నీ అనుభవిస్తూ తన స్థితిననుసరించి సత్వగుణ ఆత్మగా, రజోగుణ ఆత్మగా, తమోగుణ ఆత్మగా పిలవబడుతుంది. అంతేగాని త్రిగుణాతీతం అనేది ఒక్క పరమాత్మునికే సాధ్యం గాని ఇక ఏ ఆత్మకి సాధ్యం కాదు. నిజానికి ముందుగా చెప్పుకున్నట్లు మోక్షం లేదా ముక్తి అనేది ఈ భూమి మీదే ఈ శరీరంలో ఉంటూనే శరీరాలకు అతీతంగా అనుభవం చేసుకుంటూ పొందాలే గాని శరీరాలు లేకుండా ఆత్మలు ఏమి చేయలేవు. నిజంగా గతంలో ఎవరైనా ముక్తి పొందారని మనం నమ్మితే ఇలా జనాభా రోజురోజుకి పెరిగిపోదు కదా! మంచి వాళ్లందరు భగవంతునిలో లీనం అయిపోతే ఈ సృష్టిలో మిగిలేది పాపాత్ములే కదా! ఇది నిజం ఎలా అవుతుంది! భగవంతునికి ఎవరి పట్ల ద్వేషం గాని, అనురాగం గాని లేదని చెబుతున్నాడు కదా! అలాంటి భగవంతుడు కొందరిని మాత్రం తనలో ఎలా లీనం చేసుకుంటాడు! చేసుకున్నవారికి చేసుకున్నంత మహదేవ అని ఎవరు ధర్మబద్ధంగా తమ జీవితాలను గడుపుతారో వారు ఆ భగవంతుని తోడులో దేహసంబంధాలకి అంటకుండా సదా ముక్తులుగానే ఉంటారు.

### 6వ శ్లోకం

తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్ర కాశకమనామయమ్
సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ

### 7వ శ్లోకం

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గసముద్భవమ్
తన్నిబధ్నాతి కౌన్తేయ కర్మసఙ్గేన దేహినమ్



### 8వ శ్లోకం

తమస్త్వ జ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్
ప్రమాదాలస్య నిద్రాభిస్తన్నిబధ్నాతి భారత.

### 9వ శ్లోకం

సత్త్వం సుఖే సఞ్జయంతి రజః కర్మణి భారత
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సఞ్జయత్యుత

### 10వ శ్లోకం

రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా.

### 11వ శ్లోకం

సర్వద్వారేషు దేహే స్మి న్ప్రకాశ ఉపజాయతే
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత.

### 12వ శ్లోకం

లోభః ప్రవృత్తిరారమ్భః కర్మణామశమః స్పృహా
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ.

### 13వ శ్లోకం

అప్రకాశో ప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురనన్దన

### 14వ శ్లోకం

యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్
తదోత్తమవిదాం లోకానమలాన్ ప్రతిపద్యతే

### 15వ శ్లోకం

రజసి ప్రలయం గత్వా కర్మసంగిషు జాయతే
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే

### 16వ శ్లోకం

కర్మణస్సుకృతస్యాహుస్సాత్త్వికం నిర్మలం ఫలమ్
రజసస్తు ఫలం దుఃఖమజ్ఞానం తమసః ఫలమ్

### 17వ శ్లోకం

**సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ**
**ప్రమాదమోహౌ తమసో భవతో జ్ఞానమేవ చ.**

### 18వ శ్లోకం

**ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మద్యే తిష్ఠన్తి రాజసాః**
**జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః**

### 19వ శ్లోకం

**నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టా నుపశ్యతి**
**గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సో దిగచ్ఛతి**

### 20వ శ్లోకం

**గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్**
**జన్మమృత్యుజరా దుఃఖైర్విముక్తో మృతమశ్నుతే.**

### 21వ శ్లోకం

**కైర్లిఙ్గైస్త్రీన్గుణానేతానతీతో భవతి ప్రభో**
**కిమాచారః కథం చైతాం స్త్రీన్గుణానతివర్తతే.**

సత్వగుణం కలిగినవారు, రజోగుణం కలిగినవారు, తమోగుణం కలిగినవారి లక్షణాలు ఎలా ఉంటాయో భగవంతుడు చెబుతున్నాడు.

సత్వగుణం – నిర్మలమైన మనస్సుతో, ప్రకాశం కలుగచేసేదిగా అంటే జ్ఞానాన్ని తెలుసుకుని భగవంతుని పొందాలనే ఆసక్తితోను, అపకారం లేనటువంటి సుఖాన్ని పొందాలనే ఆసక్తితోను, ఆత్మను శరీరంలో బంధిస్తుందని.

రజోగుణం – ప్రకృతి సంబంధమైన కంటికి కనబడే వస్తు, వైభవాల పట్ల అనురాగం కలుగచేసి, కోరికలు పెంచుతూ వాటిని తీర్చుకోవడానికి కర్మలు చేయిస్తూ ఆత్మని పూర్తిగా బంధించేస్తుందని,

తమోగుణం – అజ్ఞానం వలన పుట్టిన ఈ తమోగుణం అన్ని జీవులకు ముఖ్యంగా మానవునికి మోహం కలుగచేస్తుంది. నాది, నా వాళ్ళు అనే బంధనకి కారణం తమోగుణమే అంతే కాక ఈ గుణం వలన సోమరితనం, పరాకు, నిద్ర మొదలైన వాటి ద్వారా ఆత్మను బంధించేస్తుందని, ఇలా వివరంగా మూడు గుణాల లక్షణాలను విపులీకరించి చెప్పారు.



### 22వ శ్లోకం

**ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాణ్డవ**
**న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాక్షితి**

### 23వ శ్లోకం

**ఉదాసీన వదాసీనో గుణైర్యో న విచాల్యతే**
**గుణా వర్తన్త ఇత్యేవ యో వతిష్ఠతి నేఙ్గతే**

### 24వ శ్లోకం

**సమదుఃఖసుఖఃస్వస్థమలోష్టాశ్మకాఞ్చనః**
**తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిన్దాత్మసంస్తుతిః**

### 25వ శ్లోకం

**మానావమానయో స్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః**
**సర్వారమ్భపరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే.**

పై శ్లోకాల అర్థం ఒక్క ముక్కలో చెప్పాలంటే ఎవరైతే తమలో ఉన్న గుణాలని ద్వేషించడం గాని, ప్రేమించడం గాని చేయక సాక్షిగా ఉండి, కోరికలు లేని కర్మ చేస్తూ ఉంటారో వారే గుణాతీతులని భగవంతుడు చెబుతున్నారు.

## 15వ అధ్యాయం - పురుషోత్తమ ప్రాప్తి యోగము

పురుషోత్తముడు అంటే పరమాత్మ ఆ పరమాత్మని ప్రాప్తింప చేసుకోవటం అంటే పొందటం ఎలా? దానివలన ఫలితం ఏమిటి అనేది చెప్పే యోగం.

### 1వ శ్లోకం

**ఊర్ధ్వమూల మధఃశాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్**
**ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్**

వ్రేళ్ళుపైకి – కొమ్మలు క్రిందగా కలిగి నాశనము లేనట్టి ఈ ప్రాపంచిక వృక్షమునకు మానవాత్మలు ఆకులు లాంటివారని అలాంటి వృక్షాన్ని గురించిన జ్ఞానాన్ని ఎవరైతే తెలుసుకుంటారో వారే యథార్థ సారాన్ని తెలుసుకున్నవారు అని మామూలుగా మనకి చెట్టు వ్రేళ్ళు క్రిందికి ఉండి, కొమ్మలు పైకి పెరుగుతాయి. కాని ఇది జీవరాశి కల్పవృక్షం, దీనికి మూలం – పరమాత్మ, పరంధామ నివాసి. అక్కడి నుండి పుట్టుకొచ్చిన ఈ సంసార వృక్షం యొక్క వ్రేళ్ళుపైనుండి క్రిందకి వచ్చాయి. తర్వాత కొమ్మలు, రెమ్మలు, ఆకులు ఇలా

పెరుగుతూ ఈ సంసారవృక్షం వచ్చింది. ఎవరైతే ఈ అనాదివృక్షం యొక్క రహస్యం తెలుసుకుంటారో వారే యథార్థమైన అర్థం తెలుసుకున్నవారు. ఈ వృక్షాన్నే కల్పవృక్షం అని అంటారు. మనలో చాలామంది కల్పవృక్షం అంటే కోరిన కోర్కెలు తీర్చేదని, అది ఎక్కడో స్వర్గంలో ఉందని నమ్ముతుంటారు. నిజానికి కల్పం అంటే సత్య, త్రేతా, ద్వాపర, కలియుగాల మొత్తం సమయాన్ని కలిపి కల్పం అంటారు. ఈ నాలుగు యుగాల జ్ఞానాన్ని తెలియచెప్పే దానినే కల్పవృక్షం అంటారు. అంటే వృక్షం ఆదిలో ఏ ధర్మం ఉండేది. కాండంలో మధ్య సమయంలో ఏ ధర్మం ఉండేది. కొమ్మలు రెమ్మలలో ఏ ధర్మాలు పుట్టుకొచ్చాయి. చివరికి ఈ వృక్షం అంతిమంలో ఎలా పెరిగిపోయి వినాశనం అయిపోయి తిరిగి క్రొత్త సృష్టి వస్తుందో తెలియచెప్పేది.

**6వ శ్లోకం**

**న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః**
**యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ**

సూర్య చంద్రులు గాని, అగ్ని గాని, ప్రకాశింప చేయలేనిది, స్వయం ప్రకాశయుక్తమైనది, పునరావృత్తి రహితమైనది ఏదైతే ఉందో అదే నా శ్రేష్ఠస్థానం. భూమిని, ఇతర గ్రహాలను సూర్యుడు ప్రకాశింపచేస్తున్నాడు. అలాగే చంద్రుడు కూడా కొద్దిగా భూమికి వెలుగునిస్తున్నాడు అలా కాకుండా రాత్రి, పగలు లేని అఖండ జ్యోతిర్మయమైన వెలుగుతో నిండి ఉండే దివ్యస్థానమే భగవానుని నివాసస్థానం, దానినే పరంధామం అంటారు. ఇది ఎరుపు, పసుపు కలిగిన బంగారువర్ణంలో ఉంటుంది. దీనిని స్థూలమైన కనులతో గాని, స్థూలమైన సైన్స్ సాధనాలతో గాని చూడలేము, ఒక్క జ్ఞాననేత్రం ద్వారానే భగవంతుని ధ్యానిస్తే మన మనస్సు అనే కంటికి అనుభూతి అవుతుంది తప్ప ఇక వేరే ఏ పద్ధతి ద్వారా దీనిని చూడలేము.

## 16వ అధ్యాయం-దైవాసుర సంపద్విభాగయోగము

దైవీ గుణాలను సంపదగా కలిగిన వారి గురించి, రాక్షస గుణాలను సంపదగా కలిగిన వారి గురించి తెలియచెప్పే యోగం.

**1వ శ్లోకం**

**అభయం సత్త్వ సంశుద్ధిర్జ్ఞాన యోగవ్యవస్థితః**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్**





**2వ శ్లోకం**

**అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాన్తిరపైశునమ్**
**దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్**

**3వ శ్లోకం**

**తేజః క్షమా ధృతిశ్శౌచమద్రోహూ నాతిమానితా**
**భవన్తి సమ్పదం దైవీమభిజాతస్య భారత.**

**4వ శ్లోకం**

**దమ్భో దర్పో భిమానశ్చ క్రోధః పారుష్య మేవచ**
**అజ్ఞానం చాభిజాతస్య పార్థ సమ్పదమాసురీమ్**

భయం లేకపోవటం (అంటే మూర్ఖత్వంతో కూడిన ధైర్యం అని కాదు, భగవంతుని తోడు వలన భయం లేకుండా ఉండటం), మనస్సులో కల్మషం లేకపోవటం, జ్ఞానయోగాలు ఆచరించడం, దానగుణం కలిగి ఉండటం, జ్ఞాన అధ్యయనం చేయడం, కపటం లేకపోవటం, ఒక్క పరమాత్మనే ఆశ్రయించడం, సత్యంగా ఉండటం, క్రోధం లేకుండా ఉండటం, త్యాగబుద్ధి, శాంత స్వభావం, దయ కలిగి ఉండటం, చెప్పుడు మాటలు చెప్పకపోవడం, విషయాల యందు ఆసక్తి లేకపోవటం, కఠినమాటలు మాట్లాడకపోవడటం, చంచలత్వం లేకపోవటం. ఓర్పు, ధైర్యం, శుభ్రత, ఎవరికీ ద్రోహం చేయకపోవటం, తనని తాను గొప్పవానిగా భావించకపోవటం మొదలైన మంచిగుణాలు దైవసంబంధమైన పుట్టుక కలిగిన మనుషులలో ఉంటాయి.

**5వ శ్లోకం**

**దైవీసంపద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా**
**మా శుచః సంపదం దైవీమభిజాతో సి పాణ్డవ**

దైవీ గుణాల వలన సంసారబంధన నుండి విముక్తి, అసురీ గుణాల వలన సంసార బంధన కలుగుతున్నాయి. ఎవరికైతే దైవీగుణాలు ఉంటాయో వారికి సంసారబంధన అంటదు. కనుక కర్మ ఫలాన్ని భగవంతునికి అర్పణ చేసి నిష్కామకర్మ చేస్తే ఇక దుఃఖం పొందవలసిన అవసరం లేదని, అలాంటి కర్మ చేసినా దుఃఖం రాదని భగవంతుడు చెబుతున్నారు.

**7వ శ్లోకం**

**ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః**
**న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే.**

రాక్షసగుణాలు కలిగిన జనులు ధర్మాన్ని రక్షించాలని, అధర్మాన్ని వదిలి వేయాలి అని గాని తెలుసుకోలేరు. వారిలో శుభ్రత, ఆచారము, సత్యము ఉండవు. శుభ్రత అంటే శరీర శుభ్రత ఒక్కటే అని కాదు, ఎందుకంటే లోపల ఎంత కల్మషం ఉన్నా పైకి స్వచ్ఛంగా కనపడేవారు చాలా మంది ఉంటారు. ఇక్కడ మనస్సు స్వచ్ఛత అని మనం గ్రహించాలి.

### 8వ శ్లోకం

**అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్**
**అపరస్పరసమ్భూతం కిమన్యత్కామహైతుకమ్**

రాక్షస స్వభావం కలవారు భగవంతుడు లేడని, ఆడా, మగా కలయిక వలనే ఈ సృష్టి అంతా నడుస్తోందని దీనికి వేరే కారణం ఏమీ లేదని చెబుతూ ఉంటారు. నిజానికి మనిషి గడిచిపోయిన క్షణాన్ని తేలేకపోతున్నాడు. రాబోతున్న క్షణాన్ని ఆపలేకపోతున్నాడు. మరణం యొక్క రహస్యాన్ని చెప్పలేకపోతున్నాడు. ఇన్ని తెలిసి కూడా భగవంతుడు లేడని అనడం నిజంగా వారి జన్మంతర సంస్కారాల వలన ఏర్పడిన అజ్ఞానమే. అందుకే వారు స్థూలానికి, సూక్ష్మానికి తేడా తెలుసుకోలేక కంటికి కనపడే దానినే నిజమనుకుంటారు.



### 10వ శ్లోకం

**కామమాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః**
**మోహాద్గృహీత్వా సద్గ్రాహాన్ ప్రవర్తన్తే శుచివ్రతాః**

రాక్షస స్వభావం కలవారు తనివి తీరని కామముతో అంటే కోరికలతో గొప్పలు చెప్పుకోవడం, నేను, నాది అనే అభిమానముతో, మదంతో అంటే గర్వంతో చెడు ఆలోచనల పట్టుదలతో అపవిత్రమైన, నీచమైన వృత్తులు ఆచరిస్తూ ఉంటారు.

ఈ రోజులలో ఎక్కువగా మనిషి తీరని కోరికలతో రగిలిపోతున్నాడు. తనని తాను గొప్పవాడిగా భావించడం, చెడు పనులు చేసేవాడికి సాయం చేయడం, మానవుడు చేయకూడని నీచ వ్యాపారవ్యవహారాలు చేయటం, జీవహింస చేయటం ఇలా ఎన్నో మనం చూస్తున్నాము. వీటన్నింటికీ కారణం వారి రాక్షస గుణాల స్వభావమే నని భగవంతుడు చెబుతున్నారు.

### 21వ శ్లోకం

**త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః**
**కామక్రోధస్తథా లో భస్తస్మాదేతత్త్రయం త్యజేత్.**





కామ, క్రోధ, లోభాలని పిలువబడే ఈ మూడు మనిషిని నరకంలోకి ప్రవేశపెట్టే గుమ్మాలు అని, అవి మనిషిని పతనం చేసి నాశనం వైపు లాక్కెళ్లతాయని వాటిని విడిచిపెట్టేయాలని భగవంతుడు చెబుతున్నారు. రెండవ అధ్యాయం - సాంఖ్య యోగంలో 62, 63 శ్లోకాలలో ఈ కోరికలు వలన మనిషి ఎలా అధోగతి పొందుతాడో ముందుగానే భగవంతుడు తెలియ చేసారు.

## 17వ అధ్యాయం - శ్రద్ధాత్రయ విభాగము

మూడు రకాలైన శ్రద్ధల గురించి తెలిపే అధ్యాయం. నిజానికి గుణత్రయ విభాగ యోగానికి, శ్రద్ధాత్రయ విభాగయోగానికి అసలు తేడాయే ఉండదు. ఇంచుమించు ఒకే లక్షణాలు కలిగి ఉంటాయి.

**మొత్తంగా చూస్తే -**

**సత్వగుణ శ్రద్ధ గలవారు :-** ఆయుష్షును పెంచేవి, మనస్సుకి, దేహానికి బలాన్ని ఇచ్చేవి, ఆరోగ్యాన్ని - సుఖాన్ని ఇచ్చేవి, రసాలు కలిగినవి, నూనె కలిగినవి, హృదయానికి ఆనందం కలిగించేవి ఇలాంటి సాత్విక ఆహారాన్ని ఇష్టపడతారు.

**రజోగుణశ్రద్ధ కలవారు :-** చేదు, పులుపు, ఎక్కువ ఉప్పు, కారం, ఎక్కువ వేడి, నూనె లేనివి, ఎక్కువ దాహం కలుగచేసేవి, మనస్సుకి, శరీరానికి దుఃఖాన్ని ఇచ్చే రజో ఆహారం ఇష్టపడతారు.

**తమోగుణ శ్రద్ధ కలవారు :-** వండిన తర్వాత చాలా ఆలస్యం అయిపోయినది, సారము లేనిది, పాడైపోయినది, దుర్గంధం అంటే చెడువాసన వచ్చేది, ఒకరు తిన్నాక మిగిలినది, భగవంతునికి నివేదక చేయనిది ఇలాంటి వాటిని తింటారు.

సత్వగుణ శ్రద్ధకలవారు - మనస్సు తృప్తితో ఫలాపేక్ష లేకుండా యజ్ఞం అంటే కర్మ చేస్తారు.

రజోగుణ శ్రద్ధ కలవారు - ఫలాపేక్షతో గొప్పల కొరకు, పేరు, గౌరవాల కోసం కర్మ చేస్తారు.

తమోగుణ శ్రద్ధ కలవారు - శాస్త్ర విధికి వ్యతిరేకంగా ఇష్టం వచ్చినట్లు, శ్రద్ధ లేకుండా కర్మ చేస్తారని భగవంతుడు చెబుతున్నారు.

## 18వ అధ్యాయము - మోక్ష సన్యాసయోగము

మోక్షం అంటే విముక్తి అలాగే సన్యాసం అంటే అన్ని కర్మలను, వాటి యొక్క ఫలితాన్ని భగవంతునికి అర్పించడం.

ఇలా గీతలోని అన్ని అధ్యాయాల సారాన్ని తిరిగి ఈ అధ్యాయంలో చెప్పడం జరిగింది. ఇది సినిమాకి క్లైమాక్స్ లాంటిది. ఎలా అయితే సినిమాలో ఆఖరున తెరమీదకు గ్రూప్ ఫోటో వస్తుందో అలా అన్నింటి విషయం ఈ చివరి అధ్యాయంలో వస్తుంది.

### 2వ శ్లోకం

**కామ్యానాం కర్మణాంన్యాసం సన్యాౕసం కవయో విదుః**
**సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః**

కోరికలు లేకుండా కర్మ చేయటం త్యాగమని, అసలు అన్ని కర్మల ఫలితాన్ని ఈశ్వరార్పణం చేయటం త్యాగమని అంటారు.

### 5వ శ్లోకం

**యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్**
**యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణామ్**

యజ్ఞం, దానం, తపస్సులు అనే కర్మలు మనిషి విడిచిపెట్టదగినవి కాదు. అవి తప్పక చేయాలి. వాటి వలన బుద్ధిమంతులకు పవిత్రత కలుగుతుంది. యజ్ఞం అంటే ఏదొక వ్రతం అని అర్థం కాదు. మనం చేసే ప్రతి మంచి పని యజ్ఞమే అవుతుంది. అలాగే దానం అంటే ఏమిటో అవి ఎన్ని రకాలో, ఎలా చేయాలో ముందు అధ్యాయాలలో మనం తెలుసుకున్నాము. ఇక తపస్సు అంటే శరీరాన్ని హింసిస్తూ, కఠోరమైన శారీరక ప్రక్రియ అని కాదు. మనస్సులో సదా భగవంతుని స్మృతి చేస్తూ ఆ పరమాత్మునితో కలయిక అంటే యోగాన్ని జోడించడమే నిజమైన తపస్సు

### 11వ శ్లోకం

**న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ శేషతః**
**యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే.**

కర్మలని పూర్తిగా విడవడం దేహాన్ని ధరించిన ఆత్మకి ఎన్నటికీ సాధ్యం కాదు. ఎవరైతే కర్మ ఫలాన్ని విడుస్తున్నారో వారే నిజమైన త్యాగి.

ఆత్మ శరీరంలో ఉండగా కర్మ చేయకపోవటం అంటూ అసలు ఉండనే ఉండదు. ఊపిరి పీల్చడం కూడా కర్మే, మాట్లాడటం కూడ కర్మే. ఇలా ఏది





చేసినా అది కర్మే అవుతుంది. కాబట్టి కర్మ సన్యాసం అనేది లేనే లేదు. కానీ ఆత్మ, శరీరం ద్వారా చేసేది సాధారణ మరియు వ్యర్థ కర్మలే. తర్వాత వికర్మలు అంటే చెడు కర్మలు ఎక్కువ చేస్తుంది. అన్నింటికంటే సుకర్మలు అంటే మంచి కర్మలు తక్కువ చేస్తుంది. కానీ భగవంతుని స్మృతితో ఎవరైతే మంచి కర్మలు చేస్తూ ఆ ఫలితాన్ని భగవంతునికి అర్పణచేస్తారో వారే త్యాగి అని పిలవబడతారు.

### 37వ శ్లోకం

**యత్తదగ్రే విషమివ పరిణామే మృతోపమమ్**
**తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మ బుద్ధిప్రసాదజమ్**

ఏ సుఖము ప్రారంభంలో విషములాగ, చివరికి అమృతంలా మారుతుందో అది స్వాతిక సుఖం, ఇది చాలా గొప్ప విషయం, మనకి భగవంతుని జ్ఞానం వినాలన్నా భగవంతునితో యోగం అంటే కలయిక జరుపుకోవాలన్నా చాలా కష్టంగా, భారంగా ఉంటుంది కాని నెమ్మదినెమ్మదిగా అభ్యాసం ద్వారా అది సహజం అయిపోయి చివరికి నిజమైన శాంతి, సుఖం ఇచ్చే అమృతంగా మారిపోతుంది కనుక అందరు స్వాతిక సుఖం కోసం ఎంత కష్టమైనా తప్పక కృషి చేయాలి.

### 38వ శ్లోకం

**విషయేన్ద్రియసం యోగాద్యత్తదగ్రే మృతోపమమ్**
**పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్**

ఏ సుఖము మొదట అమృతంలా ఉండి చివరికి విషంలా మారుతుందో అది రాజస సుఖం, మనిషి యవ్వనంలో ధనంతో, శారీరక పటుత్వంతో, విషయవాంఛలతో మునిగి తేలి చివరికి వాటి వలన వచ్చే బాధలను తట్టుకోలేక దుఃఖాన్ని అనుభవిస్తున్నాడు. ఎంతో మంది వంటి బలం ఉన్న రోజుల్లో రకరకాల రుచులతో కూడిన ఆహారం తిని వయస్సు మళ్ళే కొలది వాటివలన వచ్చే మూలశంక, షుగరు, బి.పి. మొదలగు రోగాల వలన బాధలు అనుభవిస్తున్నారు. మరి కొందరు వయస్సు వేడిలో దేనినీ లెక్కచేయక వ్యభిచారంలాంటి చెడుపనులు చేస్తూ ఆ ఫలితాన్ని అనేక సుఖరోగాల రూపంలో నరకం అనుభవిస్తున్నారు. ఇదివరకైతే చేసిన తప్పుకి శిక్ష కొద్దిగా ఆలశ్యంగా అనుభవం అయ్యేది కాని ఇప్పుడు కాలం దగ్గర పడుతున్న కొలదీ వెంట వెంటనే రకరకాల క్రొత్త క్రొత్త రోగాల పేరుతో మనిషి క్షణక్షణం చస్తూ బ్రతుకుతున్నాడు. దానికి కారణం మన ఇష్టం వచ్చినట్లు మనం ప్రవర్తించడమే.

## 39వ శ్లోకం

**యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహనమాత్మనః**
**నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్.**

నిద్ర, సోమరితనం, అజాగ్రత్త వలన కలిగే సుఖం తామససుఖం, తామసం అంటే అజ్ఞానం, చీకటి. ఇది ఎంత చెడ్డదంటే మనిషి తన యథార్థమైన శక్తిని మరిచిపోయేలా చేస్తుంది. ఎంత తెలివైనవాడైనా అతినిద్రకి, బద్ధకానికి బందీ అయితే వాడు దేనికీ పనికిరాకుండా పోతాడు.

ఈ బద్ధకం ఎలాంటిదంటే – ఓ రాజుగారు నిజమైన బద్ధకస్తుడెవరో తెలుసుకోవాలని తన రాజ్యంలో ఉన్న బద్ధకస్తులందరినీ తన రాజాస్థానానికి తీసుకురమ్మని భటులను ఆజ్ఞాపించారు. వారు వెళ్ళి రాజ్యమంతా వెతికి బద్ధకస్తులందరినీ ఏరి రాజుగారి ముందు కూర్చోపెట్టారు. వాళ్ళందరినీ చూసి మీలో బద్ధకస్తులెవరో చేతులెత్తండి వాళ్ళకి బహుమానం ఇస్తానని అన్నాడట. దానికి అందరూ చేతులు ఎత్తారు. ఒకడు మాత్రం చేయి ఎత్తకుండా కూర్చున్నాడు. దానితో రాజుగారికి ఆశ్చర్యం వేసి నువ్వు ఎందుకు చేయి ఎత్తలేదు? అని అడిగారట. దానికి వాడు నేను చెయ్యి కూడా ఎత్తనండి, అనవసరంగా నాకు శ్రమ అన్నాడట. ఈ భూమి మీద అంత బద్ధకస్తులు ఉన్నారు. వీళ్ళలాంటి వాళ్ళకు గుర్తుగానే కుంభకర్ణుని పాత్రను సృష్టించి మన పూర్వీకులు నీతిని బోధించారు. మనిషికి నిద్ర ఎంత అవసరమో అతినిద్ర కూడా అంత ప్రమాదకరం. అది సమయాన్ని, మేధస్సుని కూడా నిద్రలోనే పోగొట్టేస్తుంది. మనిషిని ఎందుకు ఉపయోగపడని బండరాయిలా మార్చేస్తుంది.

## 40వ శ్లోకం

**న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః**
**సత్త్వం ప్రకృతి జైర్ముక్తం యదేభిస్స్యాత్త్రి భిర్గుణైః**

సత్త్వ, రజో, తమోగుణాలు లేని వస్తువు లేదా పదార్థము భూమిపై గాని, స్వర్గంలో కాని, దేవతలలో కాని ఎక్కడా లేదు. అంటే ఈ మూడు గుణాలు తప్పక ఉంటాయి. కాకపోతే సత్త్వగుణం ఉన్నవారిలో రజోగుణం, తమోగుణం తక్కువగా ఉంటాయి. రజోగుణం ఉన్నవారిలో సత్త్వగుణం బాగా తక్కువ, తమోగుణం కొద్దిగా ఎక్కువగా ఉంటాయి ఇక తమోగుణం ఉన్నవారిలో సత్త్వగుణం అసలు ఉండదు. రజోగుణం కూడా కొద్దిగా ఎక్కువగానే ఉంటుంది. వీటన్నింటికీ అతీతుడు – భగవంతుడు ఒక్కడే.





## 41వ శ్లోకం

**బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరన్తప**
**కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః**

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు వారి వారి స్వభావముల వలన పుట్టిన గుణముల బట్టి కర్మలు వేరువేరుగా విభజింపబడినవి.

ఇక్కడ 4 రకాల వర్ణాల వారికి ఏ కర్మలు వారు చేయాలో వేరు వేరుగా చెప్పబడ్డాయని చెప్పారు. నిజానికి భగవంతుని దృష్టిలో ఈ బేధాలనేవి లేనేలేవు. నిజంగా భగవంతుడు మానవులని ఇలా వర్ణాల వారిగా విభజిస్తే ఆయన భగవంతుడు ఎలాఅవుతారు? నిజానికి ఇక్కడ వర్ణం అన్న మాటకి మనిషి చెప్పే అర్థం కల్పితమే. నిజానికి గుణాన్ని బట్టే వర్ణం తప్ప పుట్టకతో వచ్చే వర్ణం అనేది నిజంకాదు. తల్లి నిజం–తండ్రి నమ్మకం అన్నమాట ఎలా అయితే నిజమైనదో అలాగే గుణాలతో వచ్చే వర్ణమే నిజమైనదని భగవద్గీత చెబుతుంది. మన జీవితంలో పెద్ద కులాలవారు, చిన్న కులాలవారు అంటూ ఎన్నోరకాల బేధాలు మనం చూస్తున్నాము. నిజంగా గీతలో కూడా 4 వర్ణాల గురించే చెప్పారు కానీ ఈనాడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య మూడువర్ణాల తరువాత శూద్రవర్ణాన్ని అనేక వందల కులాలుగా విభజించారు. ఇలా ఈ వర్ణవ్యవస్తే నిజం అయితే కొంతమందిని మీరు హాయిగా కాలు మీద కాలు వేసుకుని కబుర్లు చెబుతూ బ్రతకండి, మరికొంతమందిని అధికారాలు, పదవులు పొంది పెత్తనం చెలాయించండి, కొంత మందిని డబ్బు బాగా సంపాదించి సుఖాలు పొందండి, మిగతావారు గొడ్డుల్లాగా చాకిరీ చేస్తూ పైవాళ్ళను సుఖపెట్టండని భగవంతుడు చెప్పారా? అలా అయితే ఆయనకి జాలి, దయ లేవా? నిజానికి ఈ వర్ణవ్యవస్థ అనేది ఒక యుగానికి సంబంధించినది కాదు. ఇది మొత్తం కల్పం (సత్య,త్రేతా,ద్వాపర,కలియుగాలు) అంతటికీ సంబంధించి నది. ఈ రహస్యాన్ని ఇప్పుడు తెలుసుకుందాము.

కల్పంలో మొదటిది అయిన సత్యయుగంలో దేవతాధర్మం ఉండేది. అక్కడ అందరూ దైవీగుణాలుకలిగి మర్యాద, మన్ననలతో ఉండేవారు. ఆ యుగంలోను వ్యవసాయదారులు, కమ్మర్లు, కుమ్మర్లు, చాకళ్లు ఇలా అనేకానేక పనులు చేసేవారు ఉండేవారు. అది వారికి వృత్తే గాని కులం (వర్ణం) కాదు. అక్కడ అంతా దేవతలే. ఎవరిపని వారు ప్రేమతో, ఆనందంతో చేసేవారు సంపూర్ణమైన పవిత్రతతో ఉండేవారు. ఇక త్రేతాయుగంలో – క్షత్రియధర్మం ఉండేది అక్కడపైన చెప్పిన వృత్తులవారు ఉండేవారు. కానీ అందరు క్షత్రియులే. ధర్మం 3 పాదాలు నడిచేది.

ద్వాపరయుగం వచ్చేసరికి ధర్మం సగానికి సగం తగ్గిపోయి 2 పాదాలు నడవటం మొదలుపెడుతుంది. అప్పటి వరకు ప్రేమ, గౌరవంతో ఉన్న ఆత్మలు ఈ యుగం నుండి స్వార్థం, లాభం, నష్టం ఇలా ఆలోచనలతో బ్రతకడం మొదలుపెడతారు. అంటే వ్యాపార ధోరణి మొదలవుతుంది. అందుకే ఈ యుగంలో వైశ్య ధర్మం నడుస్తుంది. ఇక్కడ అన్ని వృత్తులువారు ఉన్నా అందరు వైశ్యులే. చివరికి కలియుగంలో ధర్మం పూర్తిగా తగ్గిపోయి ఒంటికాలి మీద నడుస్తుంది. ఇప్పుడైతే కుంటికాలి మీద నడుస్తోంది. అది మనందరికీ తెలుసు ఈ యుగంలో అందరిలోను శూద్రగుణాలు ఎక్కువగా ఉన్నాయి. కనుక అందరు శూద్రులే. ఇప్పుడు ఏ కులం వారు ఆ వృత్తి చేయడం ఎక్కడ ఉంది. ధనమే మూలంగా మనిషి ధన సంపాదన కోసం ఎంత నీచమైన పనికైనా దిగజారు తున్నాడు. అలా శూద్రపనులు చేస్తూ శూద్రునిగా మారతాడు.

ఇంత వరకు మనం దేవత, క్షత్రియ, వైశ్య, శూద్రుల గురించి తెలుసు కున్నాం. కానీ ముందు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర కూలాలు అని చెప్పుకున్నాము ఈ బ్రాహ్మణులు, దేవతలకు గల సంబంధం ఏమిటి?

నిజానికి మనందరం మనలో ఉన్న అసురీగుణాలను బట్టి శూద్రులమే. ఇది ముమ్మాటికీ నిజం. కానీ ఎవరైతే ఈ సమయంలో తమ చెడ్డ గుణాలని విడిచిపెట్టి పరబ్రహ్మ పరమాత్ముని దివ్యజ్ఞానం ద్వారా మంచిగా మారతారో వారే నిజమైన బ్రాహ్మణులు, అలా బ్రహ్మజ్ఞానం ద్వారా బ్రాహ్మణులుగా మారిన వారే ఈ సృష్టి అంతిమ సమయంలో కూడా భగవంతుని స్మృతిలో ఉంటూ శరీరాలు విడిచిపెట్టి తిరిగి సత్యయుగంలో దేవతలుగా జన్మతీసుకుంటారు. ఇదే బ్రాహ్మణులకి, దేవతలకి సంబంధం, బ్రాహ్మణునిగా కాలేనివాడు ఎన్నటికీ దేవతగా కాలేడు. దేవతలకి కిరీటం గుర్తుగానే బ్రాహ్మణులకి పిలక చూపిస్తారు.

మనందరం పుట్టుకతో వచ్చిన వర్ణాల గురించి అసలు వాదులాడుకో వద్దు. అవన్నీ మానవ కల్పితాలే. మనలో ఉండే గుణాలని బట్టి మనం ఏ వర్ణం వారిమో తెలుసుకుని అందరు బ్రాహ్మణులుగా మారే తీవ్ర ప్రయత్నం చేయాలి.

ఎవరైతే బ్రహ్మజ్ఞానం తెలుసుకుని ఆచరిస్తారో వారే బ్రాహ్మణులు

ఎవరైతే ధర్మరక్షణార్థం క్షాత్రాన్ని కలిగి ఉంటారో వారే క్షత్రియులు

ఎవరైతే లాభ, నష్టాలు లెక్కలు చూసుకుని కర్మ చేస్తారో వారంతా వైశ్యులే.



ఎవరైతే ధర్మ విచక్షణ లేకుండా ఎదుటివారికి దుఃఖం ఇచ్చే కర్మ చేస్తారో వారంతా శూద్రులే ఇక చాలా వరకు మిగతా 17వ అధ్యాయాలలో ఉన్న విషయాలనే తిరిగి తిరిగి చెప్పారు.

### 65వ శ్లోకం

**మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు**
**మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియో సి మే.**

నా యందే మనస్సు నిలిపి, భక్తి, కలిగి నాకు నమస్కరించు నన్నే ఆరాధించు అప్పుడు నీవు నన్నే పొందగలవు. నువ్వంటే నాకెంతో ఇష్టం కనుక యథార్థాన్ని నీకు ప్రతిజ్ఞచేసి చెబుతున్నాను. ఎవరైతే పైన చెప్పిన విధంగా భగవంతుని మనస్సు ద్వారా పూజిస్తారో వారు ఆ భగవంతుని తప్పక పొందుతారు. ఇది స్వయంగా భగవంతుని ప్రతిజ్ఞ కనుక మనందరం ఒకే స్థితిలో మనస్సు చలించకుండా పరమాత్ముని దివ్య జ్యోతిస్వరూపాన్ని స్మృతి చేస్తే తప్పక ఆ భగవంతుని పొందుతాము.



### 73వ శ్లోకం

**నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయా చ్యుత**
**స్థితో స్మి గత సందేహః కరిష్యే వచనం తవ**

పరమేశ్వరా! నీ అనుగ్రహము వలన నా అజ్ఞానము తొలగిపోయింది. ఆత్మజ్ఞానం కలిగింది. అనుమానాలు అన్నీ తీరిపోయాయి. ఇక నీవు చెప్పినట్లు చేస్తాను. ఇవి భగవంతుని దివ్యజ్ఞానం విన్న అర్జునుని పలుకులు, నిజానికి ఆ అర్జునుడు ఎవరో కాదు. మనమేనని ముందుగానే తెలుసుకున్నాము. కనుక మనందరం మనలో ఉండే సంశయాలన్నీ విడిచిపెట్టి భగవంతుని ఆజ్ఞప్రకారం ఆ పరమాత్ముని జ్ఞానం ఆధారంగా మన జీవితాలను సఫలం చేసుకోవాలి.

### 78వ శ్లోకం

**యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః**
**తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మను**

ఎచ్చట యోగేశ్వరుడైన శ్రీ కృష్ణుడు (సృష్టికర్త శివపరమాత్మ) ఎక్కడ ధనుర్ధారి అయిన అర్జునుడు ఉంటారో అక్కడ సంపద, విజయము, ఐశ్వర్యము, గొప్పదైన నీతి ఉంటాయి. ఎవరైతే భగవంతుని తోడులో జ్ఞాన బాణాలు ధరించి ఉంటారో అక్కడ జ్ఞాన సంపద, విజయం అంటే సఫలత, శాంతి

సుఖం ఇచ్చే ఐశ్వర్యం, నిశ్చయమైన నీతి తప్పకుండా ఉంటాయని భగవంతుడు స్వయంగా చెబుతున్నారు. ఇక ఈ ప్రయత్నం ముగించే ముందు ఒక చిన్న విషయం మీకు తెలియ చేసుకుంటున్నాము.

ఓ రాజుగారు ఉదయం వేళ పళ్ళు తోముకుని తాటిఆకుతో నాలుక గీసుకుం టుంటే అది జారి క్రింద పడిపోయిందట. అది ఓ పనివాడు చూశాడు. వాడు ఇంటికి వెళ్ళి తన భార్యతో ఏమేవ్ ఈ రోజు ఏం జరిగిందో తెలుసా? మన రాజుగారి నోట్లోంచి నాలుక గీసుకునే తాటాకు జారిపడిపోయిందని చెప్పాడు. ఆవిడ తర్వాత పక్కింటి ఆవిడతో వదినా ఈ విడ్డూరం విన్నారా? మన రాజుగారి నోట్లోంచి తాటాకు పడిందట అని చెప్పింది. ఆవిడ వేరే వారికి కొంచెం అతిశయం కలిపి రాజుగారి నోటిలోంచి తాటాకులు పడ్డాయని చెప్పింది. ఇలా ఆ నోటా, ఆ నోటా విషయం మారిపోయి చివరికి రాజుగారి నోట్లోంచి తాటాకులు తెగపడిపోతున్నాయని జనంలో పుకారు వచ్చేసింది. కొందరైతే ఎడ్లబళ్ళు కట్టుకుని రాజుగారి ఇంటికి బయలు దేరారట. ఆకులు తెచ్చుకుందామని, ఇది ఎందుకు చెప్పామంటే నిజానికి యథార్థం ఆవగింజంత అయితే కల్పితం ఆకాశం అంత అయిపోతుందని, స్వయంగా భగవంతుడు ఈ సృష్టిలో ఆత్మ పరమాత్మ ఈ రెండే శాశ్వతం మిగతా అంతా కల్పితం అని చెబుతున్నాడు. భగవంతుడు గురించి వర్ణనచేస్తూ కోటి సూర్యుల తేజోమయుడు అంటారు. నిజానికి ఒక సూర్యుడినే మనం తిన్నగా చూడలేము కదా! అలాంటిది కోటి సూర్యుల కాంతి గల భగవంతుని ఎలా తెలుసుకోగలము. చూడగలము? దీని యొక్క అంతరార్థం ఏమిటంటే ఆకాశంలో కనపడే నక్షత్రాలన్నీ సూర్యులే, అలాగే మానవులలో కూడా తమ జ్ఞాన ప్రకాశంతో వెలుగొందే ఆత్మలు కూడా జ్ఞాన సూర్యులే. ఇలా కోట్ల మందిని సృష్టించిన భగవంతుని శక్తి గురించి అలా వర్ణన చేసారు. ఇంకా సృష్టికి సంబంధించిన దేవతల విచిత్ర రూపాలకు సంబంధించిన జ్ఞానం ఎంతో ఉంది. వాటికి అంతరార్థం కూడా ఉంది. అదంతా ఇప్పుడు మనం చెప్పుకోవాలంటే సమయం, జాగా కూడా సరిపోదు. భగవంతుని స్మృతిలో మేము అందిస్తున్న ఈ పుస్తకంలో విషయాలు మీకు నచ్చితే భగవంతునికి యధార్థమైన రీతిలో దగ్గర అవ్వండి. తప్పులుంటే మరోసారి మన్నించండి.

**వేద శాస్త్రాలు తెలిసిన – బ్రాహ్మణుడైనా,**
**యజ్ఞయాగాలు చేసిన – సోమయాజైనా,**





**ఉదయాన్నే తప్పక స్నానం చేసే – పవిత్రుడైనా,**
**ఎప్పుడూ మంచి పనులనే చేసే – సజ్జనుడైనా,**
**ఉపవాసాలు చేయువాడైనా – సన్యాసి ఐనా,**
**దాన, ధర్మాలు చేసినవాడైనా,**
**ఎన్నిచేసినా సరే “గర్వం”తో**
**భగవంతుని తెలుసుకోకపోతే అతని జన్మవ్యర్థం.**

– నరసింహశతకం

## సృష్టికర్త భగవాన్ కళ్యాణకారి శివపరమాత్మచే తెల్పబడిన సృష్టి రహస్యములు




ఇందు సృష్టి యొక్క ఆదిమధ్యాంత రహస్యములు, కర్మలయొక్క గుహ్యగతి, జ్ఞానరాజయోగములు ద్వారా నరుని నుండి నారాయణుడిగా నారి నుండి శ్రీలక్ష్మిగా తయారయ్యే విధి, నిత్యము వసంతఋతువుగా ప్రకృతి తయారయ్యే విధి, కర్మక్షేత్రమైన ఈ భూమి మీదే అతి త్వరలో స్వర్గస్థాపన చేసే విధి మొదలగు విషయాలు శివపరమాత్మచే తెలియజేయబడుచున్నది.

**భగవంతుని రూపము** – అణువంత ఆకారముతో ప్రకాశం కలిగి వుంటారు. ఆ దివ్యమైన జ్యోతిర్మయ రూపమును గాంచుటకు దివ్యమైనబుద్ధి

అవసరము. ఈ భూలోకములో నిరాకారుడైన పరమాత్మను హిందువులు శివుడు అనే పేరుతో శివలింగము రూపములోను, ముసల్మానులు అల్లా అనే పేరుతో మక్కాలో లింగాకారములోన్ను సంగ్-ఎ-అశ్వద్ అనే శిలారూపము లోను, క్రైస్తవ మతస్థులు యోహోవా అనే పేరుతో క్రొవ్వొత్తు (వెలుగు) రూపములో ఆరాధిస్తున్నారు.

**భగవంతుని నామము** - సదాశివ. సదా అనగా ఎల్లప్పుడు, శివ అనగా కళ్యాణకారి కానీ ఇది ఏ మతానికి చెందిన నామం కాదు. ఇది కళ్యాణకారి నామం. (కర్తవ్యాన్ని తెలిపే నామము)

**భగవంతుని నివాసము** - ఈ సాకార మనుష్యలోకమునకు పైన సూర్య, చంద్ర, నక్షత్రమండలాలపై, రాత్రింబవళ్ళు లేనటువంటి, ధ్వని లేని అఖండ జ్యోతిర్మయ బంగారు వర్ణము గల ధామమే పరమాత్ముని శాశ్వత నివాసము దీనినే పరంధామము అంటారు.

**శివపరమాత్మను గుర్తించే విధానం:** 1. శివపరమాత్మ స్వయం భువు, స్వయంగా జన్మ తీసుకున్నారు, ఆయనకు జన్మనిచ్చే తల్లి తండ్రి ఎవరు లేరు కనుక ఆ పరమాత్మనే తల్లివి, తండ్రివి నీవే అని అందరూ స్తుతిస్తారు. 2. జనన మరణ చక్రంలో వచ్చేవారిని పరమాత్మ అని స్తుతించరు. పరమాత్మ మానవునిగా గాని, దేవతగా గాని, ధర్మపితగా గాని సాధుసన్యాసిగా గాని జన్మించరు. 3. శివ పరమాత్మ అయోనిజుడు. మానవులు, దానవులు, దేవతలు, ధర్మపితలు మాత్ర గర్భములో పెరిగి జన్మిస్తారు. కానీ భగవంతుడు ఏ మాతృగర్భంలోను పెరిగి జన్మించరు. 4. శివపరమాత్మ జనన చక్రములోనికి రానందువలన అతనికి మరణము లేదు. శివపరమాత్మ ఒక్కడే మృత్యుం జయుడు. కాబట్టి శివపరమాత్మ అజన్మ. 5. శివపరమాత్మకి బాల్య, యౌవన, వార్ధక్య మరణాలు లేవు. స్థూల, సూక్ష్మ శరీరాలు లేనివాడు కనుక శివపరమాత్మ అశరీరి 6. శివపరమాత్మ జ్యోతిర్బిందు స్వరూపుడు. ఆ భగవంతుని స్థూల కన్నులద్వారా గానీ, ఎటువంటి సూక్ష్మదర్శని యంత్రాలతో గానీ చూడజాలము. ఏ కర్మేంద్రియాలు లేకపోయినా కాని ఆయన సర్వ కార్యసాధన చేయగలవాడు. అతడు అన్నింటిని చూస్తూ కూడా చూడనట్టు అతీతంగా ఉండేవాడు, కాబట్టే అతనిని అవ్యక్తుడు అంటారు. 7. శివపరమాత్మ అభోక్త, దేవతలు తమ పుణ్యఫలంగా సుఖాలను అనుభవిస్తారు. మానవులు, దానవులు పాప - పుణ్యాలను, సుఖ-దుఃఖాలను, శీతోష్టములు, ఆకలి-దప్పికలను, చావు-పుట్టుకలను అనుభవిస్తారు. ఒక్క శివపరమాత్మ మాత్రం ఆకలిదప్పికలు,





నిద్రావస్థలు, చావుపుట్టుకలు మొదలగు వాటిని ఎప్పటికీ అనుభవించరు. 8. శివపరమాత్మ సమస్త సృష్టి స్థితి లయాలకు మూలకారకుడు. ఈ సృష్టి ఆదిమధ్యాంతాలు కూడా పరమాత్మకే తెలుసు. సృష్టిలోని సకల చరాచరములు, సమస్త కర్మలు ఆయా కర్మలకు తగిన ఫలాలు తెలిసినవాడు శివ పరమాత్మ ఒక్కరే. శివపరమాత్మకెవరూ గురువు, శిక్షకుడు లేరు. ఈ జగత్తు కంతటికీ ముక్తి - జీవన్ముక్తినిచ్చే సత్య శిక్షకుడు, సద్గురువు శివపరమాత్ముడే. అందుకే సర్వజ్ఞుడైనాడు. అనగా సర్వం తెలిసినవాడు. 9. పరమాత్మ సర్వశక్తి వంతుడు. ప్రతీ ఆత్మకు వారి వారి కర్మలకు తగిన ఫలితాన్ని ఇచ్చేవాడు భగవంతుడు ఒక్కడే. ఈ విశాల విశ్వంలోని సముద్రాన్ని సిరాగా చేసుకుని, భూమిని, ఆకా శాన్ని పుస్తకాలుగా మార్చి భగవంతుని మహిమ వ్రాసినప్పటికీ సరిపోదు. సర్వశక్తిసాగరుని మహిమను పూర్తి చేయలేరు. సదా పవిత్రుడు శివభగవానుడు సృష్టిలో ఒక్కడే. శాశ్వతముగా పూజింపబడేవాడు శివుడు కళ్యాణకారి. మత ప్రవక్తలు, మహాత్ములు, సాధు సన్యాసులు వీరందరూ లోకకళ్యాణార్థమై భగవంతుని పరిచయాన్ని వివిధ మార్గములలో కొంతవరకు తెలియజేసినారు.

**శివపరమాత్ముని మూడు దివ్య కర్తవ్యములు** - భగవంతుని దివ్య కర్తవ్యములు : స్థాపన - పాలన - వినాశనము, బ్రహ్మకు సృష్టి కార్య సామర్థ్యము, విష్ణువుకు పాలనా దక్షత, శంకరునకు వినాశనా కార్యమును, సరస్వతికి విద్యా గాంభీర్యమును, దేవి దేవతలకు ఆయా పదవులను ఇచ్చువాడు దేవాదిదేవుడు పరమాత్మ శివుడు ఒక్కరే. అతడు సమస్త మానవ జాతికి పరమ పిత. అతనికెలాంటి వ్యక్తిగత విశేష సంబంధాలు లేవు. జీవుల జనన మరణాలతో అతనికెలాంటి సంబంధం కూడా లేదు. ఎవరు చేసుకున్న కర్మకు వారే బాధ్యులు. సత్కర్మలు చేస్తే సంతోషము, ఆనందము అనుభవిస్తారు. పాప కర్మలు చేస్తే కష్టం, దుఃఖం అనుభవిస్తారు. పతితులను పావనం గావించుటయే పరమాత్ముని ముఖ్య కర్తవ్యము. అతడు పరమ పావనమైన నూతన దైవీ సృష్టిని స్థాపిస్తారు. నీతి నిజాయితీలు మంట కలిపి విశ్వం అంతటా పాపం పెరిగిపోయి తమోప్రదానమైన పతిత కలియుగాంతమున అవతరించి సత్యయుగమును భగవంతుడు నెలకొల్పుతాడు. అది ఇప్పుడు జరగనున్నది. మానవాళికి గొప్ప విపత్కర పరిస్థితి రానున్నదని శివ పరమాత్మ తెలియజేయుచున్నారు. అగ్రరాజ్యాలు భయంకరమైన అణుయుద్ధం ద్వారా వినాశనమైతే, భారతదేశమునందు, అంతఃకలహాలు, ప్రకృతి వైపరీత్యాల ద్వారా వినాశనం జరుగును. ఈ విపరీత స్థితులను అచంచలమైన ధైర్యోత్సాహములతో

ఎదుర్కొ గల శక్తి సామర్థ్యాలు, చిత్త స్థైర్యము ఒక్క పరమాత్మ దివ్యస్మృతిచేతనే లభిస్తాయి. కావున ఆ పరమపిత శివ పరమాత్మని ప్రేమతో స్మృతించుటయే శరణ్యం. ఇదే ముక్తి-జీవన్ముక్తులకు మార్గం. ప్రజాపిత బ్రహ్మాకుమారీ ఈశ్వరీయ విశ్వ విద్యాలయము 1937వ సంవత్సరములో స్వయముగా శివ పరమాత్మునిచే స్థాపించబడినది. ఈ సంస్థ దేశ విదేశాలలో సుమారుగా 8,000 శాఖోపశాఖ లుగా విస్తరించి ఈశ్వరీయ జ్ఞాన - యోగములలో ఉచిత శిక్షణను ఇస్తున్నది. ఈ విధముగా శివపరమాత్మ సత్యయుగ స్థాపన చేస్తున్నారు.ఈ సంస్థలో అందరూ కూడా భగవంతునికి పరికరములు తప్ప అధికారులు కాదు. సర్వ అధికారి శివ పరమాత్మయే. ఈ సృష్టిలో ప్రతి వస్తువునకు గుణము-రూపమును బట్టి నామము ఏర్పడినది. అదేవిధముగా భగవంతుడు అనగా అజన్మ (జనన - మరణ చక్రములోనికి రానివారు), అభోక్త (సుఖదుఃఖాతీతుడు), అశరీరి (స్థూల,సూక్ష్మశరీరములేనివారు) ఈ మూడు గుణములు గల వాడే భగవం తుడు. నీవు ఎవరు? ఎక్కడి నుండి వచ్చావు? తిరిగి ఎక్కడికి వెళ్ళాలి? అనే విషయాల యొక్క యథార్థ జ్ఞానాన్ని శివపరమాత్మ తెలియజేస్తున్నారు. నీవు శరీరము కాదు, ఒక ఆత్మవు, పరంధామము నుండి వచ్చి పాత్రను అభినయించి మరలా మూలనివాసము పరంధామమునకు చేరుకుంటున్నావు.



**ఆత్మ అనగానేమి?** ఆత్మ ఈ శరీరములో కనుబొమల మధ్య విరాజమానమైన చైతన్య జ్యోతిర్బిందు స్వరూపము. మెరిసే నక్షత్రం లాంటిది. భక్తులు తిలకము కనుబొమల మధ్య పెట్టుకునే కారణం ఇదే. ఆత్మ యొక్క ఆలోచనాశక్తిని-మనసు అని, నిర్ణయశక్తిని బుద్ధి అని, చేసే కార్యం లేదా అలవాటుని-సంస్కారం అని అంటారు. ఆత్మ శరీరము ద్వారానే అనుభవిం చును. భౌతికమైన ఈ శరీరము నీరు, గాలి, భూమి, ఆకాశము, అగ్ని అనే పంచ తత్వాలతో ఏర్పడినది అనే విషయము అందరికీ తెలిసినదే. ఆత్మయే ఆలోచన చేసి, నిర్ణయించుకుని చేసిన కర్మల అనుసారంగా సంస్కారాన్ని కలిగి ఉంటుంది. ఆత్మ నిర్లేపి కాదు. సుఖదుఃఖాలకు అతీతమైనది కాదు. ఆత్మలోనే మొదట సంకల్పం కలిగి మెదడు-నాడుల ద్వారా వ్యక్తమవుతుంది. ఆత్మయే సుఖశాంతులను, అశాంతి దుఃఖములను అనుభవిస్తుంది. కానీ ఈనాటి మానవుడు తాను ఆత్మనని మరిచి నేను ఈ దేహాన్ని అని దేహాభిమానులు కావటమే ఈ దుఃఖాలకు మూల కారణము. ఆత్మ ఎన్నటికీ చనిపోదు. ఆత్మ అనాది, అవినాశి. అది ఒక శరీరము వదిలి మరొక శరీరమును ధరిస్తుంది. ఆత్మలన్నీ జనన-మరణ చక్రంలోనికి రావలసిందే. ఆత్మ,





పరమాత్మలో లీనం అవ్వదు. అలాజరిగితే చివరికి పరమాత్మ ఒక్కరేఉంటారు. అప్పుడు సృష్టి ఏది?

**ఆత్మ యొక్క అసలు నివాస స్థానం - పరంధామము.** దీనినే పరలోకం లేదా శాంతిధామం అని కూడా అంటూ ఉంటారు. ఈ పరం ధామము-సూర్య చంద్ర నక్షత్ర మండలాలకు పైన ఉన్న సూక్ష్మలోకానికి కూడా దాటి ఆపైన ఉంటుంది. ఈ ధామం పసుపు - ఎరుపు కలిసిన బంగారు వర్ణం కలిగి ఉంటుంది. ఆ పరంధామమునందు ఆత్మలన్నీ నివసి స్తాయి, క్రమముగా నిర్ణీత కాలానుగుణముగా భూమిపై అవతరించి శరీరమనే వస్త్రాన్ని ధరించి పాత్రను అభినయించును. ఈ ఆత్మల సమూహమునకు పైన సర్వోన్నత శిఖరముపైన శివపరమాత్మ నివసించును. ఆ పరమపితనే శివుడు అని, యెహోవా అని, అల్లా అనే విభిన్న నామములతో పిలిచెదరు.

## భగవంతుడైన శివపరమాత్మచే చెప్పబడిన ఆత్మల జన్మలు మరియు యుగములు రహస్యములు

ఆత్మ అవినాశి, సూక్ష్మమైనది మరియు చైతన్య శక్తి స్వరూపం. శరీర ములో భ్రుకుటి మధ్యలో (తిలకం ధరించే స్థానం) ఉండి శరీరాన్ని నడిపిస్తుంది. ఆత్మ ఎక్కువలో ఎక్కువ 84 జన్మలు, తక్కువలో తక్కువ ఒక జన్మ ప్రతీకల్పంలో (5,000 సం.లు) తీసుకుంటుంది. ఆత్మల మూల నివాసము సూర్య చంద్ర నక్షత్రమండలాలకు పైనగల పరంధామము. ప్రతీ ఆత్మ నిర్ణీతకాలానుగుణంగా ఈ సృష్టి అనే జగన్నాటకముపైకి వచ్చి తమ పాత్రలను అభినయిస్తాయి. అనాదిగా నిశ్చితమైన ఈ సృష్టి నాటక చరిత్ర ఈ భూగోళంపై ప్రతీ 5,000 సం.లకు ఒకసారి యథావిధిగా తిరుగుచూనే ఉంటుంది అని శివపరమాత్మ తెలియజేస్తున్నారు. కల్పం అనగా కాలచక్రం ప్రతీ 5,000 సం.లకు ఒకసారి తిరిగివచ్చుట. ఈ కల్పము నాలుగు యుగాలుగా సమభాగాలుగా విభజింపబడి నది. ఒక్కొక్క యుగ కాల పరిమితి 1250 సం.లు

**సత్యయుగం** - ప్రస్తుత సమయములో పరమపిత శివపరమాత్మ ప్రజాపిత బ్రహ్మ తనువుని ఆధారముగా తీసుకుని స్థాపించేదే ఆదర్శవంతమైన సత్యయుగం. ఇక్కడ శ్రీలక్ష్మి నారాయణులు పాలన చేస్తారు. ఈ యుగం ఆయుష్షు 1250 సం.లు జనసంఖ్య 9 లక్షలతో ప్రారంభమై యుగాంతానికి 3 కోట్లు అవుతుంది. ఈ సమయములో (సంగమయుగం) శివపరమాత్మ తెలియజేసిన జ్ఞాన రాజయోగాలను అభ్యసించిన మానవులే సత్యయుగములో దేవీదేవతలుగా జన్మ తీసుకుంటారు. ఈ యుగములో 1250 సం.లలో ఆత్మ 8 జన్మలు తీసుకుంటుంది.

**త్రేతాయుగం** - ఈ యుగములో సీతారాములు పాలన చేస్తారు. యుగము ఆయుష్షు 1250 సం.లు ఆత్మ యొక్క జన్మలు 12. జనసంఖ్య 3 కోట్ల నుండి యుగాంతానికి 33 కోట్లు అవుతారు. ఈ రెండు యుగాలనే స్వర్గం అని అంటారు.

**ద్వాపరయుగం** - ఈ యుగమునుండే భక్తి ప్రారంభమవుతుంది. సత్య, త్రేతాయుగముల్లోని దేవీదేవతలే పూజారులై తమ విగ్రహాలకు తామే పూజ చేసుకోవటం ప్రారంభిస్తారు. సంగమయుగములో శివపరమాత్మ తెలియ జేసిన జ్ఞానయోగాలను అభ్యసించనివారు భక్తులుగా ఈ యుగం నుండి జన్మలు తీసు కుంటారు. ఈ యుగంనుండే ఇతర ధర్మాలు ప్రారంభమవుతాయి. పరం ధామము నుండి ధర్మపితలైన ఇబ్రహిం, క్రీస్తు, మహమ్మద్, బుద్ధుడు మొదలైన వారి ఆత్మలు వచ్చి ఈ భూలోకములో శరీరాన్ని ధరించి వారి వారి ధర్మాలను స్థాపన చేస్తారు. ఈ యుగం 1250 సం.లు ఆత్మ యొక్క జన్మలు 21.

**కలియుగం** - ఈ యుగము ఆయుష్షు 1250 సం.లు ఆత్మ యొక్క జన్మలు 42. జనసంఖ్య 650 కోట్లకు పైగా ఉంటుంది. ఇక్కడి నుండి భక్తి హీన స్థితికి దిగజారిపోయి పంచతత్వాలను కూడా పూజిస్తారు. ఈ సమయ ములో శివభగవానుడు ఈ భూమిపై అవతరించి స్వర్గ స్థాపన చేస్తున్నారు. వినాశనమునకు ముందే శివపరమాత్మ తెలియజేస్తున్న జ్ఞానరాజయోగాలను అభ్యసించి రాబోవు స్వర్గప్రాప్తిని పొందండి.



**సంగమయుగం** - వజ్రతుల్య యుగం, శివపరమాత్మ అవతరణ యుగం. లుప్తప్రాయమైన ఆది సనాతన దేవీ దేవతా ధర్మం పునఃస్థాపన జరిగే యుగం. ఇప్పుడు మానవులు పరమాత్మ భోదించే సత్య గీతా జ్ఞానాన్ని రాజయోగాన్ని అభ్యసించి భవిష్యత్తులో దేవీ దేవతలయ్యే ఈశ్వరీయ వారసత్వాన్ని పొందుటకు జ్ఞానయజ్ఞంలోనికి ఆకర్షింపబడతారు. భక్తి మార్గంలో నదుల సంగమాన్ని పవిత్రంగా భావించి స్నానాలు చేస్తూంటారు. కానీ శరీర స్నానం చేత ఆత్మ ఏనాటికీ పవిత్రం కాజాలదు. అనాది, అవినాశి బిందు స్వరూపమగు ఆత్మ నదీ స్నానం మాత్రం చేత ప్రక్షాళనం అయిపోయినట్లైతే ఈనాడు ఇంత పాపం పెచ్చు మీరేదే కాదు. నిజానికి పురుషోత్తమ శబ్దం పరమాత్మ వాచకమైనది. ఆత్మ పురుషుడు అని పిలవబడినట్లే పరమాత్మ పరమ పురుషుడు అని పిలవబడును. మానవాత్మల కంటే జ్ఞానము, శాంతి, పవిత్రతాది శక్తులలో సర్వ శ్రేష్ఠుడు అగుటచే పరమాత్మ పురుషోత్తముడు అనబడును. పురుషోత్తమ యుగం ప్రతీకల్పంలో కలియుగాంతం - సత్యయుగ ప్రారంభముల మధ్య





వచ్చు సమయం. ఈ పునీత యుగంలోనే భాగ్యశాలురు అగు పుణ్యాత్మలు పరమ శివుని జ్ఞానామృతధారలలో స్నానం చేసి జీవితాన్ని అమృతతుల్యం ఒనర్చుకుంటారు. పరమాత్మ కల్పమంతటిలో ఈ కళ్యాణకారి పురుషోత్తమ సంగమయుగంలోనే అవతరించి సత్య గీతాజ్ఞానం సహజ రాజయోగం నేర్పి పావన ప్రపంచాన్ని నిర్మించును. ఇక్కడ ఆత్మ ఒక జన్మ తీసుకుంటుంది. ఈ సృష్టి ప్రతీ 5,000 సం.లకు యథావిధిగా తిరుగుచూనే ఉంటుంది. ఈ సృష్టి రహస్యం పరమాత్మునిచే స్వయంగా చెప్పబడినది. ఆత్మ - పరమాత్మ - ప్రకృతిల యొక్క అవినాభావ సంబంధమే సృష్టి.

## మానవాత్మ 84 లక్షల జన్మలు ధరించదు

పరమ ప్రియుడైన శివపరమాత్మ ప్రస్తుతము ఈశ్వరీయ జ్ఞానానికి సంబంధించిన అనేక మధుర రహస్యములు వినిపించినట్లే మానవాత్మ పశు పక్ష్యాది యోనులలో జన్మించదు అని మరొక క్రొత్త సత్యమును తెలియజేసెను. మానవులు తమ పాపములకు ప్రతిఫలముగా మూగ-గ్రుడ్డి-చెవిటి - కుంటిగా లేక అనేక రోగములతో శిక్షలను అనుభవించునే తప్ప పశుపక్ష్యాదులలో జన్మ తీసుకోరు. ప్రతీ మానవాత్మలోనూ జన్మ జన్మాంతర సంస్కారం అనాదిగా సూక్ష్మరూపములో అంతర్గతమై ఉన్నది. అందువలననే మనుష్యాత్మలు తమ విభిన్నసంస్కార-గుణ-కర్మ-స్వభావ- ప్రాలబ్ధములను అనుసరించి సృష్టి నాటక మున తమ పాత్రను అభినయించును. మానవ గుణ కర్మ స్వభావములు, పశుపక్ష్యాదులు గుణ కర్మ స్వభావముల కంటే భిన్నములైనవి. మామిడి టెంక నుండి మిరప చెట్టు మొలవనట్లు మానవాత్మ మానవ జన్మనే తీసుకుంటుంది. కానీ 84 లక్షల పశు పక్ష్యాదులలో జన్మించదు. వాస్తవముగా కల్పమంతటిలో 5000 సం.లలో అంటే నాలుగుయుగాలలో 84జన్మలను తీసుకుని తన కర్మానుసారముగా సుఖ-దుఃఖములను అనుభవించును.ఈ జన్మలు కృత యుగమునందు-8, త్రేతాయుగమునందు-12, ద్వాపరయుగమునందు - 21, కలియుగమునందు-42, సంగమయుగమునందు-1 తీసుకొనును. పరం ధామం అయిన తన మూల నివాసము నుండి ఈ సృష్టి జగన్నాటక రంగముపై పాత్రను అభినయించుటకు ఒకసారి క్రిందకి వచ్చిన ఆత్మ కలియుగాంతం వరకు జనన మరణ చక్రంలో తిరుగుచూనే ఉంటుంది. ఈ నాటకము 9 లక్షల ఆత్మలతో ప్రారంభమై కలియుగాంతమునకు 650 కోట్లకు పైబడును. సృష్టిలో ఈ 650 కోట్ల జీవాత్మలు తమ జన్మ సంస్కారానుసారం ఎక్కువలో ఎక్కువ 84 జన్మలు, తక్కువలో తక్కువ 1 జన్మ తీసుకొనును. మరలా నాటకము

